రణ - హంస - ఇత్యాదులుచరిత్రాదులు॥ బాహుళకమువలన దర్భాదులకు ములోపంబు నిత్యంబు - దర్భ - పనస - ఇత్యాదులు.

వ్యా—చరిత్ర మొదలైనశబ్దంబులయొక్క మువర్ణకంబునకు లోపంబు బహులంబుగఁ గలుగును. అనఁగా 'చరిత్ర, మొదలైనవానియొక్క కడపటనున్న మువర్ణకమునకు వికల్పంబుగాఁ లోపంబుగలిగి 'చరిత్ర—చరిత్రము' అని యుండును. ఇట్లే అలక — అక్షత - హంస - చరిత — అభిలాష - ఘోష - తరంగ - భ్రమ - విజృంభణ - పక్ష — వేగ - స్వర్గ— మొదలైనవానికి రూపద్వయంబు గ్రహింపవలెను. క॥ 'నెరవేసుపర్వులకువిభు నిటలాలకముల్' కవికర్ణరసాయనము. సీ. 'నిటలాలకములంటి నిభృతుఁజుంచుకొన్నని మునిపరాజమునకు మునరుదేంట్లు' భాగ - అష్ట- స్కం. 'అలక' అనుట సులభము. తే. గీ. 'రాజసుఁడప్పుడు వేడ్కతో బుగనతీర్చి| తానముల తోడ నార్ద్రాక్షతములతోడ' ఇందుమతీకళ్యాణము. తే. గీ. 'అహిమభానుఁడు చనుడేర నస్తశిఖరి | నరవినర్చించుకుంకుమాక్షతములయ్యె' కవికర్ణరసాయనము. రెండవరూపము సులభము. క॥ 'బలశాలియైన హంసముఁ| బిలిచితి బురణించిపాఱఁబోలు చఁదనమునక్' భార- కర్ణ. ఉ. 'ఇందునిభాస్యలప్పుడు సమీక్షణచేసిరి రాజహంసముక్' నైషధము. చరిత్రాదులలోఁ జేరినతక్కంగలశబ్దంబులు సులభంబులు కావున లక్ష్యంబు లుదాహరింపఁబడవయ్యె. ఈసూత్రంబులో మువర్ణంబునకే లోపంబు చెప్పఁబడినది. కాని తక్కినవిభక్తులయొద్దవచ్చుముగాగమంబునకుఁ గూడఁ లోపంబగునని యెఱుంగునది. ఉ. చరిత్రను, చరిత్రమును. చరిత్రలను- చరిత్రములను. మా. దర్భ మొదలైనవానియందున్నత్రిము మువర్ణకలోపంబు నిత్యముగాఁ గలుగును. ఉ. 'దర్భ-పనస' ఇత్యాదులు ఇట్లే 'పుళ, కుండ' మొదలైనవి. 'కుండ, పనస' శబ్దంబులు సైకృతంబులని కొందఱియభిప్రాయము- 'పుళ' శబ్దంబునకు 'నీరు' అనునర్థమిచ్చునపుడు 'కుళము' అని చెప్పవచ్చును.

59 సూ—స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు.

దేవుఁడు - సకలసురలు ॥ స్వర్గివాచియనుటచే భూదేవులు - భూసురుఁడను ప్రయోగంబులబాధితంబులయ్యె.

వ్యా—స్వర్గనివాసులను జెప్పు దేవశబ్దమును, సురశబ్దంబును గ్రమముగా నేకవచనమందును, బహువచనమందును బ్రయోగింపఁబడును. ఉ. 'దేవుఁడు' ఇచ్చట స్వర్గనివాసియర్థము. కాన నేకవచనముగలది. 'సకలసురులు' ఇత్యాది కర్మధారయసమాసము. నిత్యబహువచనము. 'భూదేవులు' 'భూసురులు' ఇచ్చట నీశబ్దంబులకు బ్రాహ్మణులర్థము. దేవసురశబ్దంబులు గలిగిన యీసమాసంబులచే భూనివాసులు బోధింపఁబడినందునఁ దైవిధ్యంబుకు సామాన్యముగా నేకవచనబహువచనంబులు కలిగెను.

60 సూ—సురశబ్దంబునిత్యంబుగానసురశబ్దమువైకల్పికముగాస్త్రీత్వంబులకు సంస్కృతసమాసంబునఁగావు.

సురలు - అసుర - అసురుఁడు ‖ నిఖిలసురలు - రావణాసురుఁడు ‖ ఎల్లసురలు - ఎల్లయసురలు - ఎల్లయసురులు.

వ్యా—'సుర' అనుశబ్దంబు నిత్యంబుగాను, 'అసుర' అనుశబ్దంబు వైకల్పికంబుగాను, స్త్రీలింగంబులతో సమానంబులగును; కాని సంస్కృతసమాసంబునమాత్రంబునఁ గావు. ఉ. సురలు. ఇచ్చట 'సుర' శబ్దంబు నిత్యంబుగా స్త్రీలింగంబుతో సమానంబుగావున నుకారమువచ్చి 'సురులు' అనికాలేదు. 'అసుర' శబ్దంబు వైకల్పికంబుగా స్త్రీలింగసమంబుగనుకఁ బ్రథమైకవచనలోపంబుగలిగి 'అసుర' అనియును. పక్షంబుననుత్వ దుత్వర్ణకంబులతో 'అసురుఁడు' అనియును రూపంబులైనవి; కాని సంస్కృతసమాసంబున స్త్రీత్వాతిదేశంబు లేనియందున నుత్వంబు గలిగి 'రావణాసురుఁడు' అనియయ్యెను. 'సుర' శబ్దంబునకుఁ దెలుఁగుసమాసమందు స్త్రీత్వవర్తంబు నిత్యంబు. ఉ. ఎల్లసురలు. 'అసుర' శబ్దంబునకు వైకల్పికము, ఉ. ఎల్లయసురలు' ఎల్లయసురులు. మొ

61 సూ—దూతాదులకు స్త్రీత్వంబుబహుళంబుగనగు.

దూత - దూతుఁడు - యోధ - యోధుఁడు - శుంఠ - శుంఠుఁడు‖ బహుళగ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబునిత్యంబు ‖ సింగంబుదూతయగుజంబుకంబు.

వ్యా.—మాత మొదలైనశబ్దంబులకు స్త్రీసద్భావము బహుళముగాఁ గలుగును. 'మాత' ఇచ్చటఁ బ్రకృతిమైకవచనలోపము. 'మాతుఁడు,' స్త్రీసద్భావంబు పాక్షికంబు. గావున నుత్వమువ్వర్ణకంబులు కలిగెను. ఇట్లేయోధ- యోధుఁడు. హంస- హంసుఁడు. ము. సీ. నిత్యసత్యవ్రత నిష దేశ నీవు మాకమరంగ మాతవై యభిమతంబు| సేయుము భార - ఆర- 2ఆ. క|| కోపింపం| జనదు జననాథున కుమా| తునిజంపుటనరకమాట ధ్రువమని రార్యుల్, భార - శాంతి. మఱియు బహుళమని చెప్పుటచేత నమహత్తును జెప్పునపుడుమాత్రము స్త్రీసమముగానుండుట నిత్యమని భావము. ఉ. 'సింగంబు మాతయన జంబుకంబు' ఇచ్చట 'సింగంబు మాతుఁడగు జంబుకంబు,' అనిమహత్తుగాఁ బ్రయోగింపఁగూడదు. మహద్వాచకమగునపుడు డువర్ణకంబులతోఁ బ్రయోగింపఁబడును. ఉ. మేఘుఁడు, మాతుఁడు. 'ముద్దరాజు రామన్న కవిజనసంజీవిని యందుమాతయనియేకాని మాతుఁడని లేదను గాని రెండును గలవు, అని తిమ్మకవీంద్రుఁడువచించెను.

62 సూ.—పృథ్వీవాచిభూశబ్దంబునకుభువియగు.

భువి - భువులు - భువిని - భువులను.

వ్యా.—భూమ్యర్థకమైనభూశబ్దంబునకు నామవాచకము 'భువి,' అగును. ఉ. భువి— భువిని- భువులను- ము.

63 సూ.—నౌశబ్దంబునకు నావయగు.

నావ - నావలు - మహానావ - కొందఱునౌవియనియునాదేశం బగునందురు.

వ్యా.—'నౌ,' అనుశబ్దంబునకు నామవాచకము 'నావ,' అనియగును. ఉ. నావ- నావలు- మహానావ. కొందఱు 'నౌ,' అనుశబ్దంబునకు 'నావి,' అనికూడ నామవాచకముండునందురు.

64 సూ—రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాష నగు.

ఇగ్లౌ సూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు ॥ రో — రై గ్లో - గ్లౌ.

వ్యా—‘రై, గ్లౌ, అనుశబ్దంబులకు ఓకారము విభాషగా నగును. అనఁగా:— ‘రో, అనియు, ‘గ్లో, అనియుఁ, జెప్పవచ్చునని భావము. ఉ॥ రోగలవాఁడు—రై యిచ్చును. గ్లోలు-గ్లౌలు. ఇత్యాదులు ‘రై, గ్లౌ, ఈశబ్దంబులకు ‘ఇగ్లౌ, అనునలువది నాల్గవ సూత్రంబునఁ బ్రథమైకవచనలోపంబుగలిగెను.

65 సూ.—ఐకారం బీకారతుల్యంబు.

రైని - రైకి — కైని - కైకి — పైని— పైకి.

వ్యా—ఐకారం బీకారాంతములతో సమానము. అనఁగా ఈకారాంతంబులకు నిరువదియాఱవసూత్రంబుచే ప్రథమకుఁ దక్క విభక్తుల ఉత్వంబున కిత్వంబగునని చెప్పంబడియె. అది ఐకారాంతంబులకుఁ గూడ నగును. ‘రై + ను, ఐకారం బీకారతుల్యంబు గావున నువర్ణకముయొక్క ఉకారంబునకు నిరువదియవసూత్రంబుచే నిత్వంబు కలిగి ‘రైని, అయ్యెను. ఇట్లే రైని, రైకి— కైని-కైకి, ఇత్యాదులు. పైనన్, అని పెక్కు, రుతప్పుగాఁ బ్రయోగింతురు. ఈసూత్రంబుచేత ‘పైనిన్, అనవలయును.

66 సూ—కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగును.

కంధరము - కంధర॥ విధాతృశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు — విధము॥ కంధరా నాసికా భిక్షాదంష్ట్రా గ్రీవా పాదుకో ల్కాప్రభృతులు కంధరాదులు.

వ్యా—కంధర మొదలైనశబ్దంబులు నపుంసకలింగసమంబులు బహుళంబుగా నగును. ‘కంధర, మొదలైనశబ్దంబులు సంస్కృతంబున స్త్రీలింగంబులు. తెలుంగున

బహుళంబుగా నపుంసకత్వము అతిదేశింపఁబడుచున్నది. కావున స్త్రీత్వంబునఁ బ్రథమైకవచనలోపంబుచే 'కంధర' అనియు, క్లీబత్వాతిదేశంబుచేత 'కంధరము' అనియు రూపద్వయంబేర్పడును. విధాశబ్దంబునకు నపుంసకలింగసమత్వంబు నిత్యంబుగానగును. అనఁగా 'విధము' అని నపుంసకలింగముగానే ప్రయోగముగాని 'విధ' అని ప్రయోగింపఁగూడదు, ఇత్యాది కొన్ని నిఘంటువులయందుఁ బ్రకారార్థమునందుఁ బుంలింగముగాఁ బ్రయోగింపఁబడ్డది. 'విధో విధానే హస్త్యన్నే ప్రకారే వేతనేపిచ' అని పుంలింగమందునజయుని ప్రయోగము. దంష్ట్రాశబ్దంబును బుంలింగంబుగాఁ గానంబడుచున్నది. 'కంధర, నాసిక, భిక్ష, దంష్ట్రి, గ్రీవ, పాదుక, ఉల్క, ఇత్యాదిశబ్దంబులు కంధరాదులు.

## ఇంకహలంతప్రకరణము.

67 సూ—హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బగు నామంబగు.

దృక్ - రాట్ — మరుత్ — విరాట్ — కర్మ - వర్మ॥ శ్వాశబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచన తుల్యంబులె యగు నని యెఱుంగునది.

## —హలంతశబ్దంబులం గూర్చి చెప్పెడిభాగము.—

వ్యా—సంస్కృతమునందుఁ బ్రథమావిభక్త్యంత మెద్దియో యాశబ్దంబు తెలుంగుభాషయందు హలంతంబులకు నామవాచకంబగు. నామమనఁగా:—ధాతువుకానిదియుఁ, బ్రత్యయముకానిదియుఁ, బ్రత్యయంబు కడపటలేనిదియు, నగునర్థముగల రూపము. ఉ॥ దృక్' మొదలైనవి హలంతంబులు. 'శ్వ' అనుశబ్దంబుతక్క 'కర్మ' వర్మ, మొదలైన నకారాంతంబులెల్లను సంస్కృతప్రథమైకవచనములే యిందు నామవాచకములగును.

68 సూ—ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లునకగు.

ఉగాగమాంతంబుల కిగ్లోసూత్రముచేఁ బ్రథమైకవచనలోపం బగు॥ రుక్కు — రాట్టు - మరుత్తు - వీరుత్తు॥ ఉగాగమంబులేమిం జేసి యిచటనాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు॥ కర్మము —వర్మము — చర్మము — సుధన్వుఁడు సుత్రాముఁడు.

వ్యా—తుదిహల్లునకు ద్విత్వంబై ఉకారంబంతాగమంబుగానచ్చును. ఉగాగమంబంతమందుఁగలశబ్దంబులకు 'ఇగ్లో' అనునలువదినాల్గవసూత్రంబునేతఁ బ్రథమైకవచనంబునకు లోపంబుకలుగును. ఉ. రుక్కు - రాట్టు - మరుత్తు - మొదలైనవి. స్పష్టార్థము ప్రక్రియాక్రమంబించుక వ్రాయఁబడును. 'రుక్'. ఇది సంస్కృతంబులోఁ బ్రథమైకవచనాంతంబు. ఈప్రథమైకవచనమే (రుక్) తెలుఁగులో నామంబగు. (ప్రాతిపదికము) పిమ్మట నీశబ్దంబుయొక్క యంత్యమైనకకారంబునకు ద్విత్వంబును, అంతాగమంబైన ఉకారంబును, ఈప్రకృత సూత్రంబుచేఁ గలిగి 'రుక్కు' అగును. ఇయ్యది ఉకారాంతంబు కావున నలువదియెనిమిదవ సూత్రంబుచే వువర్ణకంబు పుట్టి నలువదినాల్గవసూత్రంబుచేత లోపించినది. ఇట్లే. 'రాట్టు - మరుత్తు - వీరుత్తు' ఇత్యాదులయందుఁ బ్రక్రియాక్రమంబూహింపుకొనునది. 'కర్మన్' ఈశబ్దంబు సంస్కృతంబులో నకారాంతంబు. నకారంబునకులోపంబువచ్చి దీనిప్రథమైకవచనము 'కర్మ' అని యుండును. పైసూత్రంబుచే నీసంస్కృతప్రథమైకవచనరూపంబె యీ తెలుఁగుభాషయందు నామంబగు. అమహన్నపుంసకంబు గావున నీయదంతంబునకు మువర్ణకంబుకలిగి 'కర్మము' అని యుండును.. ఇట్లే. వర్మము, చర్మము' మొ. ఇవి సంస్కృతంబులో నకారాంతహలంతంబులైనను తెలుఁగులో అకారాంతంబులైన 'కర్మ వర్మ - చర్మ' ఇత్యాదులే ప్రాతిపదికములై తుదిహల్లు లేమింజేసి ద్విత్వంబును, ఉగాగమంబును, రావయ్యెను. గొప్పపండితులు సయితము 'కర్మ' అను ప్రథమైకవచనాంతరూపంబు సంస్కృతభాషలో వాక్కునకు నభ్యస్తంబగుటంజేసి తెలుఁగులో మువర్ణకంబు లేకుండ 'కర్మ' అని సంస్కృతప్రథమైకవచనంబే ప్రయోగింతురు; కాని 'కర్మము' అని యుపయోగింపవలయును. 'కర్మము' అనుదానికి 'కర్మంబు' అను

రూపాంతరంబు గ్రంథంబులఁ గవులువాడుచుండిరి. ఇట్లే. ధర్మము - ధర్మువు. అర్ఘము - అర్ఘువు. వర్గము - వర్గువు. (వర్గు, అనియు మఱియొకరూపంబు) మొదలైనవియు గ్రంథంబులయందుఁ గలవు. ఇందులకుఁ బ్రమాణము. «భవేద్ధర్మాది శబ్దానాంచుశ్చవృత్త్యాత్రికుత్రచిత్, అని యహోబలపండితీయమునందుదాహరింపఁ బడినది. చ॥ అవని యరాజకంబయినయప్పుడు భూప్రజలందు సర్వధర్మువులు దొలంగుదేవ మునిముఖ్యులు వాయుదురోలి వృష్టిలే। దవు మఱియర్ఘువుల్ దరుగునందురు గావునఁ గాలయాపనం। బనితథవాక్యచేయకరయంబున రాజ్యము నిల్పుమిత్తతిన్, భారఆది - 4ఆ. నకారాంతమైన «సుధన్వన్, అను శబ్దంబుయొక్క ప్రథమైకవచనంబులు సంస్కృతంబులో «సుధన్వా, అని దీర్ఘాంతంబుగ నుండును. ఈదీర్ఘాంతంబే తెలుఁగు భాషలో నామంబైె «నామంబులకుదు, అను నేఁబదినాల్గవసూత్రప్రకారంబు ప్రాప్తంబుకాఁగి మహద్వాచకశబ్దంబగుటచే నిరువదియొకటి యిరువదిరెండవసూత్రంబులచేత నుత్వడుజ్ఞులు గలిగి «సుధన్వుఁడు, అయినది. ఇట్లే «సుత్రాముఁడు, ఇత్యాది మహద్వాచకనకారాంతశబ్దంబు లూహించుకొనవలయును.

69 సూ—దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.

వాక్కు - వాకు॥ స్వరాట్టు - స్వరాటు.

వ్యా—దీర్ఘముతరువాతవచ్చు హల్లునకు ద్విత్వము బహుళముగా నగును. «వాక్, అను నీశబ్దంబున కంఠంబైన కకారంబునకు ముందుదీర్ఘంబుండుటచే ద్విత్వంబు బహుళంబై «వాక్కు, అనియుఁ, బాక్షికంబై «వాకు, అనియు నగును. ఉగాగమంబు మాత్రంబు అఱువదియెనిమిదవసూత్రంబుచే నిత్యంబుగానగును. అఱువదియెనిమిదవ సూత్రంబులో ఉగాగమద్విత్వంబులు సన్నియోగశిష్టంబులైనను, ఈప్రకృతసూత్రంబులో ద్విత్వంబొక్కటియే బాహుళకంబుగ నివర్తింపఁబడినది. కావున ద్విత్వములేని యప్పుడుకూడ, ఉగాగమంబు నిర్బాధంబుగావచ్చును అందున «వాకు-స్వరాటు ఇత్యాది ద్విత్వరహితరూపంబు లుగాగమంబుతో నుండందగు.

70 సూ.—మతుబాదికంబు ద్వితీయైక వచనాంతతుల్యంబు నామంబగు.

శ్రీమంతమ్ — గుణవంతమ్ — విద్వాంసమ్ — అనడ్వాహమ్ — శ్వానమ్ – ఉపానహమ్ — అప్సరసమ్ — ఇత్యాదులు.

[illegible] తంబులఁ గలిగిన సంస్కృతపదంబుల ద్వితీయైకవచనము యీ తెలుఁగునందు నామంబగు. (ప్రాతిపదికము) అనఁగా సంస్కృతంబునందు ద్వితీయైకవచనంబు మకారాంతంబగును. అనఁగా [illegible] ప్రాతిపదికంబులు. [illegible] లదు. గుణముకలదు, అను నర్థమందు శ్రీమత్, గుణవత్, అను శబ్దంబులు [illegible] బోధించునప్పుడు పైశబ్దంబులే ద్వితీయైకవచనంబులై శ్రీమంతమ్ గుణవంతమ్, అని సంస్కృతంబునందుఁ బ్రయోగింపఁబడు. మకారాంతంబులైన శ్రీమంతమ్ గుణవంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్ శ్వానమ్, ఉపానహమ్, అప్సరసమ్, ఇత్యాది సంస్కృతద్వితీయాంతంబులు తెలుఁగునందు నామంబులగునని యెఱుంగునది.

71 సూ.—దాని యంతిమమకారంబునకు లోపంబగు.

శ్రీమంత - గుణవంత - విద్వాంస - అనడ్వాహ - ఇత్యాది వీనికజంతములకుంబోలె డుమాదులు యథాయోగ్యంబుగ నగు॥ అతఁడు శ్రీమంతుఁడు - ఇతఁడు గుణవంతుఁడు - వానివలన శ్రీమంతము - వీనివంతము గుణవంతము॥ [illegible] అనడ్వాహము - శ్వానము - అప్సరస॥ వక్ష్యమాణసూత్రంబుచే స్త్రీత్వంబున మతుబాదులుజ్యంతంబులై యిందుఁ గ్రహింపఁబడు - శ్రీమతి - గుణవతి విదుషి - శుని॥ మహతివాచ్యంబగునపుడు శ్రీమంతురాలు - గుణవంతురాలు - విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు.

యాట యవసరంబు గావున నీకిత్రింప స్పష్టపఱుపఁబడుచున్నది. మకారాకారాంతంబులైన శబ్దంబులమీఁదను, మకారాంతకారోపధకంబులైన శబ్దంబులమీఁదను, మతుప్ప్రత్యయమకారము సాధారణంబుగ వకారంబగును. ఉ. బుద్ధి-మతి-శ్రీ, ఇత్యాదులకారాంతంబులు కావుగావున, బుద్ధిమంతుఁడు, మతిమంతుఁడు శ్రీమంతుఁడు, ఇత్యాదికముగా మకారముతోనే యుచ్చరింపవలయును, ధన, ఆచార, విద్యా, ఇత్యాదులకారాంతంబులును, దీర్ఘాకారాంతంబులును, గావున మతుప్ప్రత్యయము వకారంబును బొందఁగా ధనవంతుఁడు, ఆచారవంతుఁడు, విద్యావంతుఁడు, ఇత్యాదికముగా వకారంబులతో నుచ్చరింపవలయును. రశ్మి, లక్ష్మి, ఇత్యాదిశబ్దంబు లికారాంతంబులైనను మకారోపధకంబులు గావున రశ్మివంతుఁడు లక్ష్మివంతుఁడు, ఇత్యాదికముగా వకారంబుతోడ నేయుండును. యశస్ తేజస్, ఇత్యాదిశబ్దంబులు అకారోపధకంబులు గావున యశస్వంతుఁడు, తేజస్వంతుఁడు ఇత్యాదికముగా వకారసహితంబుగానే యుండును. పక్షంబున సకారాంతంబులు మతుబర్థంబునందు యశస్వి. తేజస్వి, ఇత్యాదికముగ విని, ప్రత్యయాంతంబుగా నుండును. తెలుఁగునకవిశ్వంబునఁ బ్రాయికంబుగా నవసరంబుగావునఁ బ్రసక్తానుప్రసంగంబున నిచ్చట నీయంశము వివరింపఁబడ్డది.

### 72సూ -ముదాదులకు ప్రథమైకవచన లోపంబులేదు

ముదము - ఉపానహము - స్రజము.

వ్యా — ముత్, మొదలైనశబ్దంబులకుఁ బ్రథమైకవచనలోపంబు గలుగదు. అనఁగా ముచ్ఛబ్దంబు మొదలైనవి హలంతస్త్రీలింగంబులుగావున నలువదియొనిమిదవ సూత్రింబుచే ఉగాగమద్విత్వంబులు గలిగి నలువదినాల్గవసూత్రంబుచేఁ బ్రథమైకవచనలోపంబు గలిగి ముత్తు, ఇత్యాదికముగా ననిష్టరూపంబు కావలసియుండె. తన్నివారణార్థము ముదాదులు డెబ్బదియవసూత్రములోని మతుబాదికగణంబులోఁ బఠింపఁబడియె. అందున ముదమ్, ఉపానహమ్, స్రజమ్, ఇత్యాది మకారాంత సంస్కృత ద్వితీయైకవచనాంతంబులే ప్రాతిపదికంబై డెబ్బదియొకండవసూత్రంబుచేత మకారలోపంబుగలుగు స్త్రీలింగత్వహేతుకమైన ప్రథమైకవచనలోపంబు (ముగ్లకలోపము

ఏఁబదియేడవసూత్రంబుచేఁ బ్రాప్తించుచుండఁగాఁ బ్రకృతసూత్రంబుచే నిషేధింపఁబడి మువర్ణకంబుతో ముదము, ఉపానహము, స్రజము, ఇత్యాదిరూపంబులు సిద్ధించెను.

73 సూ-ఋత్విగాదులుద్వితీయైకవచనాంత తుల్యంబులువిభాషనగు

ఋత్విజుడు - ఋత్విక్కు - నీవృతము - నీవృత్తు॥ ఋత్విగాదికంబాకృతిగణంబు.

వ్యా—ఋత్విక్కు మొదలైనశబ్దంబులు సంస్కృతద్వితీయైకవచనాంతంబులతో సమానమై విభాషగానగును. అనఁగా ఋత్విక్ఛబ్దముయొక్క సంస్కృతద్వితీయైకవచనము ఋత్విజమ్, అనియుండు. ఇదియే తెలుఁగులోఁ బ్రాతిపదికము కాఁగా డెబ్బదియొక్కవసూత్రంబుచే నంత్యమకారంబు లోపించి ఋత్విజ, అయినది. పిమ్మట నిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వడుజ్వర్ణకంబులు కలిగి ఋత్విజుండు, అయినది. విభాష యనుటచే ఋత్విక్ఛబ్దము హలంతంబు గావున నలువదియొనిమిదవ సూత్రంబుచే నుగాగమ ద్విత్వంబుగలిగి నలువదినాల్గవసూత్రంబుచే నైన ప్రథమైకవచనలోపంబుతో ఋత్విక్కు, అనురూపంబు పక్షంబునవచ్చె. నీవృచ్ఛబ్దముయొక్క సంస్కృతద్వితీయైకవచనము నీవృతమ్, దీనియంతిమమకారంబు డెబ్బదియొకటవ సూత్రంబుచే లోపించియు హ్రస్వాంతకంబుగావున ముప్పదితొమ్మిదవ సూత్రంబుచే మువర్ణకంబువచ్చి నీవృతము, ఇట్లయ్యె. విభాష యగుటచే నీవృచ్ఛబ్దంబు హలంతంబు గావున నలువదియొనిమిదవ సూత్రంబుచే నుగాగమ ద్విత్వంబులు గలిగి నలువదినాల్గవసూత్రంబుచేనైన ప్రథమైకవచనలోపంబుతో నీవృత్తు, అను రూపంబు పక్షంబునవచ్చె. వణిక్కు - వణిజుండు. పుష్పముక్కు - పుష్పముచుండు. వేదవిత్తు - వేదవిదుండు. పాలితకకుప్పు - పాలితకకుభుండు. ఘృతస్పృక్కు - ఘృతస్పృశుండు. సుదద్విట్టు - సుదద్విషుండు, అమృతలిట్టు - అమృతలిహుండు. త్వక్కు - త్వచము. తటిత్తు - తటితము. జలముక్కు - జలముచము. మధులిట్టు - మధులిహము. కకుప్పు - కకుభము. ప్రావృట్టు - ప్రావృషము. మొదలైనశబ్దంబులు. ఆకారాగసాన్న

'హనుమంత, అయినది. పిమ్మట నిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నత్వ దుజ్వర్ణకంబులుగలిగి 'హనుమంతుఁడు, అయినది. ఇట్లే భగవానుఁడు - భగవంతుఁడు మొదలైనవి. మఱియు 'హనుమంతుఁడు, అనుదానికి 'హనుమ, అనియు రూపంబు గలదు. ఆ॥ వె॥ పడగనున్న హనుమభయవిహ్వలుఁడుగాఁడు। అరదమునకుసూతుఁ డచ్యుతుండు' భార- క॥ నారూపం। బనుపమ మగునని హనుమ కనిలజుఁడనియెన్ భార - ఆర - 3 అ.

## 75 సూ—విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు.

స్త్రీలింగత్వాతిదేశంబుచేతనుత్వదుజ్ఞులులేవని యెఱుంగునది ॥ విశ్వకర్మ - కృష్ణవర్త్మ - అశ్వత్థామ - యువ - యజ్వ - ఇత్యాదులు.

వ్యా—విశ్వకర్మ మొదలైనశబ్దంబులు స్త్రీలింగతుల్యంబులు. అనఁగా స్త్రీలింగ ధర్మం బారోపించుటచేత నుత్వదుజ్ఞులు రాక ప్రథమైకవచనలోపంబు గలుగును. ఉ. విశ్వకర్మ సంస్కృతంబులో 'విశ్వకర్మన్' శబ్దంబు నకారాంతము. మహద్వాచకంబు. దీని ప్రథమైకవచనము 'విశ్వకర్మా, అని దీర్ఘాంతంబుగానుండును. ఇదియే తెలుఁగులో నలువదియేడవసూత్రంబుచేఁ బ్రాతిపదికంబుగా నెంచఁబడును. తరువాత నేఁబదినాల్గవసూత్రంబుచేత హ్రస్వంబుగలిగి పరిష్కృతసూత్రంబున స్త్రీత్వాతిదేశంబుచే నేఁబదియేడవసూత్రంబుచేఁ (బ్రథమైకవచనలోపంబుగలిగి 'విశ్వకర్మ, అనురూపం బేర్పడినది. ఇట్లే 'కృష్ణవర్త్మ, అశ్వత్థామ, (అశ్వ + స్థామ.) ఇది పృషోదరాదిగణంబులో నిది గాన సకారమునకుఁ దకారముగలిగి "అశ్వత్థామ" అయినది. చిన్నయసూర్యాది గ్రంథంబులందు 'అశ్వత్థామ, అనియుంటప్రమాదకము) యువ, యజ్వ, మొదలైనవి. మఱియుఁ బ్రతిలింగలక్షణశేషమందు 'సీ॥ విశ్వకర్ముని కూఁతువిశదలావణ్య సముజ్జ్వల జేకొని మూర్ఛబోయి' 'హరి- ఉ- 4ఆ. అనులక్ష్యంబునుజూపి 'విశ్వకర్ముఁడు, అనురూపంబు గలదని తద్గ్రంథకర్తగారు నుడివిరి. కాని 'విశ్వకర్మకు కూఁతు, అని సవరించినచో గణభంగము గలుగక సలక్షణంబుగ నుండునని యెఱుంగునది. ఉ. స్వాత్మేన్ ఇట్లు. భార. ఆది 4 ఆ23 బస. క॥ పడయం గావలయు వాఁడు పంక్తిఁగావించు విచిత్రవీర్యక్షేత్రములన్ (విచిత్రవీర్యక = స్వాత్మేన్.

76 సూ.—మహద్వాచకమయి పుంలింగంబగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు.

బ్రహ్మ - ఈశబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు॥ తత్త్వతపోవేదయోగ వాచకంబగునేని బ్రహ్మము నాఁబడు.

వ్యా.—మహార్థంబునఁ బుంలింగంబగు బ్రహ్మశబ్దంబునకు స్త్రీత్వంబు గలుగును. అనఁగా 'బ్రహ్మ' అనునపుడు 'బ్రహ్మదేవుఁడు, యజ్ఞములోని కర్మకారకుఁడు, బ్రాహ్మణుఁడు' అను నర్థంబగు. 'బ్రహ్మన్, శబ్దంబు నకారాంతము. ప్రథమైకవచనము. 'బ్రహ్మా, అని దీర్ఘాంతంబుగా నుండును. పిమ్మట నేఁబదినాల్గవసూత్రంబుచేత హ్రస్వంబు కలిగి ప్రకృతిసూత్రంబుచే 'బ్రహ్మ, అని హ్రస్వాంతంబుగాఁ దెలుంగు ప్రథమారూపంబగు. 'బ్రహ్మ, శబ్దంబునకు 'పరమాత్మ, వేదము, తపస్సు, ఒకగ్రహయోగము' అను నర్థము చెప్పునపుడు 'బ్రహ్మము' అని మువర్ణకంబుతోఁ జెప్పవలెను,

77 సూ.—ఆత్మమనిజంతంబులకు నాంతములగు మనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు.

ఆత్మ - ఆత్మము - ఆత్ముఁడు - మహిమ - మహిమము - అణిమ - అణిమము - గరిమ - గరిమము - లఘిమ - లఘిమము - దేవశర్మ - దేవశర్ముఁడు.

వ్యా.—'ఆత్మన్' శబ్దంబునకును, 'ఇమనిచ్' ప్రత్యయాంతంబులకును, నకారాంతంబులైన మనుజసంజ్ఞావాచకంబులకును, స్త్రీత్వంబు బహుళంబుగా నగును. ఉ. ఆత్మ - ఆత్మము - ఆత్ముఁడు. ఇచ్చట స్త్రీలింగత్వంబుచే 'ఆత్మ' అయినది. 'ఆత్మము' ఇది బ్రహ్మము మనస్సు శరీరము స్వభావము, ఇత్యాదికము తెలియజేయునపుడు మువర్ణకాంతంబుగా నిల్చుండును. 'ఆత్ముఁడు, ఇచ్చట స్త్రీవద్భావము వైకల్పికంబుగావునఁ బక్షంబున నుత్వడువర్ణకంబులు గలిగెను. 'మహిమ, గరిమ' మొదలైనవి. 'ఇమనిచ్' ప్రత్యయాంతంబులు స్త్రీవద్భావంబున నేఁబదియేడవసూత్రంబుచే మువర్ణ

కంబు లోపించియుఁ బక్షంబున మువర్ణకంబుతోఁ గూడియుఁ రూపద్వయంబగును. ఉ. మహిమ – మహిమము– ఇట్లే అణిమ – అణిమము– గరిమ– గరిమము–లఘిమ–లఘిమము. మొ. (దేవశర్మ' ఇత్యాదినాంతము– సంజ్ఞావాచకము. ప్రత్యయము బహుళమగుటచేత 'దేవశర్మ' అనియుఁ, బక్షంబున 'దేవశర్ముఁడు' అనియు రెండురూపంబులు ఇట్లే కృతవర్మ–కృతవర్ముఁడు మొ. ఉ. ఉజ్జ్వలఘనశక్తి వెచి కృతవర్మని బాహులనొంచి ధైర్యనిశ్చలమతి' భార. ద్రో– 4ఆ.

(78) సూ—మహత్త్వంబునస్వార్థపరంబగు రాజశబ్దము రాజునాఁబడు.

రాజు-ఖగరాజు ॥ అమహత్త్వంబునందు – రాజము– వృక్షరాజము ॥ ఉపసర్జనత్వంబునందు – హతరాజుఁడుపరశురాముఁడు.

వ్యా.—మహత్త్వంబునందు 'రాజ' శబ్దార్థము విశేషణంబు గాకుండఁ బ్రధానముగా నెంచఁబడునపుడు రాజు, అనఁబడును ఉ. రాజు– ఖగరాజు–ఇవి మహద్వాచకంబులు, ఖగరాజు, అనునపుడు పక్షులకు రాజని యర్థము కావునషష్ఠీతత్పురుషసమాసము (ఉత్తరపదప్రధానస్తత్పురుషః' అనుటంజేసి సమాసంబులో నుత్తరపదంబైన రాజశబ్దంబుయొక్క యర్థమే ప్రధానమైనది; కావున డుమ్వర్ణకలోపంబుతో నుకారాంతమయ్యె. అమహద్వాచకంబునందు నకారాంత 'రాజన్' శబ్దము అఱువదియేడవ సూత్రంబుచే సంస్కృతప్రాతిపదికసమానాకారంబై యనఁగా 'రాజా' అని దీర్ఘాంతంబై రేఁబదినాల్గవసూత్రంబుచే హ్రస్వంబుగలిగి ముప్పదితొమ్మిదవ సూత్రంబునం జేసి మువర్ణకంబుతో 'రాజము' అను రూపమేర్పడెను. (వృక్షరాజ' శబ్దంబు టచ్ప్రత్యయాంతంబై 'రామ' శబ్దంబువోలె సంస్కృతంబులో నదంతంబు. అమహదర్థకంబు గావున ముప్పదితొమ్మిదవ సూత్రమ్ముచే (వృక్షరాజము' అయినది. ఇట్లే 'ఖగరాజ' శబ్దము సంస్కృతంబులో నదంతంబైనను మహద్వాచకంబగుటంజేసి యీసూత్రప్రకారంబున డుమ్వర్ణకలోపంబు నిపతింపఁబడినది కావున 'ఖగరాజు, అని యుత్వమాత్రంబుతోనే ప్రయోగంబయ్యె. ఉపసర్జనత్వంబునందు (అప్రధానార్థమందు.) (హతరాజుఁడు పరశురాముఁడు పరశురాముఁడు చంపఁబడిన రాజులుగలవాఁడు

కారము ప్రకృతిసూత్రంబున లోపింపఁగా నపుంసకంబు గావున ముప్పదితొమ్మిదవ సూత్రంబున ముప్రత్యయంబు వచ్చి 'జగము" అనియైనది. వైకల్పికంబనుటచే లోపము రానియపుడు అరువదియేడవసూత్రంబుచే "జగత్" అను తకారాంతంబై ప్రాతిపదికంబై యరువదియెనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులుగలిగి "జగత్తు" అనియైనది. 'ఇంద్రజిత్' అనునపుడు ప్రకృతిసూత్రంబుచే, తకారములోపింపఁగా "ఇంద్రజి" అని యొకరూపంబును, తకారలోపము లేనియపుడు అరువదియెనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులు గలిగి "ఇంద్రజిత్తు" అను మఱియొకరూపంబును, డెబ్బదిమూఁడవసూత్రంబుంబట్టి ఋత్విగాదులతోఁ జేరినదగుటచేఁ బ్రాతిపదికము ద్వితీయైకవచనాంతతుల్యంబుగావున "ఇంద్రజితమ్" అనికాఁగా డెబ్బదియొకండవసూత్రంబుచే నంత్యమకారము లోపించి యిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుప్రత్యయవర్ణకంబులు రాఁగా "ఇంద్రజితుఁడు" అను రూపాంతరంబును నయ్యెను. నాకొమరుఁడింద్రజిత్తుఁడు | లేకుండుట చేటువాటిలెఁ" అచ్చ-రా-యుద్ధకాం. ఆ॥ వె॥ ఇంద్రజిత్తుఁడప్పుడేనకులోఁ బ్రవునిఁకే ! సూర్యవంశ తెలిసి పరాగ్గతిని' మొల్ల-యుద్ధ- ఆ॥ వె॥ చారులరుసటంచి సౌమిత్రిచే నింద్ర | జిత్తుఁడీల్గెననుచుఁ జెప్పుటయును" మొల్ల-యుద్ధ-2 ఆ. పైప్రయోగంబులు, ఈ గాగమద్విత్వంబులపై దుప్రత్యయకంబుతోఁ బ్రయోగింపఁబడెఁ గావున సాధుత్వంబునను సందేహాస్పదంబుగ నున్నవి. పైమూఁడవ ప్రయోగంబు "ఇంద్ర | జితుఁడుసీల్గెనుచుఁ జెప్పుటయును" అని సవరించినసలక్షణంబుగనుండును. ఆంధ్రశబ్దచింతామణియందు సూత్రము 'ఇంద్రజిత్తుఁడు' అను ప్రయోగము సాధీయముగాఁ జెప్పఁబడెను. ఇంద్రజి, ఇంద్రజిత్తు" శబ్దంబులకు నింద్రజితుండనుపదంబు రూపాంతరంబే కాన దీనియర్థము-ఇంద్రుని జయించువాఁడు. మఱియు నీశబ్దంబు-ఇంద్రునిచేత జయింపఁబడినవాఁడనియు, నర్థమువచ్చును. కావున "ఇంద్రజితుండు" అను శబ్దంబునకు-ఇంద్రుని జయించిన రావణపుత్రుఁడును, ఇంద్రునిచే జయింపఁబడినవాఁడును ననియు, నర్థము శ్లేషయందును, ప్రయోగించుతఱిఁ జమత్కృతిగానుండును.

80 సూ—సాంతసంబోధనకారంబునకు లోపంబు బహుళంబుగానగు.

ఉరము - ఉరస్సు - వక్షము - వక్షస్సు — అర్చి—అర్చిస్సు - ధనువు - ధనుస్సు - ఆయువు - ఆయుస్సు ॥ బహుళగ్రహణంబునం జేసి పయఃప్రభృతులు సకారంబునకు లోపంబులేదు ॥ పయస్సు - వయస్సు - సరస్సు.

వ్యా — సకారాంతములయందుఁ గలపదముల కడపటిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగును. 'ఉరస్' అనుశబ్దము సకారాంతపదము. దీనియందలి యంత్యాక్షరంబైన సకారము ప్రకృతిసూత్రంబున లోపింప నపుంసకలింగమవుటచే ముప్పది తొమ్మిదవసూత్రంబున మువర్ణకంబు రాఁగా 'ఉరము' అనిరూపమైనది. సవర్ణములోపింపనియప్పుడు అఱువదియెనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులతో 'ఉరస్సు' అనియైనది. 'వక్షము' అనుశబ్దంబు పైదానివలెనే యెఱుంగునది. 'అర్చిస్' అనుశబ్దంబునందలి కడపటి యక్షరంబైన సకారంబు ప్రకృతసూత్రంబున లోపింపఁగా 'అర్చి' అని యైనది. మఱియు నలువదినాల్గవసూత్రంబుచేఁ బ్రథమైకవచనంబునకు లోపంబు గలిగెనని యెఱుంగునది. సవర్ణలోపము కలుగనియప్పుడు అఱువదియెనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులచే 'అర్చిస్సు' అయినది 'ధనుస్' అనునపుడు కడపటియక్షరంబగు సకారంబు ప్రకృతసూత్రంబున లోపించి నలువదియెనిమిదవసూత్రంబుచే వువర్ణకంబువచ్చి 'ధనువు' అనియును, సవర్ణములోపింపనియప్పుడు అఱువదియెనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులుగలిగి 'ధనుస్సు' అయినది. ఇట్లే 'ఆయువు' మున్నగు శబ్దంబులు గ్రహించునది. బహుళమని చెప్పుటచేత 'పయః' మొదలైన వానియొక్క సకారంబునకు లోపంబు కలుగదు. అనఁగాఁ గడపటివర్ణమైన సకారంబునకు లోపంబు కలుగక 'పయస్సు' అనియేకాని 'పయము' అనియుండదు. ఆధునికులు కొందఱు 'పయము' అని ప్రయోగించిరేని, ఇయ్యవి కావ్యంబుల నగ్రాహ్యంబులు. 'వయస్' అనుశబ్దము పక్షికర్థమైనపుడు 'వయస్సు' అనియును, ప్రాయమున కర్థమైనపుడు వయస్సు, వయసు, అను రెండురూపంబులుగలవు. కాని 'వయస్సు' అనునపుడు పక్షిపర్యాయముగాఁ దెలుఁగునఁ బ్రయోగంబు మృగ్యంబు. 'ఓజస్సు', అనస్సు, అంభస్సు, వర్చస్సు, రక్షస్సు, పాథస్సు, సరస్సు, ఆయుస్సు, హవిస్సు, చేతస్సు, మహస్సు, అంహస్సు, ఆగస్సు, ఇత్యాది శబ్దంబులకు మువర్ణకంబు రాదు. తుదిసలోపంబు బహుళంబుగ నగు 'పథిన్' శబ్దంబునకు 'పథము', 'పుర్' అనుశబ్దంబునకు 'పురము', ఇత్యాది ప్రథమైకవచనాంతంబు

82 సూ—వేధఃపురోధఃపురోధసుఁడు.

వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు వైకల్పికముగా సలోపస్త్రీత్వాద్యభావంబులు గనిపించనిపాతింపంబడియె.

వ్యా—వేధ - పురోధ - పురోధసుఁడు. అనఁగా తొమ్మిదియొకండవ సూత్రంబుచేత నవి సాంతంబులగుటచే వేధుఁడు - వేధసుఁడు - పురోధుఁడు—ఇట్లు నిష్టరూపంబులగుచుండ 'వేధః' శబ్దంబునకు సకారలోపంబును; స్త్రీత్వాదిదేశంబును, నిత్యంబుగాను; 'పురోధ', శబ్దంబునకు సకారలోపంబును, స్త్రీత్వాతిదేశంబును, నీసూత్రంబుచేత వైకల్పికముగాను; నిపతింపఁబడినవి, (నిపాతమనఁగా—మతియొక రీతిప్రయోగము సామాన్యసూత్రముచేతఁ గలుగుచుండఁగా దానికి విరుద్ధముగాఁ బలికిన, రూపము.) 'వేధ', ఇచ్చట సకారములోపించి స్త్రీత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపంబుగలిగినది. 'పురోధ— పురోధసుఁడు, ఇచ్చట సకారములోపించి స్త్రీత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపంబుకలిగె 'పురోధ', అయినది పక్షంబున 'పురోధసమ్, అను ద్వితీయాంతము ప్రాతిపదికంబై డెబ్బదియొకండవసూత్రంబుచే నంతిమమకారలోపంబును, ఇరువదియొకటియిరువది రెండుసూత్రంబులచే నుత్వడుప్వర్ణకంబులు గలిగి 'పురోధసుఁడు, అయినది.

83 సూ—మనఃప్రభృతులసకారంబునకుద్విత్వంబువిభాషనగు.

మనసు - మనస్సు - శిరము - శిరస్సు - సదసు - సదస్సు - సలోపంబయ్యేనేని - మనము - శిరము - సదము.

వ్యా—'మనస్, మొదలైనశబ్దములయొక్క సకారంబునకు ద్విత్వంబు విభాషగానగును. ఉ. మనసు- మనస్సు. ఇచ్చట "మనస్" అనియుండఁగా నలువదియొని మిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులురాఁగా 'మనస్సు, అయినది. పిమ్మట నీసూత్రంబునందు ద్విత్వంబు విభాషగావున నేకసకారంబుతో నుగాగమాంతరూపంబును నుండు. ఉ. మనసు- మనస్సు. ఇట్లే 'శిరసు. సదసు, తపసు- వక్షసు- యశసు-

తపసు - తమసు - తేజసు - మొదలైనవి గ్రహింపవలయును. వీనియంత్యసకారంబునకు నెనుబదియవసూత్రంబుచే లోపంబుగలిగి యదంతనపుంసకలింగంబుగావున ముప్పదితొమ్మిదవసూత్రంబునే ముగాగమంబు రాఁగా మనము, శిరము, పదము, ఉరము- వక్షము- యశము- తపము- తమము- తేజము, మొదలైనవి యయ్యెను.

84 సూ—ద్యుహ్వాచ్ఛబ్దంబులకుదివిహ్వాదియగు.

దివి - దివులు - హ్వాది - హ్వాదులు॥

వ్యా—దివ్, అను వకారాంతశబ్దంబునకు 'దివి అనియు, హ్వాద్, అను దకారాంతశబ్దంబునకు "హ్వాది" అనియుఁ బ్రథమావిభక్తి యగును. ఉ. దివి-దివులు హ్వాది-హ్వాదులు.

85 సూ—స్త్రీలింగంబులెల్లస్వస్వనియతంబులగుస్త్రీప్రత్యయంబులంగూడియిందుఁబ్రవర్తిల్లు.

| | | |
|---|---|---|
| నామము... | ...స్త్రీప్రత్యయాంతము... | తత్సమము. |
| కర్తృ... | ... కర్త్రీ ... | ... కర్త్రి |
| జనయితృ... | ...జనయిత్రీ ... | ...జనయిత్రి |
| భాగ్యశాలిన్ | ...భాగ్యశాలినీ ... | ...భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | ...బుద్ధిశాలినీ ... | ...బుద్ధిశాలిని |
| మతిమత్... | ...మతిమతీ ... | ...మతిమతి |
| గుణవత్... | ...గుణవతీ ... | ...గుణవతి |
| విద్వత్... | ...విదుషీ ... | ...విదుషి |
| వనజముఖ ... | వనజముఖీ ... | ...వనజముఖి |
| | వనజముఖా... | ...వనజముఖ |
| మీననేత్ర... | ...మీననేత్రా ... | ...మీననేత్ర |

అంగాదులకుఁదప్ప సంయోగోపధంబులకు ఙీప్రత్యయంబులేమిం జేసి - మీననేత్రి - పద్మనేత్రి - ఇత్యాద్యసాధువులు.

వ్యా:—సంస్కృతభాషలో స్త్రీత్వము బోధింపఁబడినపుడు స్త్రీప్రత్యయంబు లేవేవి సంస్కృతవ్యాకరణంబునఁ గలుగునో యట్టిప్రత్యయాంతంబులే యీభాష యందు ప్రాతిపదికంబులగును. ఉ. కర్త్రి, జనయిత్రి, బుద్ధిశాలిని, గుణవతి, మీననేత్రి- మొదలైనవి. కర్త్రి, జనయిత్రి, ఈశబ్దంబులకు సంస్కృతభాషలో కర్తృ జనయితృ, శబ్దంబులు మూలప్రాతిపదికంబులైనపుడు ఋకారాంతంబులుగా నుండును. సాంస్కృతికంబులైన ఋకారాంతశబ్దంబులు స్త్రీలింగంబులో నీకారాంతంబులై “కర్త్రీ-జనయిత్రీ” అని దీర్ఘాంతంబులగును. పిమ్మట నేఁబదినాల్గవసూత్రంబుచే హ్రస్వాంతంబులగు. “భాగ్యశాలిన్- బుద్ధిశాలిన్” ఇత్యాదిసాంస్కృతికనకారాంత పుంలింగంబులు సంస్కృతభాషలో నీకారాంతంబులై తెలుఁగున హ్రస్వాంతంబులై “భాగ్యశాలిని, బుద్ధిశాలిని” ఇట్లుండును. మతిమత్, గుణవత్ ఇత్యాదితకారాంత సాంస్కృతికపుంలింగంబులు స్త్రీత్వంబున నీకారాంతంబులై తెలుఁగున హ్రస్వాంతంబులగును. ఉ. మతిమతి-గుణవతి. సంస్కృతభాషలో ఋకారాంత నకారాంత తకారాంతశబ్దంబులు సామాన్యంబుగా నీకారాంతంబులగు. తెలుఁగులో నట్టిదీర్ఘంబునకు, హ్రస్వంబు కలుగును. ధాతృ-ధాత్రి. దుష్టశాసితృ-దుష్టశాసిత్రి. నేతృ-నేత్రి గుణిన్ - గుణిని. ధనిన్ - ధనిని. కాశీవాసిన్ — కాశీవాసిని. ధీమత్ —ధీమతి. మహత్ - మహతి. సౌందర్యవత్ - సౌందర్యవతి. (సూత్రము) అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు ఙీప్రత్యయంబులేమిం జేసి. మీననేత్రి, పద్మనేత్రి, ఇత్యాదు లసాధువులు. (వ్యా:) అకారాంతములైనశబ్దంబులకుఁ దక్క. హల్ సముదాయం బుపధాస్థానమందుఁగల తక్కినశబ్దంబులకు ఙీప్రత్యయము! (స్త్రీలింగబోధకమైన ఈకారము) లేకపోవుటచేత మీననేత్రి — పద్మనేత్రి, మొదలైనశబ్దంబులు దుష్టములు. ఉపధయనఁగా:—శబ్దంబునకుతుదినుండి లెక్కించినచో రెండవదియైనయక్షరము. కాఁబట్టి ప్రకృతంబున శబ్దముయొక్క యక్షరంబుల తుదినుండి లెక్కించుతఱిని సంయోగము (హల్లులకలిమి) రెండవస్థానమం దుండవలయును. మీననేత్రి, అనుశబ్దంబులో తుదివర్ణం బీకారము. పూర్వవర్ణంబులు తకారరేఫంబులు.

ఆవర్ణంబులకే సంయోగమని పేరు. ఈశబ్దంబులో సంయోగము పరమైనందున నికారాంతం బుకాలేదు. ఇట్లే పద్మనేత్ర మొదలైనవి. మీననేత్రి, ఇత్యాదులు, 'మత్స్యములవంటి నేత్రములుగలది, అనుసర్థంబున సాధువులైనను మీనంబులకు నాయకురాలు, అనునర్థంబున సాధువేయగును. మీనంబులకు నాయకురాలనఁగాఁ దననేత్రంబులు మీనంబులనుమించి యున్నవిగావున నట్టినయనంబులప్రాప్యంబున మీనంబులనేలుచున్నదని నేత్రంబులకు నుత్కర్షములభించును. మీనంబులు కన్నులకుసమానములనుట జగద్విదితంబుగావున నయనార్థకశబ్దంబులేకపోయినను, ఉపమానవాచకమీనశబ్దంబుచేతనే నేత్రంబులూహింపఁబడు. ఇట్టియర్థము సౌందర్యవర్ణనాప్రకరణంబునందుఁ బైశబ్దంబులు ప్రయోగింపనప్పుడు స్ఫురింపుననియెఱుంగవలె. (నాసిక - ఉదర-ఓష్ఠ - జఙ్ఘ - దన్త - కర్ణ - శృఙ్గ- అఙ్గ - గాత్ర- కణ్ఠ, ఈశబ్దంబు లీకారాంతస్త్రీలింగంబులుగను, ఆకారాంతస్త్రీలింగంబులుగాను నుండును; గానఁ దెలుఁగులో ప్రాప్యంబుగలిగి ఇకారాంతంబులుగాను అకారాంతంబులుగాను నుండును. ఉ. చంపకనాసికి-చంపకనాసిక. కలకణ్ఠి కలకణ్ఠ. పల్లవోష్ఠి-పల్లవోష్ఠ. మొదలైనవి. ఇట్టి రెండువిధంబుల స్త్రీబోధకములైనప్పుడు వాడవచ్చును. మిగిలినబహ్వచ్-శబ్దంబులకు (రెంటికన్న నెక్కుడచ్చులుగలశబ్దంబులకు) స్త్రీత్వబోధకముగా ఙీప్రత్యయంబురాదు. ఉ. పద్మలోచన-కుటిలకుంతల-పల్లవాధర' మొదలైనవీనిని, పద్మలోచని, కుటిలకుంతలి, పల్లవాధరి, ఇత్యాదికమికారాంతబుగా వాడవలదు. పెక్కురు తెలియక 'నేత్రి' అనియే ప్రయోగింపుచుండిరి గీ|| శరణు జగదంబ లలితవాచాకదంబ | సంపదను సంపదన పూర్ణేందువదన | సత్ప్రణామంబు మృగనేత్రి చారుగాత్రి | సందమల్లివేణి నీకుఁ బద్మజునిరాణి' పట్ప. 4ఆ. తే|| గీ|| పద్మపత్రనేత్రి (హేషత్స్కూపాలపుత్రి) | చిక్కనిరుపారి మరునిరాచిల్క తేజి' చాటుధార. ఇవ్విధంబు ప్రయోగింపరాదు. ఈప్రయోగమునకు నాధునికులగ్రంథములయందు లెక్కలేదేమి. [illegible] 'సు' వర్ణంబుపూర్వమందున్న [illegible] 'పతి' గా [illegible] పెక్కురు 'సుపతి' అనుటకు 'సుపంతి' అని ప్రయోగించిరి. సీ|| '[illegible] దాడిమీఫలము సుపంతికి [illegible] (ఇందు [illegible] అన్న [illegible]గా నుండును) క|| తానూ[illegible] అప్ప-కౌ. (ఇందు తానూరక యాగి యా సుపతి [illegible] సుపంతికిఁ బోలనీ ఖాంతి

సొమ్మునుండె : పృథుపృష్ఠే' నాంచార్-లితా. ఇచ్చో 'సౌభాగ్యమైనవంతంబులుగలది' అర్థ యొక్కటియైనను 'సుదతి' అనిపలికిననువలెనను; కాని స్త్రీలకు గజయానలన్ను ప్రసిద్ధములగుటవలన నవియే చేయుచుండునని యర్థము చెప్పుకొనుము. బైశబ్దంబులన్ని తీరుగ ప్రయోగింపనగు గౌరవముంపనవచ్చును.

(86) సూ—మహదితరంబులగు స్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాషనగు.

పద్మలతమనోహారి - పద్మలతమనోహారిణి - హృద్యంబగువిద్య - హృద్యయగువిద్య॥ మొదవులలోఁగపిల వరిష్ఠంబు - కపిలవరిష్ఠ

వ్యా—మహదాదులుకాని స్త్రీలింగంబుల విశేషణంబులకు నపుంసకలింగధర్మంబు విభాష గానగును. అనఁగా నిర్జీవబోధకములైన స్త్రీలింగంబులవిశేషణంబులు స్త్రీలింగముగాను, నపుంసకలింగంబుగాను, నుండును. ఉ. పద్మలతమనోహారి — పద్మలత-మనోహారిణి. ఇచ్చట 'లత' అనునది జడంబుగావున 'మనోహారి' అనినపుంసకలింగముగాను, 'మనోహారిణి' అని స్త్రీలింగంబుగాను, విశేషణంబు చెప్పనవచ్చును. 'మనోహారిన్' శబ్దము సంస్కృతంబులో నాంతంబగనుక చెనుబదియైదవసూత్రప్రకారంబున స్త్రీలింగరూపము 'మనోహారిణి' అనవలయును. ఇట్లే 'హృద్యంబగువిద్య-హృద్యయగువిద్య' మొదవులలోఁగపిలవరిష్ఠంబు, మొదవులలోఁగపిలవరిష్ఠ, మొదలైనవి గ్రహింపనగును.

(87) సూ—భవచ్ఛత్రాదులకిందుఁబ్రయోగంబులేదు.

భవదాదులగు హలంతసర్వనామంబులకును శత్రురేఫాంతాదులకును దెనుఁగుభాషయందువ్యవహారంబు లేదనియర్థము - సమాసంబులందౌలుతంగడిసి యుండుఁ బ్రయుక్తంబులగు ॥ భవద్గుణంబులు - త్వదాశయము - మత్పుణ్యాశము = అస్మద్రూపము - భవిష్యత్కాలము- ధూర్వహము -ఇత్యాదులెఱుంగునది

వ్యా—భవత్ మొదలైనశబ్దంబులును, శతృప్రత్యయాంతరూపంబులును, రేఫాంతంబులును, తెనుఁగుభాషయందుఁ బ్రయోగింపఁగూడదు. అనఁగా భవత్-త్వత్-మత్, మొదలైనశబ్దంబులును, లసత్-భవిష్యత్, మొదలైనశతృప్రత్యయాంతంబులును, ధూర్-గిర్, మొదలైన రేఫాంతశబ్దంబులును, తెనుఁగుభాషయందుఁ బ్రయోగింపఁబడవుకాని సమాసాంతంబులయందుఁగాక తక్కిన సమాసాదిమధ్యభాగంబులయందుఁ బ్రయోగింపవచ్చును. ఉ. భవద్గుణంబులు - త్వదాశ్రయము - మత్సాహాయ్యము, ఇత్యాది సమాసస్థలంబులయందు భవత్ - త్వత్ - మత్. మొదలైనశబ్దంబులు సమాసాంతర్భాగంబుగాఁ బ్రయోగింపఁబడెను. సమాసాంతంబునందును, వ్యస్తంబునందును వీనికిఁ బ్రయోగములేదు.

---

# ఆచ్ఛికపరిచ్ఛేదము.

---

అచ్చతెనుఁగుం గూర్చి తెలుపునట్టిభాగమునకు నాచ్ఛికపరిచ్ఛేదమని పేరు

1 సూ—సంస్కృతసమేతరంబయిన యీభాషయచ్ఛయనంబడు

స్పష్టము.

వ్యా—సంస్కృతసమములుకాని యీభాష యచ్చతెనుఁగనఁబడును.

2 సూ—ఆచ్ఛికశబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం క్లీబసమంబులునయియుండు.

స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచన లోపాదికంబును క్లీబసమత్వాతిదేశంబుచే మువర్ణకంబునగునని యెఱుఁగునది! అన్న-మిన్న-

వ్యా—బల్లిద, మొదలైనశబ్దంబులు సంస్కృతశబ్దంబులతో సమానములు. అనఁగా మహత్త్వంబునందు బల్లిద, మొదలైనవానికి, తత్సమపరిచ్ఛేదమందలి యిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వము ద్వర్ణకాదులును (ఆదులనుటచే నిగాగమనగాగమంబులు) అమహత్త్వంబునందు ముద్వర్ణకాదులును (ఆదిశబ్దంబుచే ముగాగమంబును) స్త్రీత్వంబునందు ఆలు, శబ్దంబుతో సమాసముకలుగునప్పుడు సంధిపరిచ్ఛేదమునందలి ముప్పదియొకండవసూత్రంబుచే నుత్వరుగాగమంబులును, కలుగునని తెలిసికొనవలెను. ఉ. బల్లిదుఁడు - బల్లిదము - బల్లిదురాలు. మొ. ఇట్లే అక్కజ-కావల-పెట్టిద-బేసిద-మిసిమింప-మొక్కల- మొదలైనవానికి బల్లిదశబ్దంబునకువలెనే రూపత్రయంబు గ్రహింపవలెను.

4 సూ—మహత్తులగుమగాదులకుం గయిరాదులకునుదుజ్ఞగునుత్వంబుగాదు.

మగఁడు - మనుమఁడు ॥ కయిరఁడు - కత్తళఁడు ॥ మగ - మనుమ - రాయ - పాప - ప్రే - తే- ఈకాప్రత్యయాంతంబులు - ఇత్యాదులుమగాదులు ॥ కయిర - కత్తళ - జన్న - నీల - ఇత్యాదులు కయిరాదులు.

వ్యా—మహద్వాచకములైన 'మగ', మొదలైనశబ్దంబులకును, 'కయిర' మొదలైనశబ్దంబులకును, డుజ్ఞకంబువచ్చును. [illegible] ఉ. మగఁడు-మనుమఁడు రాయఁడు-పాపఁడు-ప్రేఁడు-తేఁడు-ఈ-కా- ప్రత్యయాంతంబులు మగాదులు. కయిరఁడు-కత్తళఁడు-జన్నఁడు-నీలఁడు-మొదలైనవి కయిరాదులు ఈమగాదులకును, కయిరాదులకును, ద్వితీయాద్యేకవచనంబునందు బల్లిదాదులకువలెనిగాగమంబు పాక్షికంబుగా తత్సమపరిచ్ఛేదమునందలి యిరువదినాల్గవసూత్రంబుచే నిత్యంబుగ జ్ఞప్తిమందము కోవలెను. ఈకాప్రత్యయాంతంబులు = ఈప్రత్యయంబును, కాప్రత్యయంబును, నంతమునందుఁగల శబ్దంబులు ఈప్రత్యయాంతంబునకు - ఉ. అంపుఈఁడు. మొ. (సూ - తద్ధి-15సూ) కాప్రత్యయాంతంబునకు- ఉ. ఆరెకాఁడు- మొ. (సూ- తద్ధి- 11సూ) ఈమగాది

ంబునకు రేఫంబు కలుగఁగా 'వగవరు' అనియైనది. ఇట్లే అల్లురు-నెయ్యురు-కలియురు- మార్తురు మొదలైనవి గ్రహింపవలెను. 'మల్ల' శబ్దము సాంస్కృతికంబై నను దానిబహువచనలకారంబునకు రేఫంబు పాక్షికంబుగఁ గానిపించెడిని. ఉ. మల్లలు మల్లురు. చ. వలమున విద్యలావు మెయిదర్పముఁ బేర్చి పెనంగు జెట్టిమల్లులవిఱుతుగా మఱిఁగడియలోనన మాఁడ్కిని చేసి చేయుచున్' భార- విరా. 2 ఆ. మవీరారిమ | ల్లురకునక్కటియ సంపదియ బలఘనాసుల్ సంగడాలౌవియు | చ్చరకాంతానవపాళివిస్ఫురడి కాశ్చర్యంబు చర్చింపఁగన్' రామాభ్యుదయము. 1 ఆ.

6 సూ—కొన్ని డుమంతంబుల బహువచనలకారంబునకు రేఫం బును దానికిముందు పూర్ణబిందుపూర్వకడకారంబునగు.

గండండ్రు - మిండండ్రు - ఇత్యాదులు.

వ్యా—'కొన్ని డుమంతంబులయొక్క- బహువచనలకారంబునకు రేఫంబును, ఆరేఫంబునకుఁ బూర్వము బిందుపూర్వకదాపలగలిగిన డకారంబునువచ్చును. ఉ. గండఁడు- గండండ్రు. మిండఁడు - మిండండ్రు. ఇచ్చట 'గండ + లు' అనియుండఁగాఁ బ్రకృతసూత్రంబున లకారంబునకు రేఫంబురాఁగా 'గండ + రు' అయ్యె. ఈరేఫంబునకుముందు దాపలసున్నగల డకారంబురాఁగా 'గండండ్రు' అయినది. ఇట్లే 'మిండండ్రు' గ్రహింపునది. నరసింహవ్యాకరణకారకునిమతంబున 'గండలు, మిండలు' అను బహువచనరూపంబులునుగలవు.

7 సూ—కాప్రత్యయంబుమీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును లఘురేఫంబునకు ముందు బిందుపూర్వకడకా రంబునగు.

విలుకాండ్రు - విలుకాఱు - వేఁటకాండ్రు - వేఁటకాఱు - వేఁడుకకాండ్రు - వేఁడుకకాఱు.

వ్యా.—కా ప్రత్యయంబు తెరువాతిబహువచనలకారంబునకు లఘురేఫంబును, అలఘురేఫంబును, కలుగును. అలఘురేఫంబునకు దాపలనున్నగలడకారంబు వచ్చును.

ఉ. విలుకాండ్రు - విలుకాఱు. ఇచ్చట విలుకా, అనునది ప్రాతిపదికము. దీనికి బహువచనార్థమందు విలుకా + లు, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబునఁ బ్రత్యయలకారంబునకు లఘురేఫంబును, దానికిముందు దాపలనున్నగలడకారంబును రాఁగా, విలుకాండ్రు, అయ్యెను. పక్షంబున విలుకా, శబ్దంబుపైని బహువచనలకారంబునకు నలఘురేఫంబుమాత్రమే కలుఁగగా విలుకాఱు, అయ్యెను. ఇట్లే వేటకాండ్రు—వేడుకకాండ్రు అను నవియు గ్రహింపవలెను. ఉ. వేడుకకాండ్రకై తిరుగు వేశ్యలనాడిన జాడ నన్ననిఁ ట్లాడఁగఁ బాడియౌనె, ఉ- రా 4ఆ. క. పాఱెడు నీరెడగ్రేవ్వఁగఁ దాఁటె చెడిదమైనయొండెడనుకఁ గని పురం | బాఱెనుడువంత వేడుక| కాఱులుజాలరులునూచి క్రందుకొనంగన్, భార- శాంతి- 3ఆ.

8 సూ—తేపప్రభృతుల బహువచనమునకు ముందు డుజ్జగు.

తేఁడులు - తేండ్లు.

వ్యా.—తే, మొదలైనశబ్దంబులు బహువచనంబునకుముందు డుజ్వర్ణకంబు వచ్చును. ఉ. తేఁడులు— తేండ్లు, తేఁడులు, అనుశబ్దంబునందు డుజ్జుజకారేత్కంబు గావున బిందువు పూర్వమందుఁ గలిగె. తేశబ్దంబు దీర్ఘాంతంబగుటచే నర్థానుస్వారంబుమాత్రంబే కలిగెను. తే + లు, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున లువర్ణకంబునకు ముందు డుజ్వర్ణకంబుగలిగి తే + డు + లు, ఇట్లుండఁ బంగడెందవసూత్రంబుచే బహువచనలకారంబునకు ముందున్న డుజ్వర్ణకంబుయొక్క ఉకారంబునకు లోపంబు కలుఁగగా డకారలువర్ణకంబులు సంయుక్తంబులయ్యె (తే + డ్లు) పిమ్మట నీపరిచ్ఛేదమునందలి పదునేడవసూత్రంబున డలకారసంయోగంబునకుఁ బూర్వమందున్న యుఅమున్న బిందువున్నయది తేండ్లు, అయ్యెను. ఇట్లే తేఁడులను— తేండ్లను. మొదలయిన ద్వితీయాదులు.

9 సూ—కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు.

కూఁతురు - కూఁతులు కూఁతురులు - కూఁతుళ్లు - కూఁతురినిత్యాదిరూపంబులు గ్రాహ్యంబులని యెఱుంగునది.

వ్యా—'కూఁతు' అనుశబ్దంబుయొక్క ప్రథమైకవచనంబునకు 'రు' అనునక్షరంబు వచ్చును, ఉ॥ కూఁతురు—దీని బహువచనము—కూఁతులు, కూఁతురులు—కూఁతుళ్లు—కూఁతురిని, ఇత్యాదిరూపంబులు దుష్టంబులు. 'కూఁతు' శబ్దంబు నామవాచకంబు; కావున దానిపైని బహువచనప్రత్యయమొక్కటియె యుండునుగాని యేకవచనంబగు రువర్ణంబుండనేరదు. ఏకవచనబహువచనంబులకు నొక్కవచనాంతంబున సమావేశంబు విరుద్ధము కావున "కూఁతురులు" ఇత్యాదిప్రయోగంబు లసాధువులు.

10 సూ.—చెయువు బహువచనలకారంబున కలఘురేఫంబు విభాషనగు.

చెయువుఱు - చెయువులు - చెయువుఱను - చెయువులను.

వ్యా—'చెయువు' అనుశబ్దంబుయొక్క బహువచనలకారంబునకు శకటరేఫంబు విభాషగానగును. ఉ॥ చెయువుఱు—చెయువులు. చెయువుఱను—చెయువులను. ఈశబ్దంబుయొక్క యకారంబుమీఁది యుకారంబునకు లోపంబును గాన్పించెడిని. ఉ॥ ఇంపు దళ్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటిగాంచి యొల్చు చెయ్వులం జిత్తజుకేళిఁదేలె విలసిల్లుచు జక్కవ దోయివేసవన్ (భార—ఉద్యో—2ఆ. శా॥ చేరం జోటొకతెందుఁ గానక భ్రమం జెయ్వాది భృంగావళిం! గారామారఁగ నుద్ధరించె, ఎఱ్ఱాప్రెగడ హరివంశము. సీ॥ మఱవక ప్రాణేశు మనువురాధిని చెయ్వులన్నియు దక్కఁ జిత్రరేఖ (వసు—5 ఆ. ఉ॥ శింగంబుల్ త్రినిబాలికల్ దిరుగుచుం జెయ్వాది మోదించుచున్ | రంగంబుల్ దిరుగంబడ్డ నవకుఱ్ఱాజీనముల్ గోయుటల్ ఉత్తర రామాయణము.

11 సూ.—అల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును ముందటి లువర్ణంబునకు బిందుపూర్ణకడకారంబునగు.

అంపుఱ్ఱి - అంపఱ్ఱిను - ఆలు - చెలియలు చెల్లెలు - కోడలు మఱఁదులు- ఇవి యాల్వాదులు.

వ్యా—ఆలు, మొదలైనశబ్దంబుల బహువచనలకారంబునకు శేషంబును ముందఱనున్న ప్రకృతిలువర్ణంబునకు దాపలనున్నగల డకారంబును వచ్చును. ఉ. ఆలు-ఆండ్రు. ఇచ్చట ఆలు + లు, ప్రత్యయలకారంబునకు శేషంబురాఁగా ఆలు + రు, ప్రకృతిలువర్ణంబునకు దాపలనున్నగలడకారంబు రాఁగా ఆండ్రు, (ఆండ్ + రు) ఆయ్యెను. ద్వితీయాబహువచనము- ఆండ్రను. ఇట్లే చెలియలు-చెల్లెలు, కోడలు- కోడండ్రు. మొదలైనవి. గ్రహింపవలెను.

(12) సూ—బహువచనము పరంబగునపుడు డలటరలయుత్వంబునకులోపంబు బహుళంబుగానగు.

గుండ్లు - గుండులు-గింజ్లు - గిండులు - కాళ్లు - కాలులు మొసళ్లు - మొసలులు - గోండ్లు - గోంటులు - తుంట్లు - తుంటులు గోళ్లు - గోరులు - సీవిళ్లు - సీవిరులు - బహుళగ్రహణముచే విల్లులు పిల్లులు పులు లిత్యాదులందు లోపంబులేదు ॥ తత్సమంబులంగోటి పిప్ప లిశబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు ॥ కోట్లు - కోటులు-పిప్పళ్లు -పిప్పలులు,

వ్యా.—బహువచనలకారము వచ్చునప్పుడు 'డ - ల - ట - ర' ఈయక్షరంబుల ఉకారంబునకులోపంబు బహుళంబుగాఁ గలుగును. ఉ. గుండులు-గుండ్లు. ఇచ్చట 'గుండు' అనునపుడు బహువచనలకారంబురాఁగా డకారముయొక్క ఉకారంబు లోపించి 'గుండ్లు' (గుండ్ + లు) అయినది. బహుళమని చెప్పుటచేత 'గుండులు' అని సంయోగరహితంబుగనుగలదు. ఇట్లే 'గిండ్లు' మొదలైనవి. 'కాలు' శబ్దంబునకు 'కాలులు— కాళ్ళు' అని రూపద్వయంబు. ఇచ్చట 'కాలు + లు' అనియుండఁగా ప్ర కృతసూత్రంబునఁ బ్రకృతిలువర్ణముయొక్క ఉకారంబునకు లోపంబురాఁగా బిద

పోల్లవసూత్రంబుచేతను బహువచనసంశ్లిష్టమయిన ప్రకృతిలకారంబునకు వలఘులకారంబు గలిగి 'కాళ్లు, అయ్యెను. పదమూఁడవసూత్రంబున 'కాళులు' అనియునుండవచ్చును. ప్రకృతసూత్రంబున నుకారలోపంబు బహుళకంబుగావునఁ బక్షంబున 'కాలులు' అని సంయోగరహితంబుగ నుండును. గొంటులు – గొంట్లు. తుంటులు – తుంట్లు. ఈశబ్దంబులు 'గుంటు, శబ్దంబునకుంబలె గ్రహింపవలె. గోరులు – గోర్లు. సీవిరులు – సీవిర్లు. ఈశబ్దంబులు ప్రకృతసూత్రంబున నుత్వలోపంబుచేతనే గ్రహింపవలెను. పైనుదాహరింపఁబడిన 'గుండులు – కాలులు – తుంటులు – సీవిరులు' శబ్దంబులు క్రమముగా 'డ – ల – ట – ర' లకుదాహరణంబులు మఱియు శ్లో॥ దాసఃక్రమస్సమచ్ఛత్రోవ్యత్యయస్త్వం ఛేదసంఘయోః ఉపాయముగపాయశ్చ 'వ' పూర్వాః పతితా ఇమే ॥ శకటరేఫనిర్ణయము. ఈశ్లోకమునందలి 'ఛత్ర'శబ్దంబునకు గ్రంథకర్తగారు 'సీవిరులు' అని తెలుఁగువ్రాసి, 'విరుగొడుగులు' అని యర్థము వ్రాసిరి. కాని వింజామరలను నర్థము సరియైనది. సీ॥ వింజామరములనవింజామలసంగవీచోపులనఁ సీవిరులనంగఁ । జామరాహ్వయములు' వేంకటేశ్వరాంధ్రము – నామవర్గము. క॥ సీవిరులనవీచోపులు । నావింజామరములకును నామములయ్యెన్' దేశ్యనామార్థకోశము. శకటరేఫనిర్ణయంబును, శబ్దాంధ్రపదపారిజాతంబును, బట్టిచూడఁగా 'సీవిరులు' అను బహువచనరూపంబును నున్నయట్టులు గానిపించుచున్నది. కాని 'వీచోపులనఁగ సీవిరులనంగ' అను వేంకటేశ్వరాంధ్రనిఘంటుపద్యమందలి యతిస్థానంబుసూచినను, దల్సను పరిచ్ఛేదమునందలి నలువదియేడవసూత్రంబుచే యోజించినను 'సీవిరులు, అనియే కాని 'సీవురులు' అని యుత్వనకారంబుగాదు. సీతారామాచార్యులవారు 'సీవిరులోకవలిపన్' భార- శాంతి. 1ఆ. అనుప్రయోగంబు దాహరించి '(ఇది వ్రాఁతప్రతులయందలి పాఠము)' అని వ్రాయుట ఇద్వితకారసహితమనుడిచూచుఁ చేతనేయని గ్రహింపవలెను. సీవిరులనఁగా వింజామరములనుటకు భారతప్రయోగంబులు. శా॥ సారథ్యంబు వహింప భీముఁడు సితచ్ఛత్రంబు గాండీవి చే । ల్వారంబట్టఁగ సీవిరుల్గవలిపన్' భార- శాంతి- 1 ఆ. క॥ రచియించిన వజ్రంబుల । గుములంబొలుపారు సీవిరులు బెరయంగన్, భార క॥ ద్విరదంబుల వరసంబులఁ । దురగంబులఁ గాల్బలములఁ దూర్యంబులసీ । విరులన్గొడుగులఁ బడగలఁ । బరిస్ఫురితమహోన్నతి నచుపంబుగదున్, భార. హైమాలమందు

బహుళమని చెప్పుటచేత (విల్లులు, పిల్లులు, పులులు, ఇత్యాదులందు నుత్వలోపంబు లేదు. తత్సమపదంబులలో (కోటి-పిప్పలి, శబ్దంబులకు నుకారలోపంబును, గనంబడు చున్నది. ఉ. కోట్లు - కోటులు. పిప్పళ్లు -పిప్పలులు. మొదలైనవి. అప్పకవి తే॥ గీ॥ యుష్మత్పంచకమునఁ ద్రిక్కుయొజ్జవారు గాళ్ళటంచు రచించుటఁ గాంచి కవులు అనియుష్మత్పంచకంబులోఁ దిక్కనసోమయాజులు కాళ్ళని ప్రయోగించినాఁడనియు, దానం జేసి మీఁగాళ్ళని కవులు తఱచుగఁ బ్రయోగింతు రన్నాఁగనియు, వక్కాణించు చు, సారంగధరచరిత్రమందలి (సీ॥ ఉష్మకస్తపువ్వానొక పైనిసుచ్చిళ్లు దెలఁగి మీఁగాళ్ళపైఁ జిందులాడ' అను ప్రయోగంబును జూపెను అప్పకవిగారి మతంబున (హరి మధ్యకాళ్లు సొళ్ళవఁగరాదు, అనుపద్యంబునఁ (కాళ్లు, అని ప్రయోగింపఁగూడదనియే సిద్ధాంతపఱచిరి; కాని కాళ్ళనుబకుఁ గవిశేఖరుల ప్రయోగంబులు భారతమునందుఁ పెక్కులుగలవు. క॥ ఉనుగకరక్తప్రవాహ మొలుకుచునుండం । గడకాళ్లుపట్టివానిని' భార- ఆది. క॥ వినితోయుతీఁగకాళ్ళం । బెనఁగొనఁగదాయఁచుఁ బొంగిభీష్ముఁడు ద్రోణుఁడ్, భార - ఆది - 5 ఆ. సీ॥ కాళ్ళ యొప్పిదమాడుకట్ల నజ్వలముచేయంగ నంతుల బాహులంపమెడల, భార - విరా - 1 ఆ. ఇంకను ప్రయోగంబులు పెక్కులుగలవు.

(13) సూ—బహువచనము పరంబగునపుడ సంయుక్తంబులయి యుదంతంబులయిన డలరలకలఘు లకారంబు బహుళంబుగా నగు.

త్రాడు - త్రాళులు - గుమ్మళ్లు - గుమ్మడులు - మొగిళులు మొగిలులు - పిడికిళులు - పిడికిలులు - ఊళులు - ఊరులు-పందిళులు పందిరులు.

వ్యా—బహువచనంబు పరంబగునపుడు సంయుక్తంబులు కానివై ఉదంతంబులైన డ - ల - ర, లకు నలఘు లకారంబు బహుళంబుగానగును. ఉ. త్రాడు - త్రాడులు - త్రాళులు. (త్రాడు, ఇచ్చట బహువచనలకారము వచ్చి (త్రాడు + లు' అని కాఁగాఁ బ్రకృతసూత్రంబున డకారంబునకు నలఘు ళకారంబు (ళ) గలిగి త్రా

15సూ—సమానపదంబునందు సంయోగంబుపరంబగునపుడెల్లచో ఖండబిందునకుం బూర్ణంబగు.

అనఁటులు - అనంట్లు-పనఁటులు-పనంట్లు - గోఁటులు- గోంట్లు తేఁటులు- తేంట్లు -ఏఁడులు-ఏండ్లు॥ కాఁడులు-కాండ్లు ఏండ్లు కాండ్లిత్యాదులందు డాకుళాదేశంబుం గొందఱు గణించిరి- తెనుఁగున బిందు పూర్వకస్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు.

వ్యా—సమానపదంబునందు (ఏకపదంబునందు) బహువచనలకారంబుతోఁ బ్రకృతిహల్లు సంయుక్తమైనపుడంతటను నఱసున్న నిండుసున్నయగును. ఉ. అనఁటులు – అనంట్లు. ఇచ్చట 'అనటులు' అనునది యేకపదము. దీనిలోని టకారంబు యొక్క ఉకారంబునకుఁ బ్రథమైండవసూత్రంబున లోపంబుగలిగి టకారలకారంబులు సంయుక్తంబులుకాఁగాఁ బ్రకృతసూత్రంబున నామంబులోని నకారంబుమీఁది ఖండబిందువు పూర్ణబిందువై 'అనంట్లు' అనురూపముసిద్ధించె. ఇట్లే 'పనఁటులు-గోఁటులు-తేఁటులు – ఏఁడులు - కాఁడులు' ఇత్యాదిశబ్దంబులలో నామంబుయొక్క హల్లునకును, బహువచనలకారంబునకును, సంయోగంబుగలిగినపుడు నామంబులయందలి యఱసున్నలు నిండుసున్నలయి 'అనంట్లు - గోంట్లు - తేంట్లు - ఏండ్లు– కాండ్లు' ఇత్యాదులగును. 'ఏండ్లు– కాండ్లు' ఇత్యాదిరూపంబులందు డాకుళాదేశంబుగాఁ బరుసగాఁ జెప్పిన సూత్రంబున నలఘులకారంబుగలిగి 'ఏఁళ్లు,' పదునాల్గవసూత్రంబున 'ఏండ్లు' ఇత్యాదికంబుగా నుండునని కొందఱు భ్రమనుపడిరి. తెనుఁగుభాషయందుఁ గలుషసరళంబులకు ముందుబిందువుండునుగాని స్థిరంబునకు ముందుబిందువుండదు. వీరిమతంబున నలఘులకారంబునకు ముందుబిందువును, అంగీకరింపవలసియున్నది. అయ్యది యశాస్త్రీయంబు గావున నట్టిరూపంబులు గ్రాహ్యములుకావు. 'వ్రేఁడు' అనుశబ్దంబులోనిది డువర్ణకంబుగాని యది ప్రకృతిలోనిదికాదు గావున 'ఏఁడు – కాఁడు' అనుశబ్దంబులవలెఁ బోలె నీశబ్దంబునకు రూపనిష్పత్తి యగునని భ్రమింపఁగూడదు 'వ్రే' దీనికి నేకవచ

వంబు. ప్రేంకు బహువచనంబు. ప్రేలు (గొల్లలు) స్త్రీప్రత్యయరూపము ప్రేత (గోపికాస్త్రీ)

16 సూ—ఔపవిభక్తికంబుల లివర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగానగు.

కొడవలి - కొడవండులు - ఉల్లోపంబు - కొడవండ్లు - పక్షంబున దలఘులకారంబు - కొడవళులు - కొడవళ్లు - కొడవలులు॥ రోఁక లిప్రభృతులకిట్లు రూపంబు లెఱుంగునది ॥ ఇల్లు - ఇండులు - ఇండ్లు - ఇల్లులు ॥ ఇట్లు - కల్లు - పల్లు ముల్లు - విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది ॥ మద్యనిమ్నార్థకంబులయిన కల్లు పల్లుశబ్దంబులును ఇల్లు ప్రభృతి శబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటంజేసి వాని కీకార్యంబు లేదు.

వ్యా—ఔపవిభక్తికంబులనఁగా విభక్తిసంబంధంబున మార్పునొందు శబ్దంబులు. అట్టిశబ్దంబుల లివర్ణంబునకును, లకారముతోఁ గూడిన లువర్ణంబునకును, (సలలువర్ణంబునకు = లకారముతోఁ గూడిన లువర్ణమునకు - ఉ. ఇల్లు - విల్లు మొ) బహువచనంబు పరంబగునపుడు నిండుసున్న పూర్వమందుఁ గలిగిన డు, అనునక్షరము బహుళంబుగావచ్చును. కొడవలి, ఇచ్చట బహువచనమందు లువర్ణకంబు రాఁగా నాలివర్ణంబునకు నిండుసున్న పూర్వమందుఁగల డువర్ణంబువచ్చి కొడవండులు, అనియును, డువర్ణంబుయొక్క ఉకారంబునకుఁ బండ్రెండవసూత్రంబుచే లోపంబుగలిగి కొడవండ్లు, అనియును, డకారయుక్తమైనరూపంబులు రెండేర్పడును. డువర్ణంబుపాక్షికంబుగావున కొడవలి, శబ్దంబునకు బహువచనలకారంబు పరంబగుచుండఁ దత్సమపరిచ్ఛేదంబునందలి నలువదిరెండవసూత్రంబుచే నుత్వంబుగలిగి యీపరిచ్ఛేదంబులోని పదుమూఁడవసూత్రంబున నలఘులకారంబు రాఁగా కొడవళులు, అనియును, పదునాల్గవసూత్రంబుచే కొడవళ్లు' అని బహువచనశిష్టంబుగాను, లకారయుక్తమైన రూపస్వ

యం బేర్పడినది. అలఘులకారంబునకు బాహుళకంబగుటచే ‘కోడవలులు’ అని లఘులకారయుక్తరూపంబొందుండు. ఇట్టిశబ్దంబులకు బహువచనలకారంబునందు రూపపంచకంబగును. ‘రోఁకలి’ మొదలైన శబ్దంబుల కివిసంబునసే రూపంబులని తెలిసికొనవలెను. ఇయ్యది లివర్ణమంతమందుఁగల యౌపవిభక్తికాంతపదంబుల కుదాహరణము. ఇఁక ద్విత్వలువర్ణంబునకు — ‘ఇల్లు’ దీనికి బహువచనంబున లువర్ణకంబునచ్చి ‘ఇల్లులు’ అనియును, పూర్ణబిందు పూర్వకడువర్ణము వచ్చినపుడు ‘ఇండులు’ అనియును, పండ్రెండవసూత్రంబుచే డువర్ణంబుయొక్క ఉకారంబునకు లోపంబుగలుగఁగా ‘ఇండ్లు’ అనియును, రూపంబులు. ఇట్లే ‘కల్లు – ముల్లు – పల్లు – విల్లుఁ’ మొదలైనశబ్దంబుల రూపంబులు గ్రహింపవలెను. మఱియు ‘కల్లు’ శబ్దంబునకు మద్యమర్థమైనపుడును, ‘పల్లు’ శబ్దంబునకుబల్లమర్థమైనపుడును, ఇల్లుమొదలైనశబ్దంబులును, ఔపవిభక్తికంబులు కీసూత్రవిధిజేసి వానికాకపోవుటంజెల్లదు, కల్లుశబ్దంబునకు నేత్రమునకైయొడియర్థ మరుదుగాఁ గానఁబడియెడి. సీ॥ ఏవేల్పుఁ గలఁపంగనిచంద్రులనుబంతి కండ్లుగాఁ గండ్లుగాఁ ఘనత జేసిభల్లా – 1 ఆ ఔపవిభక్తులనుఁగుఱించి యౌపవిభక్తికప్రకరణంబులో వివరింపబడును.

17 సూ—ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యంబయి బహువచనంబు నెనయు.

కోడవండ్లులు - కొండవండ్లులను - కోడవళ్లులు - కోడవళ్లులను ఇట్లుప్రయోగదృష్టంబులు గ్రహించునది.

వ్యా—ఒకానొకచోటఁ బ్రాతిపదికము (నామము) బహువచనలకారంబుతోఁ గూడికొని పునరుక్తంబుగ బహువచనంబు నొందును. ఉ. కోడవండ్లులు మొదలైనవి. ‘కోడవళ్లు’ ఇచ్చట బహువచనలకారాంతంబే ప్రాతిపదికంబై వేఱొకబహువచనలకారంబును బొంది ‘కోడవళ్లులు’ అయినది. ఇట్టిరూపంబు కవిప్రయోగంబులనుసరించి యుపయోగింపవలయును. ‘క॥ సుందరి నాకోడండ్రుర యందభ్యర్హితవునీవ’ భారసభా – 2 ఆ. తే॥ గీ॥ అచ్చెరువుగాదె యెన్నరి [illegible]రింకఁ । బరిభవంబునుబొందక

ప్రబుకువారు, భార - విరా - 3ఆ. చ॥ ఘనిమదివాదువల్లభను వీం(డురు(గమూ నింతచేసిరే, భార - విరా - 3 ఆ. తే॥ గీ॥ ఒక్కసతికిఁబతులు పెక్కండ్రఁగుటిది సతులకోర్కి గానవతివక్షస్థ, భార - అర - 4 ఆ. సీ॥ వెలయాండ్రురనుగొండియల బరిచారికాశ్రేణుల నొండొంటిచేతులునట్టి, హరి - ఉ. 6ఆ క॥ వేదుకకాండ్రుపుర నిచ్చు వివిధార్థంబుల్, విక్ర - 2 ఆ. క॥ పెక్కండ్రుతోడనైనఁ బెనఁగఁగఁ జెల్లుజ్ విజ్ఞా - వ్య - తే॥ గీ॥ చూపఱులచూడ్కి కొకవింతసొబగొనర్చి, కళా - 7 ఆ ఇంకను బహువచనాంతంబుపై బహువచనంబు గలశబ్దంబులు ప్రయోగంబులం బెక్కులుగలవు.

18. సూ—కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు.

కలఁకు-కలను-కలఁకులు ॥ కలను- కెలను-కొఱను - కొలను - గవను - నెఱను - మ్రాను - వరను - వలను - ఇవికలన్వాదులు.

వ్యా—కలను మొదలైనశబ్దంబులయొక్క నువర్ణంబునకు కుజ్, అనునదివచ్చును. కుజ్' జకారేత్కమగుటచేత జిత్తు బిందుపూర్వకంబగు, ననుసూత్రంబుచే బిందుపూర్వకకువర్ణఁబని గ్రహింపవలెను. బహువచనంబునందు కుజ్, అనునది నిత్యంబుగానగును. అనఁగా నేకవచనంబున వైకల్పికము. ఉ. కొలను — కొలఁకు. బహువచనంబున నిత్యంబగుటంజేసి కొలఁకులు, పక్షంబున హ్రస్వంబుపైన నఱసున్న నెఱసున్నయై కొలంకులు, అనియుంగలవు. కలను - కెలను - కొఱను - గవను - నెఱను మ్రాను — వరను, మొదలైనవానికి నేకవచనంబునఁ బైదానిఁబలె రూపద్వయంబును, బహువచనంబున రూపంబొకండును, గ్రహింపవలెను. మ॥ గాంతురుశ్రమత్వముగానలో ముంగామ్రాకుల్ గా వితర్కింపఁగాఁజ్, వసు- 1ఆ. పైలెఖాని ర్దిష్టంబైన శబ్దంబునకు తురుష్కులును, జీర్ణవృత్తంబులును, ప్రకృతంబున వర్ణద్వయంబు చెప్పికొనవలెను. పృథక్పదమైనపుడు మ్రాకుల్, అనియుండవలెను. ఆయినను శ్లేషాలంకారతత్పరత్వంబునఁ గ్రౌఢముగాఁ జెప్పబడినదని వ్యాఖ్యానంబున వ్రాయంబడియెను. ఇట్టివి పెక్కులుగలవు గాని కొన్నింటినిమాత్రమ యుదాహరించెదను. మ॥ జరు

శ్లో॥ యమకుటుంబరక్షణమునకుఁ బ్రాణ్మిచింతన్నిరం । నవతారకవికసంపుటప్రకరకాం తారంబునంపర్ధపుం । దెరువాటుల్ దగగొట్టి తజ్జపరిమద్వజ్ఞాతచార్యక్రియా । విరసుండై కొలఁతంబడుంగుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్, మను - 1ఆ. ఇచ్చట నొకయర్థంబునందు కొలుత, అని యుకారమధ్యంబుగాను, వేఱొకయర్థంబునందు కొలఁత, అని యకారమధ్యంబుగాను, నుంపవలయు. అయినను కొలఁత, అని యకారమధ్యంబుగానే యర్థద్వయమందును పెద్దనార్యులచేఁ బ్రయోగింపఁబడియె, సీ॥ రాజరాజలక నూరకయున్న నలకనూరక నిపేంపనియట్టి రాజరాజు, వట్టు. 2 ఆ. అలకశబ్దంబు కేశార్థకంబగునపుడు ఉకారమధ్యముగాని యకారమధ్యముగాదు. పట్టణవాచకమగు నలకాశబ్దము సంస్కృతము. అకారమధ్యము. ఈశబ్దంబుతోడ శ్లేషకై దేశ్యశబ్దంబగు నలుకశబ్దంబు నకారమధ్యముగాఁ బ్రయోగించుట శబ్దశాస్త్రవిరుద్ధంహిచ్యుతసంస్కారమిష్యతే, అను శ్లోకంబుంబట్టి చ్యుతసంస్కారంబని గ్రహించునది. సీ॥ వీరివాల్గన్నులు విస్ఫుటతారకల్ శ్రీనాసంగతి గాంచి ప్రబలుటరుదె, వట్టు. 2 ఆ. ఇచ్చటఁ బ్రకాశించునట్టి గ్రహకలని యనునర్థంబున విస్ఫుటతారకము, లని యుండఁదగినను శ్లేషను నిర్వహించుటకు నిట్లు చెప్పెను. మహాకవులు గావున వారిప్రయోగంబుల నభినందింపవలయును.

19 సూ—అట్లు రేనుగోనుశబ్దంబుల నువర్ణంబుగుజ్జగు.

రేఁగు - రేను - రేఁగులు ॥ గోఁగు గోను - గోగులు.

వ్యా—పైసూత్రంబునంబలె నేకవచనంబునందు వైకల్పికంబుగాను, బహువచనంబునందు నిత్యంబుగాను, రేను, గోను, శబ్దంబులయొక్క నుకారంబునకు గుక్, అనువర్ణకంబగును. ఉ. రేను = రేఁగు. బహువచనమందు రేఁగులు, ఇట్లే గోనుశబ్దంబు గ్రహింపవలెను,

20 సూ—బహువచనంబు పరంబగునపుడు చేను పేను మీను శబ్దంబుల నువర్ణంబులోపించు.

చేను — చేలు ॥ పేను - పేలు - మీను - మీలు.

వ్యా—బహువచనలకారంబు పరంబగునపుడు 'చేను, పేను, మీను' అనుశబ్దంబుల కడపటియక్షరంబైననువర్ణంబులోపించును. ఉ. చేలు. 'చేను' ఇచ్చట లువర్ణకంబు రాఁగా 'చేను + లు' అయ్యెను. పిమ్మటఁ బ్రకృతసూత్రంబున నువర్ణంబులోపింప, గా 'చేలు' అయినది. ఇట్లే పేను మొదలైనశబ్దంబులు గ్రహింపవలెను. 'మీనుఁ' అనుశబ్దంబునకు బహువచనంబు 'మీనులు' అనుప్రయోగంబొండుగలదు. వ॥ 'జలజములఁ మృణాళములఁ జక్రయుగంబుల గండుమీనులఁ' కవికర్ణరసాయనము. ఇచ్చోట 'గండుమీలఁ' అని పఠించినచో నిర్దుష్టంబు.

## 21 సూ—బహువచనంబుపరంబగునపుడు రేయిప్రభృతులతుది యక్షరంబులోపించు.

రేయి - రేలు॥ ఱాయి - ఱాలు॥ వేయి - వేలు॥ వ్రాయి - వ్రాలు॥ ఇత్యాదులు॥ ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడు. రేరాజు - మగఱాపతకము - వేవెలుఁగు.

వ్యా—బహువచనలువర్ణకంబు పరంబగునపుడు 'రేయి' మొదలైనశబ్దంబుల కడపటియక్షరంబులోపించును. ఉ. రేలు 'రేయి' ఇచ్చట లువర్ణకంబు పరంబగునపుడు కడపటియక్షరంబైన యివర్ణములోపింపఁగాఁ [illegible]బహువచనరూపంబేర్పడెను. ఇట్లే 'ఱాయి — వేయి — వ్రాయి' శబ్దంబులకుఁ గ్రమంబుగ 'ఱాలు — వేలు — వ్రాలు' అనురూపంబులు గ్రహింపవలెను. సీ॥ 'పలుగుఱాలొల్లక తోలఁగివచ్చినఁగంటె పలుగు [illegible] నయ్యెనిప్డు' రామాభ్యు—5 ఆ. క॥ 'నీలంపుమేనిసూత్రపు । ఱాలకనుంగవయుఁ బుష్యరాగపుటెన్నున్' చంద్రభానుచరిత్రము. కొందఱు 'ఱాయి' శబ్దంబునకు బహువచనరూపము 'రాళ్ళు' అని వ్యాకరణంబులయందును, గ్రంథంబులయందునుఁ బ్రయోగించుచుండిరి. అయ్యది ప్రామాదికము. ఈపైయంత్యాక్షరలోపము సమాసంబులయందునుఁగూడఁ గనఁబడుచున్నది. రేరాజు (రేయి + రాజు) వేవెలుఁగు (వేయి + వెలుఁగు) మగఱాపతకము (మగఱాయి + పతకము).

22 సూ.—బహువచనంబు పరంబగునపు డావు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు.

ఆవు - ఆలు - ఆవులు ॥ జాము - జాలు-జాములు ॥ చుట్టము చుట్టలు - - చుట్టములు ॥ మీసము -మీసలు-మీసములు

వ్యా—బహువచనలకారంబు పరంబగునపుడు 'ఆవు' మొదలైనశబ్దంబుల కడ యక్షరంబునకు లోపంబు వైకల్పికంబుగానగును. ఉ. ఆవులు — ఆలు. 'ఆవు + లు' ఇచ్చటఁ దుదనున్న 'వు' వర్ణంబులోపించి 'ఆలు' అయ్యెను. ఇట్లే 'జాము - చుట్టము మీసము' మొదలైనవానికి బహువచనంబులు రెండురూపంబులు గ్రహింపవలెను. 'ఆవు' శబ్దంబునకు బహువచనముందేకాక వృత్తియందును నంత్యాక్షరలోపంబగును. ఉ. 'ఆఁదోఁక-ఆఁగదుపు-ఆఁబెయ్య-ఆఁబోతు' ఇచ్చట నర్ధానుస్వారంబును, ఉత్తరపదపరుషంబునకు సరళంబును విశేషంబు. 'ఆమూఁడ' ఇచ్చట లోపంబుమాత్రమే కలుగును. సీ॥ తే॥ గీ॥ 'ఆలగాపరివేత్రితల మేలువాఁడు' ఆంధ్రనామ-దేవ. ఉ॥ 'అశ్రువుల్ జాలుగనాల్గుజాలునిఁక జాలు భవంబుననంతకాఁకతుం । బాలయిరాత్రిపంచశరుబారికిఁ జిక్కితినీకుఁ దక్కితిన్' మను - 3ఆ. మ॥ చెలులుంజుట్టలునిష్టభృత్యులు మహాజిం బ్రాణముల్ డాపకు । జ్వలులై' భార- ఉద్యో - 2ఆ. క॥ చెలులుంజుట్టలు దేశం । బులరాజులు వినఁగ నీదుప్రఖ్యచరిత్రం । బులు, భార - ఉద్యో - 3అ. తే॥ నిడుద బాహుయుగంబును వెడఁదయురము । గొనబుమీసలుదీర్ఘనేత్రములు మెఱయ, రాజశే- 2ఆ. తక్కుంగలరూపంబులు సులభము.

23 సూ—ఇయయములకు నామాంతంబున కైత్వంబు బహుళముగానగు.

కన్నియ - కన్నె॥ జన్నియ-జన్నె॥ వన్నియ - వన్నె॥ కొంచియము - కొంచెము॥ కొండియము ॥ కొండెము ॥ బహుళగ్రహణముచే సందియము కాటియము మొదలగుశబ్దంబుల కైత్వము లేదు। ఇయ

నిత్యలోపంబు మాపట్టైడి, అనిచెప్పెను. ఉ. కన్నియ – కన్య – దివ్వియ – దివ్య కళ్లియము – కళ్యము. పళ్ళియము–పళ్యము. వీడియము – వీడ్యము. మొ. సీ॥ ధృతిఁ గుంతిఁ ద్రుపదభూపతులనెయ్యపుఁగన్యకలననవాలుఁదూపులజయించి, రాఘ 1 ఆ. ఇచ్చట 'కన్య' శబ్దంబు రామాయణార్థమందు సయితముత్తమపదంబనికొందఱయభిప్రాయంబు; కాని 'కన్యా' శబ్దంబునకు వికృతియంటే 'క్రొత్త' అనునర్థమువచ్చును. సంస్కృతంబునందు లేనియర్థంబులు వికృతియందుఁ గలుగుటసహజంబులుగావునఁ దత్సమపదంబని భ్రమపడవలదు. ఉ. అగ్గన – (అర్ఘః) అలక – (ఆలకా) (అవగడ్డము–)అవకటః) అసదు (అసత్) కంచము (కంసః). గంపము–(గన్ధః) తొంటము – తుణ్డమ్)నాన – (జ్ఞానమ్( నిచ్చ– (నిత్యమ్) నిజము (నిజమ్) మొదలగునవి. ఇందులకు నథర్వణాచార్యులు – శ్లో॥ క్వచిదాద్యస్యశబ్దస్య వికారే త్వన్యవాచ్యతా॥ అనిచెప్పినారు. తే॥ గీ॥ సవ్యగ్రద్దదివ్యాలుపుఁ బ్రువ్వగూబ | యిల్లుసొచ్చిన శాంతి సేయింపవలయు" భార – అను – 4 ఆ. సీ॥ కన్యలఁ బదిలంబు గాని సత్త్రంబులఁ గొత్తముట్టున కియ్యకొలుపు జెరవు" భార – విరా – 1ఆ. ఉ॥ అంబుజబాంధవాన్వయ నృపాగ్రణిబోనము నేఁడు సూర్యపా | కంబున నాయితంబయిన కజ్జము భోజనశాలలోనఁ బళ్యంబిడినారు పంకజదళాక్షులు రెండవజాముగంటవేగ్రయంబడె నారగింప సమయంబని చెచ్చెరవిన్నవించినన్, కాశీ – 5 ఆ. ఇప్పద్యముంబట్టిచూడఁగాఁ బూర్వము మనవారు సూర్యకిరణంబులచే వంటచేయుట కనుపెట్టినట్లు తేలుచున్నది. మనప్రాచీనులుపూర్వకాలమందు బ్రకృతిశాస్త్రప్రవీణులయి సుకరంబును, చమత్కారంబును, నైనకార్యంబులు సలిపినట్లు లీపద్యంబునలన గ్రహింపవలెను. తే॥ గీ॥ తరుఛాయన నగనగద్దెనమణులపొత్తు ! కొల్పిరి లేఁతవీడ్యములడాలు, రాఘ – 3 ఆ తే॥ గీ॥ కొడియము వక్కలాకులు విడెము తమ్మలంబు వీడెంబు వీడ్యమనంబు రారి" ఆంధ్రనామసంగ్రహము, మానవవర్గ. సీ॥ తే॥ తనరుదాంబూలనామంబు తమ్మలమన| వీడెమన వీడియమ్మన వీడ్యమనఁగ|విడియమన విడ్యమనఁగను విడెమనంగ, భూరిఫణిభంగశాస్త్రమాత్మభూతలింగ" ఆంధ్రభాషార్ణవము, మనుష్యవర్గము. "పరియాచకము – పర్యాచకము – పరేచకము" ఇట్లు రూపత్రయంబని యహోబలపపతి. ఉ॥ నన్నుఁబర్యాచక మేల చేసెను సుహృద్దముచేఁ గరుణింపవే చెలీ" అనిప్రయోగము. పైప్రయోగంబులంబట్టి చూడఁగా సూరిగారు సెలవిచ్చినట్లు

గాక ముత్తియశబ్దేతరంబులయందుఁ గూడ, ఇకారంబునకు లోపంబుగలదని గ్రహింపవలెను. "నామములయందె కాక క్రియలయందును, ఎత్వంబు చూపట్టెడి" నని యహోబలపతి. ఉ. కదియంబడె - కదెంబడె" ఇత్యాదులు.

## సర్వనామప్రకరణము.

విశేష్యములయొక్క పునరుక్తిదోషంబు కలుగకుండఁగ వానికి బదులుగా ప్రయోగింపఁబడుపదంబులు సర్వనామంబులు. (పూర్వోక్తపదార్థపరామర్శకములు) అట్టివానిం గూర్చి తెలుపు ప్రవృత్తిభాగంబున సర్వనామప్రకరణము.

**24 సూ — అన్నిప్రభృతులు సర్వనామంబులు.**

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు - ఆ - ఈ - ఏ - నీ - నా - మన - తా - సంఖ్యావాచకంబులు - అన్నిప్రభృతులు॥ వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద- వీనిలోడుమంతంబులకెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు స్మరించునది ॥ బహువచనలకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమాబహువచనంబునకుంబోలె నెఱుంగునది ॥ విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచో ద్వితీయవఱకును గొండొకచోఁ దృతీయయందొక్కరూపంబువఱకును రూపభేదంబులు వక్కాణించెద - శేషంబూహించునది ॥ అన్ని మొదలగుశబ్దంబులాఱు నుద్విప్రభృతిసంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు - అమహదర్థంబులేక వచనాంతంబులగు ॥ ఇందు నీమొదలగునాలుగుశబ్దంబులు సర్వార్థంబులందుల్యరూపంబులయి యుండు.

మ - అనునది మహదర్థమనుటకు - అ- అనునదియమహదర్థమనుటకు - ప్ర - మొదలయినవి ప్రథమావిభక్త్యులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

మ. అ.

సర్వతావదర్థకము.

ప్ర { అందఱు / అందఱును } ...అన్ని.

ఇయదర్థకము

ప్ర॥ ఇందఱు......ఇన్ని.

కియద్యావదర్థకము.

ప్ర॥ ఎందఱు......ఎన్ని.

కతిపయార్థకము

ప్ర॥ కొందఱు......కొన్ని,

బహ్వర్థకము. పెక్కు

ప్ర { పెక్కండ్రు / పెక్కురు } దీనికిబహు వచనముంగ లదు॥ పెక్కులు

ఈశబ్దంబులు లోపవిభక్తికంబులగుటంజేసి - అన్నిటి - అన్నింటి - ఇన్నిటి - ఇన్నింటి - ఎన్నిటి - ఎన్నింటి - కొన్నిటి - కొన్నింటి - పెక్కిటి - పెక్కింటి - యనురూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరంబగునపు డమహత్త్వంబునంద గునని తెలియునది.

బహ్వర్థకము.

ప్ర॥ { పలుగురు / పలుగుండ్రు } అమహత్త్వంబున దీనికిద్వ్యప్రయోగంబు లేదు.

మ.

తదర్థకము.

ప్ర॥ వాఁడు..... { వారు / వారలు / వాండ్రు }

ద్వి॥ వానిని..... { వారిని / వారలను / వాండ్రను }

అ.

ప్ర { అది........అవి / ఇది... ...ఇవి / అయది......అయివి / అయ్యది.....అయ్యవి }

ద్వి { దానిని / ఆదానిని / అద్దానిని } ......వానిని..

మ.

ఇదమర్థకము.

ప్ర॥ వీఁడు { వీరు / వీరలు / వీండ్రు }

ద్వి॥ వీనిని { వీరి / వీరలను / వీండ్రను }

అ.

ప్ర {
ఇది............ఇవి
ఇద్ది............ఇవ్వి
ఈయది....... ఈయవి
ఇయ్యది........ఇయ్యవి
}

ద్వి { దీనిని... / ఈవానిని / ఇద్దానిని } వీనిని

మ.

( యత్తర్మార్థకము

ఏఁడు............ఏరు

ప్ర (
ఏవాఁడు { ఏవారు / ఏవారలు / ఏవాండ్రు }
ఎవ్వాఁడు { ఎవ్వారు / ఎవ్వారలు / ఎవ్వాండ్రు }
ఎవ్వఁడు { ఎవ్వరు / ఎవ్వఁడ్రు }
ఎవఁడు { ఎవరు / ఎవండ్రు }
)

ద్వి (
ఏనిని........ఏరిని
ఏవానిని { ఏవారిని / ఏవారలను / ఏవాండ్రను }
ఎవ్వానిని { ఎవ్వారిని / ఎవ్వారలను / ఎవ్వాండ్రను }
ఎవ్వనిని { ఎవ్వరిని / ఎవ్వండ్రను }
ఎవనిని { ఎవరిని / ఎవండ్రను }
)

ఎది... ... ...ఎవి
ఏది... ... ...ఏవి
ప్ర. ఎద్ది... ... ...ఎవ్వి
ఏయది ... ...ఏయవి
ఎయ్యది ... .. ఎయ్యది

ద్వి { దేనిని.........వేనిని
ఏదానిని......ఏవానిని
ఎద్దానిని......ఎవ్వానిని }

మహతివాచ్యంబగు నేనేకత్వంబున యత్కిమర్థకశబ్దంబు - ఎవ్వరిత - ఎవర్త - ఎవ్వత - ఎవరిత - ఎవర్తు - ఎవత - ఎవ్వరితి - ఎవ్వర్తి - ఎవ్వతి - ఎవరితి - ఎవర్తి - ఎవతి - ఎవ్వరితె - ఎవ్వర్తె - ఎవ్వతె - ఎవరితె - ఎవర్తె - ఎవతె - ఎవ్వర్తుక - ఎవ్వతుక - ఎవర్తుక - ఎవతుక - అని యిరువదిరెండురూపంబులు వడయు

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజవివక్షించునపుడు - అతఁడు - ఆతఁడు - ఇతఁడు - ఈతఁడు - ఎతఁడు - ఏతఁడు అనురూపంబులువడయు॥ మహతీవాచకంబులు. ఆమె - ఆపె - ఆకె - ఈమె - ఈపె - ఈకె - ఏమె - ఏపె - ఏకె-అను రూపంబులు వడయు.

యుష్మదర్థకము.

ప్ర { నీవు
ఈవు } { మీరు
మీరలు
ఈరు
ఈరలు }

ద్వి॥ నిన్నును... ...మిమ్ము్మను

తృ॥ నీచేతను ... మీచేతను

అస్మదర్థకము,

ప్ర { నేను
ఏను } ... { మేము
నేము
ఏము }

ద్వి॥ నన్నును... ...మమ్మును

తృ॥ నాచేతను......మాచేతను

ఉభయార్థకము.

నిత్యబహువచనాంతము.

ప్ర॥ మనము. ద్వి॥ మనలను.
తృ॥ మనచేతను — మనలచేతను

ఆత్మార్థకము.

ప్ర॥ తాను... { తాము / తారు / తమరు

ద్వి॥ తన్నును...తమ్మును.

తృ॥ తనచేతను...తమచేతను

ఇంక సంఖ్యావాచకంబులు

వక్కాణించెద.

ఏ.

ఏకార్థకశబ్దము.

ప్ర.

ఒకఁడు.... { ఒకరు / ఒకండ్రు

ఒకోఁడు...... { ఒకోరు / ఒకోండ్రు

ఒక్కాఁడు...... { ఒక్కారు / ఒక్కాండ్రు

ఒక్కోఁడు... { ఒక్కోరు / ఒక్కోండ్రు

ఒకరుఁడు...... { ఒకరులు / ఒకళులు / ఒకళ్లు

ఒకోరుఁడు... { ఒకోరులు / ఒకోళులు / ఒక్కాళ్లు

ఒక్కారుఁడు { ఒక్కారులు / ఒక్కాళులు / ఒక్కాళ్లు

ఒక్కోరుఁడు... { ఒక్కోరులు / ఒక్కోళులు / ఒక్కోళ్లు

ఒకరువుఁడు.........ఒకరువులు
ఒకోరువుఁడు......ఒకోరువులు
ఒక్కారువుఁడు......ఒక్కారువులు

ఒక్కొరుపురుడు. ఒక్కొరుపులు
ఒరుడు ... ... ఒరులు
ఒరుపురుడు ... ... ఒరుపురులు

ఒండు...... { ఒండులు / ఒండ్లు

ఒడ్డు ..... { ఒడ్డులు / ఒడ్లు

ద్వితీయాది విభక్తిరూపంబులూహించుకొనునది.

అ.

ప్రథమైకవచనాంతములు.

ఒకటి - ఒకొటి - ఒక్కటి - ఒక్కొటి - ఎక్కటి - ఒకడు - ఒకొడు - ఒక్కడు - ఒక్కొడు ఒండు - ఈశబ్దంబునకు సంఖ్యావాచకంబునకు బహువచనంబు లేదు.

దీనికి మహతి వాచ్యంబగునపుడేకత్వంబున వక్ష్యమాణ రూపంబు లెఱుంగునది.

మహత్యర్థకము.

ఒకరిత - ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక - ఒకత - ఒకతుక - ఒకొరిత - ఒకొర్త - ఒకొర్తు - ఒకొర్తుక - ఒకొత - ఒకొతుక - ఒక్కరిత - ఒక్కర్త - ఒక్కర్తు ఒక్కర్తుక - ఒక్కత - ఒక్కతుక - ఒక్కొరిత - ఒక్కొర్త - ఒక్కొర్తు ఒక్కొర్తుక - ఒక్కత - ఒక్కొతుక - ఒకరితి - ఒకర్తి - ఒకతి - ఒకొరితి - ఒకొర్తి - ఒకొతి - ఒక్కరితి - ఒక్కర్తి - ఒక్కతి - ఒక్కొరితి - ఒక్కొర్తి - ఒక్కొతి - ఒకరితె - ఒకర్తె - ఒకతె - ఒకొరితె - ఒకొర్తె - ఒకొతె - ఒక్కరితె - ఒక్కర్తె - ఒక్కతె - ఒక్కొరితె - ఒక్కరితె - ఒక్కొర్తె ఒక్కొతె - ఓర్త - ఓర్తి - ఓర్తు - ఓర్తుక.

ఇంక ద్విప్రభృతి సంఖ్యావాచకంబులు ప్రథమాంత రూపంబులు వక్కాణించెద.

దేశంబు. ఉ. వారు. యువర్ణకంబునకుఁ బహుళంబున బిందుపూర్వకడకారంబగు. ఉ. వాండ్రు. లువర్ణకంబునకుఁ ముందు రవర్ణంబగు. ఉ. వారలు. ఇట్టి 'వా' శబ్దంబునకు బహువచనరూపంబులు మూఁడు— ద్వితీయాదిబహువచనంబులు 'వారిని- వాండ్రను — వారలను, ఇత్యాదికముగాఁ బ్రథమాబహువచనమునందలి రేఫాదేశాదులతోఁ రూపత్రయంబగు.

## అమహదర్థకమైన 'ఆ' శబ్దము.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర | అది | అవి. | ద్వి | దానిని | వానిని |
| | అద్ది | అవ్వి | | ఆదానిని | |
| | ఆయది | ఆయవి. | | అద్దానిని | |
| | అయ్యది | అయ్యవి. | | | |

మహదర్థకమైన 'వా' శబ్దంబుయొక్క రూపంబులవలెనే 'వీ' శబ్దంబుయొక్క ప్రథమాదివిభక్తుల యేకవచనబహువచన రూపంబులగును.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | వీఁడు | వీరు | ద్వి. | వీనిని | వీరిని |
| | | వీరలు | | | వీరలను |
| | | వీండ్రు | | | వీండ్రలు |

## అమహదర్థకమైన 'ఈ' శబ్దము.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర | ఇది | ఇవి | ద్వి | దీనిని | వీనిని |
| | ఇద్ది | ఇవ్వి | | ఈదానిని | |
| | ఈయది | ఈయవి | | ఇద్దానిని | |
| | ఇయ్యది | ఇయ్యవి | | | |

ఆ—ఈ—ఏ—శబ్దంబులకుం బూజ్యతయందు మహదేకవచనంబునం దవర్ణాగమంబును, దీని దీర్ఘంబునకు వికల్పంబుగా హ్రస్వంబును; మహత్యేకవచనంబున వానికంటెం బరంబైన, అక—అప—అమ, అనుశబ్దంబుల తొలియకారమునకు లోపంబును, తుదియకారంబున కేకారాదేశంబునగు. ఉ. అతఁడు—ఆతఁడు. మొ. మహదర్థకములు. ఆమె. (ఆ+అమ+ఎ) ఈపె. (ఈ+అప+ఎ) ఏకె (ఏ+అక+ఎ) మొ. మహత్యర్థకములు. ప్రౌఢ—శబ్ద—ఇట్లె మిగిలిన రూపంబులు గ్రహింపవలెను.

## యుష్మదర్థకము.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | నీవు<br>ఈవు | మీరు<br>మీరలు<br>ఈరు<br>ఈరలు | ద్వి. | నిన్నును | మిమ్మును |
| | | | తృ. | నీచేతను | మీచేతను |

## అస్మదర్థకము.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | నేను<br>ఏను | మేము<br>నేము<br>ఏము | ద్వి. | నన్నును | మమ్మును |
| | | | తృ. | నాచేతను | మాచేతను |

## ఉభయార్థకము.
నిత్యబహువచనము,

ప్ర. మనము. ద్వి. మనలను. తృ. మనచేతను – మనలచేతను.

## ఆత్మార్థకము.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | తాను. | తాము<br>తారు<br>తమరు | ద్వి. | తన్నును | తమ్మును. |
| | | | తృ. | తనచేతను | తమచేతను |

ఒకఁడు – ఒకాఁడు – ఒక్కఁడు – ఒక్కాఁడు – ఒంటు: సీ॥ కనలుబింకపు ఁగింక-గలుగువేఁడిమి యొల్లనెక్కటియై యొంటిలెత్తైనవఁగ, లక్ష్మీ – 2 ఆ. తక్కుంగలవి సులభము.

ఒక, శబ్దంబునకు స్త్రీలింగైకవచనరూపంబు లేఁబదిరెండు. ఉ. ఒకరిత – ఒకర్త – ఒకస్త – ఒకస్తుక – ఒకత – ఒకతుక – ఒకారిత – ఒకార్త – ఒకాస్త – ఒకాస్తుక – ఒకాత – ఒకాతుక – ఒక్కరిత – ఒక్కర్త – ఒక్కస్త – ఒక్కస్తుక – ఒక్కత – ఒక్కతుక – ఒక్కారిత – ఒక్కార్త – ఒక్కాస్త – ఒక్కాస్తుక – ఒక్కాత – ఒక్కాతుక – ఒకరితి – ఒకర్తి – ఒకతి – ఒకారితి – ఒకార్తి – ఒకాతి – ఒక్కరితి – ఒక్కర్తి – ఒక్కతి – ఒక్కారితి – ఒక్కార్తి – ఒక్కాతి – ఒకరితె – ఒకర్తె – ఒకతె – ఒకారితె – ఒకార్తె – ఒకాతె – ఒక్కరితె – ఒక్కర్తె – ఒక్కతె – ఒక్కారితె = ఒక్కార్తె – = ఒక్కాతె = ఓర్త – ఓర్తి ఓస్త – ఓస్తుక –

సంఖ్యను జెప్పు రెండు మొదలైన శబ్దంబులకు మహదమహద్వాచక ప్రథమాంత రూపంబులు.

| మ | అ | మ | అ |
|---|---|---|---|
| ఇద్దఱు<br>ఇరువురు | రెండు | పదుమూవురు<br>పదుముగ్గురు<br>పదుముగురు | పదుమూఁడు |
| మూవురు<br>ముగ్గురు<br>ముగురు | మూఁడు | పదునలుగురు<br>పదునయిదుగురు | పదునాలుగు<br>పదునయిదు |
| నలుగురు | నాలుగు | పదునాఱుగురు | పదునాఱు |
| అయిదుగురు | అయిదు | పదునేడుగురు | పదునేడు |
| ఏవురు | ఏను | పదునెనమండ్రు | పదునెనిమిది |
| ఆఱుగురు | ఆఱు | పందొమ్మండ్రు | పందొమ్మిది |

ఏడుగురు ఏడు | ఇరువండ్రు ఇరువది
ఎనమండ్రు ఎనిమిది | ఇరువదియొకరు ఇరువదియొకటి
తొమ్మండ్రు తొమ్మిది | మొదలైనవి గ్రహింపఁదగినవి.

పదుగురు
పదురు
పదుగుండ్రు
పదుండ్రు } పది

ముప్పండ్రు ముప్పది
నలువండ్రు నలువది
ఏఁబండ్రు ఏఁబది
అఱువండ్రు అఱువది

పదునొకరు పదునొకటి | డెబ్బండ్రు డెబ్బది

ఇచట 'ఒకటి' అనునర్థమిచ్చు 'ఒకొరు, ఒక్కరు' ఇత్యాది రూపంబులన్నియు నర్థమునసరించిచేర్చుకొనునది. ఉ. పదునొకొరు పదునొకటి మొదలైనవి.

ఎనుబండ్రు ఎనుబది
తొంబండ్రు తొంబది
నూఱుగురు నూఱు
వేగురు వేయి
పదివేగురు పదివేలు

పన్నిద్దఱు
పన్నిరుగురు } పండ్రెండు

'ఒకరు' అనుశబ్దంబునకుం దక్కఁ దక్కిన 'ఇద్దఱు' మొదలైన సంఖ్యావాచకంబులకు ద్వితీయాదివిభక్తిబహువచనంబులు పరంబగునప్పు డుకారాంతంబులుగా నుచ్చరింపఁబడును. ఉ. ఇద్దఱున్—ఇద్దఱుచేతన్, మొ. తత్సమపరిచ్ఛేదములోని ముప్పదియొకండవ సూత్రంబుచే విధింపఁబడిన లఘాగమంబునకుఁ బైశబ్దంబులలోని లఘ్వలఘుశేషంబులాదేశింపఁబడినవిగాన నట్టిశబ్దంబులు విభక్తులకు ముందదంతంబులయ్యెనని యెఱుంగునది. 'ఒకరు' అనుదానికి ద్వితీయాదులు పరంబగునపుడికారాంతంబగు. ఉ. ఒకనిన్—ఒకరిచేతన్. మొ: 'మహద్విశేషణసంఖ్యావాచకంబులకుం గొన్నియెడల నమహత్త్వంబు చూపట్టెడి" ప్రౌఢ—శబ్ద—104సూ. సీ॥ జనవంద్యుఁ డగుధర్మతనయుని బంతినిత్యంబు పసిఁడి పళ్లెరంబులఁగుడ్చు బ్రాహ్మణులతిపుణ్యు లెనిమిదివేలు (ఎనిమిదివేగురు) సమిద్ధమతులు॥ తే॥ గీ॥ యతులు పదివేలు (పదివేగురు) వారకనుదినంబు నన్నపానంబులందు నహో యనగుదు' భార—అర—5ఆ. సీ॥ వార్తాక

రంబులో నటుపత్రికలయందు లౌకిక్యాభాసంబు నాలుంకెదుపదులు (నాలుంకెబదులేక ను ఁ దోఁబల్గు, కా — 6ఆ. సీ॥ మూఁడిర్వదులు (మూఁడిర్వదుల సంఖ్యలవారు నమున్మరుచ్చనాదులో పదిజంజ ధారేయులు ఖిదభంగులు। జై—5 ఆ. ఉ॥ నేఁడివెలుంగు లోఁ గులిసేల సహస్రములు (పదివేలసహస్రముల సంఖ్యలవారు) స్వభంగిని। వ్యాఁదు వెలుఁగనట్టిబాహువత్స్యలుఁడేగ నవ్వెక్కమూర్తి రై, భో జ—4ఆ.

రెండుమొదలైనశబ్దంబులొ పవిభక్తికశబ్దంబులగుటచే ద్వితీయమున్నగు విభక్తులు పరంబగునప్పుడు 'టి—ంటి' అనునవి వచ్చునని తెలిసికొనవలెను. ఇచ్చట స్పష్టార్థము ప్రక్రియ వ్రాయఁబడును. ద్వితీ॥ రెండు + ను; వర్ణకృతసూత్రంబున టివర్ణంబు. రెండు + టి + ను; తత్సమపరిచ్ఛేదములోని 'ఇకారంబుమీఁది' అను నిరువదియాఱవసూత్రంబున నువర్ణకంబుయొక్క ఉత్వంబునకిత్వంబగు. రెండు + టిని; ఆచ్ఛికపరిచ్ఛేదములోని ముప్పదిరెండవసూత్రంబున డువర్ణముయొక్క ఉకారంబునకు ఇత్వంబు రెండిటిని పక్షంబున 'రెండు' శబ్దంబు 'ంటి' వర్ణంబుకలుగుచోఁ బూర్వసూత్రంబులచే నిత్వంబులు గలిగి 'రెండింటిని' అగును. 'రెంటిని' ఈరూపమీపరిచ్ఛేదములోని ముప్పదియొకండవ వసూత్రంబుచే నంతిమపువర్ణంబునకు టివర్ణాదేశంబురాఁగా నైనది. ఇట్లే 'మూఁడిటిని 'మూఁడింటిని — మూఁటిని' ఇత్యాదులందు రెండుశబ్దంబునొద్ద నుపయోగింపఁబడిన సూత్రంబులన్నియుఁ బ్రక్రియలో నూహించుకొనునది. సామాన్యకము విశేషించి నిరూపింపనియప్పుడు 'ఒక' శబ్దంబునకు 'ఒకాను' శబ్దంబు పర్యాయంబగు. ఉ. దేవతులలో నొకానొకఁడు. ఇచ్చట నామంబు విశేషించి చెప్పఁబడలేదు. 'ఒకానొకటి' ఇత్యాద్యుదాహరణము. 'ఒకానొకరీతి' ఇది నామార్థకము. ఒకొకండనుక ... 'ఒండొకరు' పరస్పరమని భావార్థము. 'ఓరట్లు = ఏకత్వసంఖ్యాబోధకము. 'ఇనుమడి' రెండుశబ్దంబునకు 'ఇను' శబ్దాదేశంబును, మడుగుశబ్దంబునకు వృత్తియందు 'మడి' శబ్దాదేశంబును అగును. ద్విగుణమనియర్థము. ఇట్లే ముమ్మడి (త్రిగుణము) నలుమడి (చతుర్గుణము) 'ఈరాలు' ఇచ్చట 'ఇరు' శబ్దంబునకు నచ్చుపరమైనది కాన నాద్యక్షరంబు దీర్ఘంబయ్యె. 'ఈరాలు' అనుటకుఁ తిమ్మకవిగారు తమరుక్మిణీపరిణయమందు 'ఇరాలు' అనిప్రయోగించిరి. దీనికిఁ బ్రయోగాంతరంబు గానఁబడదు

వ్యా — పదముయొక్క మధ్యమందుండు హల్లుతోఁ గూడుకొని గకారమునకు వకారంబు వైభాషికంబుగాఁ గలుగును. ఉ. పలుగురు - పలువురు. ఇచ్చట గకారము సాధ్యమైనదియు, హల్లుతో - గూడినదియుఁ, గావున విభాషగా వకారంబయ్యె. వ్యవస్థితవిభాషకావున 'గొడుగు-గొడుగము-నిగారము' ఇత్యాదులయం దువత్వము లేదు. అసంయుక్తమనుటచే 'నిద్గ-ఉంగిడము' ఇత్యాదులయందును వత్వంబు రాదు. 'ఇరువదు-చేవరు-తొగ-పగలు-పగ-పగతుఁడు-పగిది-తెగ-తెగడు — ,అగు. ఇత్యాదులకుఁ పలుగురుశబ్దంబునకుంబలె వత్వముగ్రహింపనగు. తే॥ తిఁగతీవయును డిపరిపల్కఁగవచ్చు! బగడమునఁగదొత్తుఁ బవడమనఁగ! భాగిముగవరగు బోడిమిపా! జీమి! వేగవేనాఁగ వెలయుఁ గృష్ణ' అనంతుని ఛందము.

## ఔపవిభక్తిక ప్రకరణము.

విభక్తిసామీప్యంబునంజేసి వచ్చువికారంబులను బోధించుభాగము, ఔపవిభక్తిక ప్రకరణము

28 సూ — ఇటితివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు.

విభక్తినిమిత్తంబులయి యాదేశాగమాత్మకంబులయిన ఇ-టి-తి- అనువర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.

వ్యా — 'ఇ - టి - తి' అనునక్షరంబులు రాఁబోవు సూత్రంబులచే విధింపఁ బడునవి యౌపవిభక్తికంబులను నామంబున వ్యవహరింపఁబడును. ఈయౌపవిభక్తికంబు లాదేశాగమస్వరూపములైన 'ఇ - టి-తి' అనునక్షరంబులేయని గ్రహించునది.

29 సూ — ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగనగు.

కాలు - కాలిని - కాలిచే॥ నాఁగలి - నాఁగటిని - నాఁగటిచే॥ నేయి - నేతిని - నేతిచే॥ ద్వితీయైకవచనంబుపరంబగు నపుడౌపవిభక్తికంబులు రావని కొందఱువక్కాణించిరి-అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబు.

వ్యా—'ఇ-టి-తి' అనువర్ణంబులు ద్వితీయ మొదలైనవిభక్తులయొక్క యేకవచనంబులు పరంబులగునపుడుకొన్ని ప్రాతిపదికంబులకుఁదఱచుగాఁగలుగును. ఉ. కాలు. ద్వితీయావిభక్తి 'కాలిని' ఇచ్చట 'కాలు + ను' అనియుండఁగా నీసూత్రంబుచే 'కాలు' శబ్దంబుయొక్క ఉకారంబునకు ఇకారంబు వచ్చి 'కాలి + ను' ఇట్లుండె. పిమ్మట 'ఇకారంబుమీఁది' అను తత్సమపరిచ్ఛేదమందలి యిరువదాఱవసూత్రంబున నువర్ణకంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబుగలిగినది. 'కాలినొప్పి' ఇత్యాది సమాసస్థలంబులయందలి షష్ఠ్యాదివిభక్తులు లోపించినను, ఇత్వంబనపాయంబుగనుండును. 'కాలిచే' ఇత్యాదులిట్లే. 'నాగలి - నాగటిని - నేయి - నేతిని' ఇత్యాదులయందు 'టి - తి' వర్ణంబులు క్రమంబుగనయ్యెను. పైద్వితీయాంతంబులయందు 'కాలిని' అనుచోటునందుంబలె సూత్రంబులచేఁ బ్రక్రియయూహించుకొనునది. ద్వితీయావిభక్త్యేకవచనంబు పరంబగునపుడు, ఔపవిభక్తికంబులు రావని కొందఱు చెప్పిరనియు, ఆవచనములక్ష్యలక్షణవిరుద్ధంబనియు, సూరిగారు వ్రాసిరి. ఉ॥ 'విన్నవనేగుతానురల విందుకిలాతపునీపలెప్పునుక్' యయా- 2ఆ. క॥ 'పీఁడునదిలించెనయ్యెడ । పీపనివేసుకబలారివిబుధులతోనే। పీఁడుమణులనఁగఁదగుతన। పీఁడునఁగలమానికములు వివిధాంబరముల్' వసు- 6ఆ. క॥ కనకమయమైనయాప్రా। లునఁ దపసుతులాపహఁబులోనమరులచే, భార- ఆర- 4 ఆ. ఇట్లు, ఔపవిభక్తికశూన్యంబులగు ప్రయోగంబులు గలవు. కావునఁ బైవిధికొన్ని యెడల నిత్యంబుగాదు.

30 సూ—ఊరు మొదలగువాని కిత్వంబగు.

ఊరు — ఊరిని-కాలు-కాలిని-మ్రాను-మ్రానిని-నోరు - నోరిని. చోటు - చోటిని.

వ్యా—ఊరు మొదలైన నామములకు ఇత్వంబు గలుగును. ఊరు - ఊరిని. ఇచ్చట ఊరు + ను, అని యుండఁగాఁ బ్రకృత సూత్రంబున రేఫంబు యొక్క ఉకారంబునకు ఇత్వంబు గలిగి తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదియారవ సూత్రంబున నువర్ణంబు యొక్క ఉకారంబునకు ఇత్వంబు గలిగినది. మ్రానిని - నోరిని - నీరిని — చోటిని, ఇత్యాదులయందుఁ బైసూత్రంబులచే శబ్దసిద్ధిను గ్రహించుకొనవలయును. క॥ నకులుఁడు సహదేవుఁడును| బ్రకటభుజాస్ఫాలనమున నంతబలము చే| లకగోలకుఁ దిత్తురునో| రికి వచ్చినయట్లు లాడిరే యిబ్బంగిన్, భార- కర్ణ- 8-ఆ. ॥ నీరిలోనఁ దోఁచు తారక ప్రతిబింబ| మొక్కొ యనఁగ వెలుఁగుచున్న దాని, రాజకొడుకు లెల్లఁ జూచుచునుండిరి| దానిఁ బుచ్చుకొను విధంబు లేక, భార-ఆది- 5 ఆ.

31 సూ—టివర్ణంబు గొన్నింటి యంత్యాక్షరంబున కాదేశంబును గొన్నింటికం దాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బాక్షికంబుగనగు.

ఆదేశము - త్రాడు - త్రాటిని॥ కాడు — కాటిని॥ నోరు-నోటిని॥ ఏఱు - ఏటిని॥ ఆగమము - అన్ని —అన్నిటిని॥ ఎనిమిది - ఎనిమిటిని వేయి - వేయిటిని॥ ఉభయము - ఏమి - ఏటిని - ఏమిటిని॥ పగలు-పగటిని-పగలిటిని-పగంటిని మొదలు— మొదటిని- మొదలిటిని॥ రెండు- రెంటిని రెండిటిని ॥మూఁడు-మూఁటిని—మూఁడిటిని॥ నూఱు-నూటిని-నూఱిటిని.

వ్యా—'టి' అనునక్షరము కొన్ని శబ్దంబుల కడపటియక్షరంబునకు నాదేశము గావచ్చుటయు, గొన్నిటికి శబ్దంబులకుఁ గడపట నాగమంబుగవచ్చుటయు, మఱికొన్ని శబ్దంబులకు నాదేశాగమంబులు రెండునుగలుగుటయు, నగును. ఆఆదేశంబునకు—త్రాడు-త్రాటిని. ఇచ్చట నాదేశమనుటచేఁ గడపటియక్షరమైన డువర్ణంబునకు టివర్ణంబు గలిగి తత్సమపరిచ్ఛేదమునందలి యిరువదియారవసూత్రంబున నువర్ణంబుయొక్క ఉకా

రంబునకు నిత్యంబు గన్గినది. ఇట్లే 'కాటిని-నోటిని-ఏటిని' అనునవి గ్రహింపవలెను ఆగమంబునకు—అన్ని-అన్నిటిని. ఇచ్చట నాగమంబనుటచేఁ గడపటియక్షరంబునకు సామీప్యంబున 'టి' అనునక్షరంబుచేరి 'అన్నిటిని' అయినది. ఇట్లే 'ఎనిమిదిటిని-వే యిటిని' మొదలైనవి. ఉభయంబునకు—ఏమి-ఏటిని-ఏమిటిని. ఇచ్చట బర్యాయంబ నుటచే 'టి' వర్ణము ఆదేశంబును ఆగమంబును నైనదని గ్రహింపవలెను. 'ఏమిని' ఇచ్చట 'మి' అనునక్షరంబునకు బదులు టివర్ణంబువచ్చి 'ఏటిని' అయినది. 'ఏమిటిని' ఇచ్చట 'మి' అనునక్షరంబునకు సామీప్యంబున టివర్ణంబు చేరినదిగనుక నాగమంబు. ఇట్లే 'పగటిని-పగలిటిని, మొనటిని-మొనలిటిని. రెంటిని - రెండిటిని' మూఁటిని - మూఁడిటిని, నూటిని - నూఱిటిని.' ఇత్యాదులు గ్రహింపవలెను. అహోబలపతి యూ పవిభక్తికాంతంబగు నీరు శబ్దంబు సంస్కృతసమంబని చెప్పెను; కాని తత్సమంబునకు నౌపవిభక్తికంబు దుర్ఘటంబు. ఇయ్యది నీరు శబ్దభవంబని గ్రహింపవలెను. 'నీరము' ఇయ్యది తత్సమంబు. చ॥ 'అనిన సుమోహనుండు దమయంత్యకు నిట్లను నిజ్జగంబుల న్ని నొకట మ్రింగనేరియును నెట్టన సర్వము గావ నేరియు । న్వినుము ముకుందుఁ డజ్ఞుని నెచ్చెలి నాఁజెవులారవించునిం । కనతని నొక్కజామునకుఁ గా ధృతి వెం పటి నాశ్రయింతునే' భార- ఉద్యో- 2 ఆ' అను పద్యమందు "అన్నిటిని" అను ద్వితీయాంతం బుండవలయుననియు 'అన్నిని' అనునది యసాధువనియుఁ, గొందఱు భ్రాంతిచెందిరి. ఇయ్యది సముచ్చయార్థకద్రుతాంతంబైన ప్రథమాంతంబు. ద్వితీయార్థ మందున్నదని గ్రహింపవలెను. 'నీవేమిని వేగిరపడక' హరి - పూ- 8 ఆ. ఇచ్చటను సముచ్చయద్రుతాంతంబైన ప్రథమా విభక్త్యంతము.

2 ✓ (32) —సూ—హ్రస్వముమీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగానగు. Imp

అన్నింటిని - ఎనిమిదింటిని - పగంటినిపగలింటిని - రెండింటిని - మూఁడింటిని.

సున్న బహుళంబుగాఁ గలుగును. ఉ. అన్నింటిని. ఇచ్చట (న్ని) అనునక్షరము హ్రస్వమగును. దీనికి (టి) వర్ణంబు పరంబగునపుడు పూర్ణబిందువాగమంబయ్యె. ఇట్లే (ఎనిమిదింటిని, పగంటిని, పగలింటిని, రెండింటిని, మూఁడింటిని, ఇత్యాదులయందుఁ బర్యాయంబుగ ననుస్వార పూర్వకటివర్ణంబుండునని యూహింపవలెను.

33 సూ—పదాద్యంబగు హ్రస్వంబుమీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువగు.

కన్ను - కంటిని ॥ మిన్ను - మింటిని॥ ఇల్లు - ఇంటిని॥ పల్లు- పంటిని.

వ్యా—పదముయొక్క మొదటిహ్రస్వంబునకు టివర్ణంబు పరంబగునపుడనుస్వారం బాగమంబుగనగు. ఉ. కన్ను – కంటిని. ఇచ్చటను ద్విత్వంబునకును ముప్పదియొకండవ సూత్రంబున టివర్ణంబాదేశంబు కాఁగా నీముప్పదిమూఁడవ సూత్రంబున టివర్ణంబునకు ముందు బిందువాగమంబయ్యెను. ఇట్లె (మింటిని ఇంటిని- (ఇల్లు) పంటిని (పల్లు) వింటిని (విల్లు), ఇత్యాదిశబ్దంబులయందు ముప్పదియొకండవ సూత్రంబున టివర్ణంబు గలిగి ప్రకృతసూత్రంబున ననుస్వారాగమంబుగలుగును.

34 సూ—అట్టు మొదలగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటి లోపంబునగు.

అట్టు - అటితిని ॥ అట్టు - కట్టు-కొట్టు - గొట్టు - మిట్టు - వట్టు- ఇవి యట్టు మొదలయినవి.

వ్యా—అట్టు మొదలైన శబ్దంబులకు నంతమందు (తి) అనునక్షరంబు వచ్చుటయు శకటరేఫంబొక్కదానికి లోపంబును గలుగును. ఉ. అట్టు. అటితిని. ఇచ్చట

(అజ్జు + ను, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున నామంబు చివర తివర్ణాగమంబును, శకట రేఫంబొక్క దానికి లోపంబును గలుగ (అజు + తి + ను, ఆయ్యెను. తత్సమపరిచ్ఛేదంబు నందలి యిరువదియాఱవ సూత్రంబున (తి, వర్ణంబుమీఁది నువర్ణకంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబుగలిగి (అజు + తి + ని, అయ్యెను. పిమ్మట నీక్రిందిముప్పది యాఱవసూత్రంబుచేత శకటరేఫంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబు గలిగి (అజితిని, అనురూపము సిద్ధించెను. ఇట్లే (కజ్జు-కొజ్జు-గొజ్జు-మిజ్జు-వజ్జు, ఇత్యాదుల ద్వితీయాదివిభక్తులందు రూపసిద్ధి యెఱుంగునది.

35 సూ—విభక్తిపరంబగునపుడు గోయిప్రభృతుల తుదియక్షరంబు తివర్ణంబగు.

గోయి - గోతులు - గోతిని - గోతులను ॥ గోయి - చేయి- దాయి - నూయి - నేయి - వాయి - రోయి - ఇత్యాదులు.

వ్యా—విభక్తి పరంబగునపుడు (ప్రథమాబహువచనాదివిభక్తులు) గోయి మొదలైనశబ్దంబుల కడపటి యివర్ణంబునకు (తి, అనునక్షరంబాదేశంబగును. ఉ. గోయి - గోతులు. గోతిని - గోతులను. గోయి ప్రభృతులు స్త్రీసమంబులు గావునఁ బ్రథమైకవచనము లోపించెడిని. అందున విభక్తిపరత్వంబులేమింజేసి ప్రథమైకవచనాంతమందు యివర్ణంబునకు (తి, వర్ణాదేశంబు రాదు (గోయి + లు, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున యికారంబునకు (తి, వర్ణాదేశంబు గలిగి గోతి + లు, అయ్యెను. పిమ్మటఁ దత్సమపరిచ్ఛేదమందలి నలువదియేనవసూత్రంబునఁ దివర్ణంబుయొక్క ఇకారంబునకు ఉత్వంబుగల్గి (గోతులు, అయ్యెను (గోతిని, ఇచ్చట గోయి + ను, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున ఇకారంబునకు (తి, వర్ణంబుగల్గి తత్సమపరిచ్ఛేదమందలి యిరువదియాఱవ సూత్రంబున నువర్ణంబుయొక్క ఉత్వంబునకు ఇత్వంబుగలిగెను. ఇట్లే (చేయి-దాయి-నూయి-నేయి - వాయి- రోయి' ఇత్యాదిశబ్దంబుల శబ్దసిద్ధి యూహించినది. ఈతివర్ణాదేశంబు జౌపవిభక్తికమైన టివర్ణంబువలె ; ద్వితీయాద్యేకవచనమందే కాకుండఁ బ్రథమాబహువచనంబులు మొదలుగాఁగల యేకవచనబహువచనంబులయందును నామాంత్యవర్ణంబు

లకారాదేశంబగు. 'చేఁదుతుద్రువాయి తివర్ణంబగునప్పుడు' శబ్దల-శబ్దప- 212 సూ. ఉ. చేఁదబీర - చేఁతిసార-చేఁతిపొట్ల=చేఁతిపుచ్చ. మొ.

36. సూ-టితివర్ణంబులు పరంబులగునపు డుత్వంబునకిత్వంబగు.

రెండిటికి - మూఁడిటికి - నాలుగిటికి - పగలిటికి - మొదలిటికి - పెక్కిటికి - కొండొకచో నుత్వంబున కిత్వంబు రాఁబట్టదు ‖ నెత్తుటికి.

వ్యా— 'టి-తి' అను నక్షరంబులు పరంబగునపుడు ఉకారంబునకు ఇకారంబు గలుగును. ఉ. రెండిటికి. ఇచ్చట 'రెండు+కు', ఇట్టుండ ముప్పదియొకండవ సూత్రంబున 'రెండు' శబ్దంబుపైని టివర్ణాగమంబు కలుగఁగా 'రెండు+టి+కు' అయ్యెను తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదితొమ్మిదవసూత్రంబున టివర్ణముపైని 'కు' వర్ణంబు యొక్క ఉత్వంబున కిత్వంబుగలిగి 'రెండు+టి+కి అయ్యెను. పిమ్మటఁ బ్రకృత సూత్రంబున 'రెండు' శబ్దంబు యొక్క యంత్యాక్షరడువర్ణోత్వంబునకు నిత్వంబు గలిగి రెండిటికి, అయ్యెను. ఇట్లే మూఁడిటికి, నాలుగిటికి, పగలిటికి, మొదలిటికి, పెక్కిటికి, ఇత్యాదిశబ్దంబుల నూహించునది. (మూ. వ్యా.) కొన్నిచోట్ల టివర్ణంబు పరంబగునపు డుత్వంబునకు ఇత్వంబు రాదు. ఉ. నెత్తుటికి, ఇచ్చట టివర్ణంబు పరంబయినను, తకారద్వయంబుమీఁది ఉకారంబునకు ఇత్వంబు రాలేదు. ఇట్లే ప్రొద్దుటికి మొదలైనవి, కొన్నిచోట్ల వైకల్పికంబును గలదు. ఉ, చవుటి, చవిటి, మొదలైనవి.

37 సూ—టివర్ణంబుపరంబగునపుడు క్రిందు మీఁదు ముందు పువర్ణంబుల కత్వంబగు.

క్రిందు - క్రిందటిని — మీఁదు - మీఁదటిని - ముందు - ముందటిని - మాఁపు - మాఁపటిని — అప్పుడు - అప్పటిని.

సమన్వయించు. క॥ నీపాపమువున రాజ్యము లీపాండుతనూభవులకు నీకున్నభుజా । టోపభయంకరుఁడర్జును కోపానలమపరి ముట్టికొనదే నారీ, భార-ఉద్యో-1ఆ. ఉ॥ నీకు మాయెడల్ । విగ్రహమేల నెయ్యమున నిప్పుడు కౌరవరాజు బార్థివ । ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పిననీకు సలంధ్యమిత్తుఁ జేకా, భార-ఆర-6ఆ. ప్రక్రమపద్యంబులో భుజాటోపభయంకరుఁడు, అను ప్రక్రమాంతము (అర్జునకోపానలము, అను షష్ఠీతత్పురుషంబులోని కేకదేశస్థంబును లుప్తషష్ఠీకంబును నైనయర్జునశబ్దంబునకు విశేషణంబుగా నన్వయించుచున్నది ద్వితీయపద్యంబులో (పార్థివప్రాగ్రసరుండు, అను ప్రక్రమాంతంబు (ధర్మసుతుపన్పు అను షష్ఠీతత్పురుషంబులో నేకదేశస్థంబును, లుప్తషష్ఠీకంబును, నైనధర్మజాశబ్దంబునకు విశేషణంబుగా నన్వయించుచున్నది. ఇట్టివి పెక్కులు ప్రయోగంబులుగలవు ఇట్టిప్రయోగంబులు శాస్త్రదృష్టిచే నాలోచింపఁగా ధారాళమైనవి కావని చెప్పవలయును. సమాసపరిచ్ఛేదంబులోఁ బ్రక్రమసూత్రంబుచే సామర్థ్యంబుగలపదంబులకు సమాసంబు విధింపఁబడినది. సామర్థ్యంబనఁగాఁ బృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబనియుఁ, బృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తిసామర్థ్యంబనియు, వివరింపంబడియె. కనుక (అర్జునకోపానలంబు, అన్నసమాసంబులో నర్జునుండును, కోపాగ్నియు నిట్లు వేర్వేఱుగా సంబంధార్థంబులు స్ఫురించుచున్నను నర్జునుండు కోపాగ్నికి విశేషణంబై కోపాగ్ని విశేష్యంబై విశేషణవిశేష్యభావంబున నర్జునసంబంధి కోపాగ్నియనెడి యఖండార్థంబు స్ఫురించుచున్నయది. లోకంబులో వేఱువేఱుగా నున్నతంతువు (దారములు) లనెడి బహుపదార్థంబుల నన్యోన్యము మేళగించినపిమ్మట వస్త్రమనెడి యేకపదార్థంబగుచున్నది. బహుసంఖ్యగానున్న యిష్టకలను (ఇటుకలను) నొంటొంటిపై దృఢంబుగాఁ జేర్చినపిదపఁ గుడ్య (గోడ) మనెడి యేకపదార్థంబు కలుగుచున్నయది. చిందఱవందఱలై భిన్నంబులుగానున్న శిరోజంబు లల్లిబిల్లికతో నల్లంబడినపుడు జడయనెడి యేకపదార్థంబు జనించుచున్నయది. తంతువులకుఁ బటంబ (వస్త్రము) నెడివ్యాజంబున, నేకార్థత్వస్థితి కలిగినపిమ్మట వేఱుగానున్న యింకొకతంతువునకుఁ బటాంతర్గతమైన తంతువుతోఁ గలియుట దుర్ఘటంబు. పరస్పరమిళితంబులైన యిష్టకలు కుడ్యంబనెడి వ్యవహారంబును బొందినపిమ్మట నట్టికుడ్యంబులో నొకదేశమందున్న యిష్టకతో వేఱొకయిష్టకకు సంబంధంబు దుర్లభంబు. శిరోరుహంబులు పరస్పరమే

శిరంబున వేణి (జడ) యైన యనంతరంబునకట్టి స్త్ర్యంతర్భూతశిరోజంబులతోఁ బ్రమాదవశంబున దిగవిడిచిన యుత్తరశిరోజంబు కాఁ గాయుట దుర్ఘటంబు. అట్లే సమాసంబు నందుఁ బరస్పరభిన్నంబులుగా నున్నపదార్థంబు లేకార్థీభావశక్తిచే నేకపదార్థంబుగా భావింపఁబడినపిమ్మటను నట్టిసమాసైకదేశంబైనయర్థంబుతో సమాసబహిర్భూతపదార్థంబునకు నన్వయంబు దుర్ఘటంబు. కాన సంస్కృతభాషలోఁ ఁబుద్ధస్య (సంపదగల) రాజమాతంగః (రాజుయొక్క యేనుఁగు), అన్న యుదాహరణమునందు షష్ఠీతత్పురుషాంతర్భూతంబైన యుత్తరషష్ఠీవిభక్తికి రాజశబ్దార్థంబుతోఁ ఁబుద్ధస్య, అనెడి షష్ఠ్యంతవిశేషణం బన్వయించుట దుర్ఘటమైన యట్టులు భూజానిసహయాంకగుఁడు, అనువిశేషణంబు ఁఅర్జునకోపానలంబు, అనుసమాసంబులో నేకదేశవర్తియైనయర్జునపదార్థంబుతో నన్వయించుటయు ఁపార్థివప్రాగ్రసరుండు, అను విశేషణంబు ఁధర్మసుతుపన్నిది, అనుసమాసంబులో నంతర్భూతంబైన ధర్మసుతపదార్థంబుతో విశేషణభావంబున నన్వయించుటయు దుష్కరంబు. ఐనను సంస్కృతవ్యాకరణంబులోఁ ఁజైత్రోదనంశాలీనాం; తేషాం శాలీనా మోదనమిత్యర్థః (ఏశాలిధాన్యము (వరిధాన్యము) యొక్క యన్నము?) ఁసక్త్వాఢకమాపణీయానాం; ఆపణీయానాం సక్తూనా మాఢకమిత్యర్థః =(అంగడియందలి పేలపిండియొక్క యాఢకము; = పరిమాణవిశేషము) ఇత్యాది స్థలంబులలోఁ ఁశాలీనాం, అనెడి సమాసబహిర్భూతషష్ఠ్యంతంబునకు ఁజైత్రోదనం, అనెడి సమాసంబులో నంతర్భూతంబైన ఁశాలి, శబ్దంబుతో నన్వయంబు కలిగినట్టులును: ఁఆపణీయానాం. అనెడి షష్ఠ్యంతవిశేషణంబునకు ఁసక్త్వాఢకం, అనెడి సమాసంబులో నేకదేశవర్తియైన సక్తుపదార్థంబుతో నన్వయంబు సంభవించినయట్టులును, పైనిం జెప్పిన మహాకవుల తెలుఁగుప్రయోగంబులు క్వాచిత్కంబులై యుండవచ్చునని తెలిసికొననది. విశేషణంబులషష్ఠికి ప్రథమావిభక్తిగాక విశేషణంబుల ద్వితీయాదివిభక్తులను బ్రథమావిభక్తి మహాకవి ప్రయోగంబులఁ గానఁబడెడిని కావుననే యాడిపము సూరకవీంద్రుఁ డిట్లు లక్షణపద్యంబును రచియించుచున్నాఁడు. ఁక|| అనయము క్రియతోఁ బాసియుఁ| దగు పెక్కువిభక్తులం బ్రథమ యొందును భక్తగానయమానచిహ్నం|దగజాతి ప్రకీర్తి దికలనల మెననంగఁ, కవిసంశయవిచ్ఛేదము. ప్రథమ – త– చ|| ఆహీనబాహుబల సారథురుల్ మధుకైటభాదిపు| త్యాగములనెల్ల ప్రముద్ధరుఁ దె, నిర్గ్ర–గా, ...

త్యపకులనెల్ల, అనెడిద్వితీయాంతవిశేష్యంబునకు (సునల్, అను ప్రథమావిశేషణము ప్రయోగింపఁబడియె. ఉ॥ పూనిప్రతిజ్ఞ చేసి కృతపుణ్యుఁడు లక్ష్మణుతోడ జెల్మియుఙ్ భార- ఆర-7ఆ. క॥ మాతండ్రి పరాశరసుతు। చేతంబనసితి ననుజ్ఞ శీలపరత్వో। పేతుఁడగుధర్మతనయుఁడు। ప్రీతినొడంబడియె బంధుబృందయుతముగన్, భార-ఆశ్ర-1ఆ. క॥ నీదుకులమ్మునకుఁ దగఁబతోఁ దమునోని రక్షముగ దుపడ్డాఁగుము నృపఘోర్మదయుఁడర్జునుతోడను। గావనక రణంబు సేయఁగా నీకగునే, భార-ఆది-6ఆ. (నృపఘోర్మదయుఁడగు నర్జునుతో, అనిపాఠాంతరము) క॥ తండ్రీ ఘటోత్కచుఁడు మా। తండ్రి గలుగఁగాదె తల్లిద్రౌపదితోడన్। చంద్రులహారిదీశ్వరులెన- సంద్రమునోగడఁ దెచ్చెగంధమాదనమునకున్,. జైమి-1ఆ. పైపద్యంబులయందు లక్ష్మణుతోడన్, పరాశరసుతుచేతన్, అర్జునుతోడన్, ద్రౌపదితోడన్, అను తృతీయాంతవిశేష్యంబులకుఁ గ్రమంబుగా కృతపుణ్యుఁడు, తండ్రి, నృపఘోర్మదయుఁడు, తల్లి, అను ప్రథమావిశేషణంబులు ప్రయోగింపఁబడియె. అనేకేబలపతి (సర్వవిశేషణానాంప్రథమాస్యాత్, అనిన నన్నయభట్టారకునిసూత్రంబులో (విశేషణానాం, అన్న బహువచనసామర్థ్యంబుచే నొక్కషష్ఠ్యంతవిశేష్యంబునకే ప్రథమాంతంబు విశేషణంబుగానుండుట గాక తక్కినకొన్ని షష్ఠీతరవిభక్త్యంతంబులకుఁ గూడఁ బ్రథమాంతంబు విశేషణంబుగ నుండవచ్చుననియు (సీ॥ గీ॥ ఆద్యుఁడు హిరణ్యగర్భునందంతకుం డె, ఆము-3ఆ. అనిన సవితాపితామహాని వచనము నిర్మూలనునియు, సప్తమ్యంతవిశేష్యంబునకుఁ బ్రథమాంతంబు విశేషణంబు కూడదనియుఁ జెప్పెను.

28 సూ.—భవత్యర్థవ్యవహితంబులగువిశేషణంబులకుం బ్రథమ యగు.

అగు మొదలగునవిభవత్యర్థములు ॥ విద్యాశాలియగుపురుషుని సకలజనులు సన్మానింతురు ॥ భూతదయాపరులగు మహాత్ములకు శ్రేయంబుగలుగును ॥ అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమయిన కేశవార్జున కృతి.

వ్యా—'అగు' 'అవు' 'ఔ' (భూతార్థకవిశేషణంబులు) అయిన, 'ఐన' (భూతార్థకవిశేషణంబులు) కాని, (వ్యతిరేకార్థకవిశేషణము) ఇత్యాది భవత్యర్థకంబులచే (విశేష్యంబుతో) వ్యవహితంబడిన విశేషణంబులకుఁ బ్రథమయగు. ఉ. 'విద్యాశాలియగుపురుషుని సకలజనులు సన్మానింతురు.' ఇట 'విద్యాశాలి' అను విశేషణంబు 'పురుషుని' అను ద్వితీయాంతవిశేష్యంబునకు సంబంధించియున్నందున ద్వితీయాంతంబు కావలసియున్నను 'అగు' అనిన భవత్యర్థకధాతుజవిశేషణంబుతో వ్యవహితంబగుటంజేసి ప్రథమావిభక్త్యంతంబైయుండె. 'అగు' అనుభవత్యర్థకంబులేనియపుడు 'విద్యాశాలిని బురుషుని సకలజనులు సన్మానింతురు' అని ద్వితీయాంతంబుగ నుండందగు. ఇట్లే 'భూతదయాపరులగు మహాత్ములకు శ్రేయంబు గలుగును; అతిమానుషమత్యద్భుతమతి సుప్రసన్నమయిన కేశవాజ్ఞసదృశి' ఇత్యాదిస్థలంబులయందు నీసూత్రమునఁ బ్రథమావిభక్తి విశేషణంబులకు గల్గినని తెలియునది.

29 సూ.—భవత్యర్థకంబుసన్నిహితవిశేషణంబునకును దానిముందువిశేషణంబులకయిపదంబును బహుళంబుగానుప్రయుక్తంబగు.

అతులుఁడయియప్రమేయుఁడౌ హరినిగొలుతు

వ్యా—భవత్యర్థకంబులైన 'అగు' 'ఔ' శబ్దంబులు విశేష్యంబునకు నవ్యవధానంబుగఁ బూర్వమందున్న విశేషణంబునైనను. ఎడముగానున్న విశేషణంబునపై 'అయి' 'ఐ' అనుక్త్వార్థకావ్యయంబులు ప్రయోగింపఁబడును. ఉ. అతులుఁడయియప్రమేయుఁడౌ హరినిగొలుతు ఇందు 'హరిని' అను విశేష్యంబునకు 'అప్రమేయుఁడు' అనునది సమీపవిశేషణంబుగావున దానిపైని భవత్యర్థకమైన 'ఔ' అనునది ప్రయోగింపఁబడె 'అతులుఁడు' అను విశేషణంబు హరికి దూరవర్తియగుటంజేసి దానిపై 'అయి' అనునది చేర్పంబడియె.

30 సూ.—అయిపదానుప్రయోగంబులేనిచోఁ దుదివిశేషణంబునకేనివిశేషణంబులన్నింటికేని మీఁదసముచ్చయార్థంబువిభాషం బ్రయోగింపంబడు.

ఆద్యుఁడప్రమేయుఁడునగు హరినిఁగొలుతు ॥ ఆద్యుఁడు నమేయగుణుఁడునౌ హరినిఁగొలుతు ॥ ఆద్యుఁడప్రమేయుఁడగు హరినిఁగొలుతు

వ్యా—'అయి' అనుపదము దుర్ధస్వవిశేషణంబుపైఁ జేర్పనియప్పుడు తుది విశేషణంబునకుఁగాని, విశేషణంబులన్నింటికిఁగానిఁ సముచ్చయార్థకశబ్దంబు విభాషగాఁ జేర్పింపఁబడును. ఉ. ఆద్యుఁడప్రమేయుండునగు హరినిఁగొలుతు ఇయ్యెడ 'ఆద్యుఁడు' అనువిశేషణంబుకంటె 'అయి' పదంబు మానంబడినందునఁ దుదివిశేషణంబైన 'అప్రమేయుఁడు' అనుదానికి సముచ్చయార్థకంబైన 'ను' శబ్దంబు చేర్పంబడినది. 'ఆద్యుఁడునమేయగుణుఁడునౌ హరినిఁగొలుతు' ఇచ్చట నన్నివిశేషణంబులకును సముచ్చయార్థక 'ను' శబ్దంబు చేర్పఁబడియె. 'ఆద్యుఁడప్రమేయుండగు హరినిఁగొలుతు' ఈవిధి వైభాషికంబు గావున నీయుదాహరణంబునందు విశేషణంబులలోఁ దేనికిని సముచ్చయార్థక 'ను' శబ్దంబు చేర్పంబడలేదు.

31 సూ.—ధాతుజవిశేషణావ్యవధానంబునవిశేషణంబులన్నింటికయిపదంబు ప్రయుక్తంబగు.

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యెసంగెడు దేవుని నభినుతింతు ॥ ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబుగలదది ప్రయోగంబుల నెఱుంగునది.

వ్యా—విశేష్యంబునకుఁ ధాతుప్రత్యయార్థకవిశేషణం బవ్యవధానంబుగాఁ బూర్వంబందుండినచోఁ బక్కనవిశేషణంబు లన్నింటిపైని 'అయి' పదంబు చేర్పంబడు: ఉ. ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యెసంగెడు దేవుని నభినుతింతు. ఇచ్చట 'ఎసంగెడు' అను క్రియాజన్యవిశేషణంబుతో విశేషణ విశేష్యంబు లెడపెట్టఁబడకున్నవి కావున 'ఆద్యుఁడు, అప్రమేయుఁడు, అఖిలసేవ్యుఁడు' అను విశేషణంబులన్నింటికిని 'అయి' అనుపదంబు చేర్పంబడియె. (మూలము) ఇచ్చట

మఱియుం బ్రయోగవైచిత్ర్యంబుగలవని ప్రయోగంబుల నెఱుంగునది. (వ్యా) ప్రయోగవైచిత్ర్యంబునా సూత్రంబునం జెప్పినరీతిగా ఁఅయి, పదంబు లెల్ల విశేషణంబులకును ననుప్రయుక్తంబుగాక కొన్నివిశేషణంబులకును, గడపటివిశేషణంబునకును, ననుప్రయుక్తంబు గాఁగఁ గవిప్రయోగంబులు గ్రంథంబులయందుఁ గలవు కావున ఁఆద్యుఁడు నప్రమేయుఁడు నఖిలనేతృఁడునై యొసంగును దేవుని సభినుతింతు ఇత్యాది ప్రయోగవైచిత్ర్యంబు లుండవచ్చునని భావంబు.

32 సూ.—భావార్థకాదియోగంబునం గర్తకుఁ బ్రథమయగు.

రాముఁడువచ్చుట - రాముఁడు రాఁగా లక్ష్మణుఁడుగాంచె - రాముడువిల్లందినం ద్రిలోకంబులాకులంబులగు - రాముఁడు పట్టినప్రతిన వారింపందరంబుగాదు.

వ్యా—భావంబనఁగా ధాత్వర్థము. ధాత్వర్థమందుఁ గ్రియాపరిచ్ఛేదంబులోని ముప్పదియైదవసూత్రంబుచే ఁట, వర్ణకంబును. ముప్పదియాఱవసూత్రంబున ఁకఁ, వర్ణకంబును, ముప్పదియేడవసూత్రమ్ముచే వ్యతిరేకభావంబున ఁమి, ప్రత్యయంబును, విధింపబడినవి. కావునఁ బైనిం జెప్పిన ఁటవర్ణకాదులు భావార్థకంబులు. ఆదిశబ్దంబుచే నలుబదవసూత్రంబుచే నయిన భావలక్షణార్థంబునందలి ఁనుఁ, వర్ణకంబును, నలుబదియొకండవసూత్రంబుచేనయిన ద్రుతాంత ఁన, వర్ణకంబును, నలుబదిరెండవసూత్రంబులోని ఁడు, వర్ణకంబును, నలుబదిమూఁడవసూత్రంబులోని భూతార్థక ఁన' వర్ణకంబును, ఇత్యాదిప్రత్యయంబులూహించుకొనునది. ఈప్రత్యయాంతశబ్దంబులతో నన్వయించిన కర్తకుఁ బ్రథమావిభక్తి గలుగును. ఉ. రాముఁడువచ్చుటం, ఇచ్చట ఁటు, వర్ణకాంతవచ్చు ధాతువుతో రామునకు నన్వయంబుకానఁ బ్రథమవచ్చెను. సంస్కృతభాషలో నిట్టిభావార్థకతిఙంతస్థలంబులోఁ గర్తకుఁ దృతీయయగును. రాముఁడువచ్చుట = రామేణాగమ్యతే. ఇట్లు సంస్కృతాంధ్రభాషల శైలిం జేసికొన్నిచోటులఁ బ్రయోగభేదంబు చూపట్టెడి. ఉ. రాముఁడు రాఁగా లక్ష్మణుండు గాంచె, ఇచ్చట ఁరాఁగ, అనునది నుఁజివర్ణకాంతము. ఈశబ్దంబునకుఁ గ్రియాపరిచ్ఛేదంబునందలి నూటపదునేనవసూత్రంబుచే

స్ఫురితవంశయుఁజొచ్చితి నందుఁ బొందుమూ। నరునరుఁ గోడలైతి జననంద్యులఁబొందితి నీతివిక్రిమ। స్థిరులను పుత్రులంబడసితి స్నహజన్ములప్రాపుఁ గాంచితిక్ । సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయుక్' భార.ఉద్యో. 3ఆ.శా॥ కృపాహీనుస్యంపైనె గోమఖ। వ్యాఘ్రుంబంతియకాక నీవు బుసిపే యూహావితర్కింపఁగక్' కవులవష్ణము. మ॥ జయలక్ష్మిభవుఁడైన నీవునగహాత్సామ్రాజ్యభోగంబుల। న్నియు నర్పించితి' జైమినీ భారతము. మ॥ జననంబొందితి దుగ్ధవారినిధినా సర్వోత్తమజాటంబుపై । జనులేప్రాస్తుఁ బ్రశంససేయనవతంసంబైతి' శకుంతలాపరిణయము (పిల్లలమఱ్ఱి పినవీరన్న ప్రణీతము) క॥ ఏనీకు నొకటి చెప్పెద। దానవపలములన్నియ పెఱలియు నవట్ఠ్యం। దైవననుబోఁటవాఁడే మానవుల జయింప విక్రమమునం గలదే, ఉత్తరరామాయణము. ఉ॥గీ॥ అధికతాపపరీతాత్ముఁడైన నాకు। నెట్లునవ్వితి' హైమవతము. సీ॥ గీ॥ రండునమనఁగొంచు యోమాపరిత్రాత్ములార। వత్సలతమీరు మీరేలవట్టురయ్య। పరమునిత్యావ్యగ్రుడైనా పక్షులగలి । కటకటా సౌఖ్యజలరాశిఁ గాళిఁ బాసి' కాళీఖండము. ఉ॥ హరికృపంగవితావిలాసవి। స్ఫుర మహనీయుఁడైన ననుసర్వగుణోత్తరమూర్తి. ఉత్తరరామాయణము.

**35 సూ—అదిశబ్దంబునకు వుములు పరంబులగునపుడును, సంబోధనంబునందును, దానయనునాదేశంబగు.**

నీవుచిన్నదానవు - నేనుచిన్నదానను-ఓచిన్నదాన.

వ్యా—అది, అనుశబ్దంబునకు మధ్యమపురుష పువర్ణకంబును, ఉత్తమపురుష మువర్ణకంబును బరంబగుచుండఁగా 'దాన' అనునది యాదేశంబగు. సంబోధనంబునందుంగూడ నీయాదేశంబుగలుగును. ఉ. నీవు చిన్నదానవు. ఇచ్చట 'నీవుచిన్న + అది + వు' అనియుండ 'అది, అనుదానికి 'దాన' అనునది యాదేశంబయ్యె. 'నేనుజిన్నదానను' ఇచ్చట 'ను, అను నుత్తమపురుషైకవచనము పరంబగుచుండ అది అనుదానికి దానశబ్దాదేశంబు కలిగె. 'ఓచిన్నదాన' ఇచటఁగూడ పెనుకటి యాదేశంబు కలిగెను.

**36 సూ—అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు.**

వాఁడును మీఁరును ధన్యులరు ॥ మీఁరును నేమును ధన్యులము.

వ్యా—ప్రథమ మధ్యమోత్తమ పురుషంబులకొన్యంబులను నొక్కచో సమావేశంబు గలిగినప్పుడు క్రమంబుగాఁ బరకార్యంబు ప్రబలంబు. అనఁగా నొకవాక్యంబులోఁ బ్రథమ మధ్యమ పురుషంబులకు సమావేశంబు గలిగినప్పుడు క్రియావిభక్తి మధ్యమ పురుషంబుతో నన్వయించును. మధ్యమోత్తమ పురుషంబులకు నేకవాక్యంబులో సమావేశంబు గలిగినప్పుడు క్రియ యుత్తమపురుషమై యుండుననని తాత్పర్యము. ఉ. 'వాఁడును మీఁరును ధన్యులరు', ఈవాక్యంబునందు 'వాఁడును' అను తచ్ఛబ్దంబునుబట్టి ప్రథమపురుషంబును, 'మీఁరును' అను యుష్మచ్ఛబ్దంబునుబట్టి మధ్యమపురుషంబును, ప్రాప్తించుచుండఁ బ్రకృతసూత్రంబుచేఁ గ్రియావిభక్తి మధ్యమపురుషంబుతో నన్వయించినది కావున మున్పటిసూత్రము ముప్పదినాల్గవ సూత్రంబులచే 'రు', శబ్దాగమత్వంబులుగల్గి 'ధన్యులరు', అనురూపంబాయెను. 'మీఁరును నేమును ధన్యులము', ఈవాక్యంబునయందు మధ్యమపురుషోత్తమపురుషంబులున్నందునఁ గ్రియావిభక్తులవిధికి సంశయంబురాఁగాఁ బ్రకృతసూత్రంబున నుత్తమపురుషకార్యంబు ప్రబలంబై ముప్పది మూఁడవసూత్రంబుచే ముశబ్దాగమంబును, ముప్పదినాల్గవసూత్రంబున నత్వంబును, గల్గినవి. వాస్తవంబున నాలోచింపఁగా 'వాఁడును మీఁరును ధన్యులరు', అనువాక్యంబునందు 'మీఁరును', అనిన యుష్మచ్ఛబ్దార్థంబునకే 'వాఁడును', అనినతచ్ఛబ్దార్థంబును బ్రథమాంతంబగుటవలనను, ప్రథమాంతంబు శాస్త్రంబునం జేసి కర్తగానుండుటవిధియౌటవలనను, గర్తకుఁ గ్రియాన్వయము నవసరముగుటవలనను, 'వాఁడును' అనినతచ్ఛబ్దార్థంబునకుంగూడఁ గ్రియతో నన్వయంబు తప్పక యుండవలసియున్నది. కావుననే ధన్యత్వము యుష్మదర్థంబునందు సంబంధించినట్లే తచ్ఛబ్దార్థంబునందుంగూడ నన్వయించును, 'మీఁరును ధన్యులరు, వాఁడును ధన్యుఁడు', అని స్ఫురించుచున్నది, అందున 1 వాఁడును 2 మీఁరును 1 ధన్యుఁడు, 2 ధన్యులరు, ఇట్లుండఁ 'గ్రమముగా', అనిన బహువచనాంతమైన యుదాహరణంబునందుఁ బక్కిన రెండు నామశబ్దంబులను లోపించి యొక్క రామశబ్దంబే శేషించినయట్లును 'ధన్యుఁడు' అనిన ప్రథమపురుషంబు లోపించి 'ధన్యులరు' అనినమధ్యమపురుషంబు శేషించినదనియు, భాషాపరిపాటిం జేసి తెలుంగులోఁ బ్రథమపురుష మధ్యమపురుషంబులకు సముచ్చయంబున మధ్యమపురుషంబునకు నేకశేషంబు గలుగు ననియు, మధ్యమోత్తమ పురుషంబులకు సముచ్చయంబున నుత్తమపురుషంబునకు

సముచ్చయంబు గలుగుననియు, నూహింపవలయును. మ॥ అవమాన్యుఁ డీ సభలోన మాన్యుఁడని సౌహార్దంబునం గౌరవ స్థవిర ప్రేరణ నిన్నుఁ బాండుతనయుల్ దప్పంగఁ బూజించిరి యవ్వివేకాస్పదులైన పాండవులు మోహాంధుండు భీష్ముండు గోపవనీవుం గడఁగుండు నాకు నెదురై సంగ్రామరంగంబునన్' భార. సభా. 2 ఆ. అను పద్యంబునందు 'నవివేకాస్పదులైన పాండవులు కడంగుదురు: భీష్ముండు కడంగుననిరి నీవు కడంగుము' అని పాండవ భీష్మకృష్ణులు మువ్వురును గ్రియాశ్రయులైన కర్తలు స్ఫురించుచున్నది. ఇట్లుఁ బ్రథమపురుషంబు లోపించి మధ్యమపురుషంబున కేకశేషంబు గలిగినది. తక్కిన పురుషంబులు లోపించినట్లు కడంగుఁడు, అనిన బహువచనంబే తెలుపుచున్నది. ఇట్టి పురుషంబుల సమావేశంబున సంస్కృత భాషకును, ఆంధ్ర భాషకును, గొంచెము సాదృశ్యంబున్నందున బాలవ్యాకరణంబులో నుదాహరింపఁబడిన తెలుఁగు వాక్యంబులు సంస్కృతంబులోనికి మార్చి చూపంబడుచున్నయవి. 'వారును మీరును ధన్యులరు' దీనికి సంస్కృతము 'యూయంధన్యాః' అని యుండును. త్యదాదీనామిథస్సహోక్తౌ యత్పరం తచ్ఛిష్యతే, అను సాంస్కృతిక వ్యాకరణంబునఁ జైవాక్యంబులోని 'యూయం, అను రూపంబు, తేచ(వారును) యూయంచ(మీరును)=యూయం (వారును,మీరును), అను నర్థంబుంగల రూపంబయ్యె. త్యద్ శబ్దంబు మొదలైన శబ్దంబులకు నన్యోన్యము సహవాసంబు గలిగినప్పుడు త్యదాదిగణంబులోఁ బాఠక్రమంబున నేదిశబ్దంబు పరంబో యది శేషించి తక్కినయది లోపించునని యర్థము. త్యదాదులు—త్యద్, తద్, (వాఁడు,అది) యద్ (ఎవఁడు,ఏది) ఏతద్, ఇదం, అదస్ (వీఁడు,ఇది) ఏక, ద్వి, (ఒకటి,రెండు) యుష్మత్ (నీవు)అస్మత్ (నేను) భవత్ (నీవు),అనునీయవి ద్విశబ్దంబువఱకేకాక భవచ్ఛబ్దమువఱకు నీవార్తికంబుచేఁ ద్యదాదులని వ్యవహరింపఁబడుచున్నవి ఈశబ్దార్థంబులకు సముచ్చయంబుసంభవించినప్పుడు పైగణపాఠంబులోఁ జూపినక్రమంబున నేశబ్దంబుపరమో యది శేషించితక్కినశబ్దంబులోపించు. 'యూయం,అనునపుడు 'తేచ,యూయంచ(వారును, మీరును)అన్నవృత్తి పైనిం జూపంబడినది. ఈవృత్తిలోఁ దచ్ఛబ్దార్థంబును,యుష్మచ్ఛబ్దార్థంబును, మిళితంబులై యున్నయవి. పైగణపాఠంబులోఁ దచ్ఛబ్దంబుతరువాత యుష్మచ్ఛబ్దంబు పఠింపబడినందునఁ బూర్వోక్తసూత్రంబుచేఁ దచ్ఛబ్దంబు లోపించి యుష్మచ్ఛబ్దంబు శేషించినది. ఇట్లు 'యూయం' అనిన యుష్మచ్ఛబ్దంబు శేషించినప్పటికి నారూపంబునకే 'వారును మీరును, అనునర్థంబు చెప్పికొనవలయును. అనఁగాఁ

దచ్ఛబ్దంబు లోపించినను దాని యర్థంబుమాత్రంబు లోపింపక యేకశేషవృత్తిలో నిమిడి యున్నయది. ఇట్లు సంస్కృతంబులో 'తేచ యూయంచ, అనుసుబంతంబులకు నేకశేషము గలిగినప్పుడు పరమైనయుష్మచ్ఛబ్దంబే మిగిలినప్పటికిఁ దచ్ఛబ్దార్థము పోని యట్టులు తెలుఁగుబొప్పశైలింజేసి 'వారును మీరును ధన్యులరు, అను వాక్యంబులోఁ ద్యదాది పర్యాయంబులైన 'వారును మీరును, అనువానికి నేకశేషంబు గలుగక వాని విధేయవిశేషణంబులకును, వాని క్రియలకును, నేకశేషంబు సంభవించి తదర్థముపోదని గ్రహింపవలయును. పైతెలుఁగువాక్యంబులో 'ధన్యులరు, అన్నది విధేయవిశేషణంబు. పైసంస్కృతవాక్యంబులో 'యూయం, అనునప్పుడు 'తేచ(వారును), అన్నయర్థంబిమిడియున్నట్లే 'ధన్యులరు, అన్నప్పుడు 'ధన్యులు, అనిన ప్రథమపురుషంబిమిడి యున్నయది యనియు, సాంస్కృభాషాశైలింజేసి ప్రథమపురుష మధ్యమపురుష సమావేశంబున మధ్యమపురుషంబు శేషించుననియు, మధ్యమపురుషోత్తమపురుష సమావేశంబున నుత్తమపురుషంబునకు నేకశేషంబు గలిగి మధ్యమపురుషంబు లోపించుననియు, లోపించిన పురుషంబులయర్థంబు శేషించిన పురుషంబులలోనే యిమిడి యుండుననియు గ్రహింపనగు. కావుననే పైచిన్నయసూరికృతసూత్రంబులో 'ఉత్తరోత్తరకార్యంబులు బలవ,ని చెప్పంబడినందునఁ బ్రథమాదిపురుషంబుల యర్థంబులు, నిర్బాధంబుగ స్ఫురించునని తోఁచుచున్నది. ఇఁకను మీరును మేమును ధన్యులము, అను తెలుఁగువాక్యంబునకు 'వయంధన్యాః, అన్న సంస్కృతవాక్యంబు పర్యాయంబగు (పైవాక్యంబులోని) 'వయం=యూయంచ, వయంచ (మీరును మేమును), అనిన యస్మచ్ఛబ్దంబునందే యుష్మచ్ఛబ్దార్థ మేకశేషవృత్తిచే గ్రహింపబడుచున్నయది. 'ధన్యాః' అనునట్టి ధన్యశబ్దార్థంబునందును లోపించిన యుష్మచ్ఛబ్దంబునొక్క యర్థంబులో సమన్వయించుచున్నది. (పైవాక్యంబులోని) 'ధన్యాః'= ధన్యాశ్చ ధన్యాశ్చ (ధన్యులరు, ధన్యులము), అని యేకశేషవృత్తిచే నుభయశబ్దార్థంబులను సమన్వయించును. 'వయం ధన్యాః, యూయం ధన్యాః, అనువాక్యంబులలో లోపించిన యుష్మచ్ఛబ్దార్థతచ్ఛబ్దార్థంబులను సమన్వయించుటకై ధన్యాః, అను నొకటియునం గూడ నేకశేషంబైనయట్టులు 'వారును మీరును ధన్యులరు, మీరును మేమును ధన్యులము' అనిన ధన్యశబ్దంబునొద్ద నేకశేషవృత్తి యున్నదనియు, వాక్యంబులో శ్రుతంబులైన పైరేఖానిర్దిష్టతచ్ఛబ్ద యుష్మచ్ఛబ్దార్థంబులతో సమన్వయించుననియు గ్ర

చెప్పుమని యడిగినఁ జెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడుక్, భార-ఆది-3ఆ. ఇత్యాదులలో హెచ్చుగాననలయును. కర్తృబహువుగానుండి క్రియ బహువచనంబునందున్నచో నిర్బంధంబు. ఉ. బలసంపదఁ బొసఁగయున్నత్రిన| బలహీనుఁడు ఘనయు కోలుపడినయతఁడు ముద్రిత నేఁడు నతడుఁగామా | కలచిత్తుఁడు నిద్రలేక కుందుదురధిపా!, భార- ఉద్యో- 2ఆ. గీర్వాణభాషయందును గర్తృబహుత్వంబున్నను క్రియ యేకవచనంబులో నుండుట తెలియఁగలరు. శ్లో. జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః, రామాయణము. సుందరకాండ. 42 సర్గ. (అతిబలుండైన రాముఁడును లక్ష్మణుండును జయించెను) శ్లో. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః, పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః, మహాభారతస్థ భీష్మపర్వఘటిత భగవద్గీత-ప్రథమాధ్యాయము. (కృష్ణుండు పాంచజన్యంబును అర్జునుండు దేవదత్తంబును, భీముండు పౌండ్రంబను శంఖంబును, బూరించెను) శ్లో. సఖా గరీయాన్ శత్రుశ్చ కృత్రిమః, మాఘము. 2 సర్గ-36 శ్లో. (కృత్రిమశత్రువును, కృత్రిమస్నేహితుండును, బలీయుండు) శ్లో. మహేన భూతపలభిః ప్రతాపేన మహీపతిః, కువలయానందము దీపకాలంకారము. (మదము చేత నేనుఁగుగున్నయదుఁ, ప్రతాపము చేత రాజును ప్రకాశించును.)

37 సూ— ఏకవాక్యంబునందొకానొక్కపదము తక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంబడును.

పూర్వమిది పరమిదియను నియమమపేక్షింపక వాక్యమందెల్ల పదంబులు వలచినట్లు ప్రయోగింపందగును - ఏనిప్రభృతిశబ్దములు కొన్నినియమసాపేక్షంబులయియుండు - గాలిచల్లగావీచెను - వీచెనుజల్లగాగాలి - చల్లగాగాలివీచెను - వీచెనుగాలిచల్లగా - గాలివీచెనుజల్లగా - చల్లగావీచెనుగాలి.

వ్యా— వాక్యంబునందు నొకానొకపదంబుతప్ప నన్ని పదంబులు సాపేక్షముతెదు

వాని నెపనివి ప్రయోగింపవలయునని యడుగఁగా నియమము సామాన్యంబు లేకుండ వాక్యంబునందుఁ పదంబులు వాక్యార్థంబు చెడకుండునట్లు యథేచ్ఛం బ్రయోగింపనగును. (సూత్రము) ప్రాగ్వ్యవహిత పదవిన్యాస నియమ మపేక్షింపక వాక్యమునందెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపఁబడును. (సూత్రము) (వా—) ఏని ప్రభృతి శబ్దంబులు కొన్ని నియమ సాపేక్షంబులయి యుండును; 1. గాలి చల్లగా వీచెను 2. వీచెను చల్లగా గాలి 3. చల్లగా గాలి వీచెను, 4. వీచెను గాలి చల్లగా 5. గాలి వీచెను చల్లగా 6. చల్లగా వీచెను గాలి.

వ్యా—ప్రభృతి శబ్దంబుచేత 'పోలెన్', 'వలెన్', 'అట్లు', 'అయ్యును', 'పొంటెన్', ఇత్యాది పదంబులు నియమం బపేక్షించి ప్రయోగింపంబడు. అనఁగా ఏని, శబ్దాదులు తమయర్థంబే పదంబుల యర్థంబులతో నన్వయించునో యా పదంబుల యొద్దనే వచన కావ్యమందు గాని పద్యకావ్యమందుఁ గాని ప్రయోగింపంబడును కాని తమయన్వయంబాకాంక్షించు పదార్థంబుల దూరంబునఁ బ్రయోగింపఁబడఁ గూడదు. ప్రథమోదాహరణంబునందు 'వీచెను' అను శబ్దంబునందలి క్రియావిభక్తిచే నాకాంక్షితంబైన 'గాలి' అను కర్త 'వీచు' క్రియతో నన్వయించుచున్నయది. కానఁ గర్తకును, క్రియకును సాన్నిధ్యనియమంబు ప్రాప్తించుచుండఁగాఁ బదార్థంబులకు వ్యవధానంబున్నను దోషంబు లేదనుటం జేసి 'చల్లగా' అను క్రియావిశేషణంబు 'గాలి', 'వీచెను' అను శబ్దంబులకు మధ్యగానున్నను దోషంబులేదు. ద్వితీయోదాహరణంబునందుఁ గ్రియ మొదటనుండినను 'చల్లగా' అను క్రియావిశేషణంబు క్రియాకర్తల మధ్యనుండి యుపయుక్తమగుచున్నను దోషంబు లేదు. తృతీయోదాహరణంబునందు 'చల్లగా' అనునది క్రియావిశేషణంబు గావున 'వీచెను' అను క్రియ యొద్దనుండుట యత్యావశ్యకంబైనను దూరస్థితివలన వాక్యంబనర్థకంబు గాదు. చతుర్థోదాహరణంబునందుం గూడఁ గర్తనుమున్నె క్రియయున్నను 'చల్లగా' అను క్రియావిశేషణంబు దూరస్థంబైనను నశాస్త్రీయంబు గాదు. పంచమోదాహరణంబునందు విశేషణంబు విశేష్యంబునకు ముందుండుట యావశ్యకంబు గావున 'చల్లగా' అను క్రియావిశేషణంబు 'వీచెను' అనుదానికి ముందుండుట యుక్తంబు. ఇటం గ్రియ తరువాత నున్నను సుగంబే. షష్ఠోదాహరణంబునఁ గర్తసు వాక్యంబునఁ గ్రియయున్నను సరసంబ. సంస్కృతభాషయందుం బలె నాంధ్రభాషయందును వాక్యంబున నన్వయక్రమంబు నపేక్షించి పదంబులు ప్రయోగింప నత్యావశ్యకత లేదుగనుకనే 'వ్యవహితాశ్చ సర్వేస్యుః' అని నన్నయభట్టారక పండితాగ్రేసరుండు సూత్రంబు రచియించెను.

బెనంగొని వేఱియనువెపంబున నేకపదార్థంబుగా భావింపఁబడి నట్లులును, దేవదత్త గురుపదార్థంబులు రెండును విశేషణ విశేష్య సంబంధంబుచేనన్యోన్యాన్వయంబునుమిళితంబులై దేవదత్తసంబంధిగురువని యఖండార్థంబుగా భావింపంబడును. వాక్యమునందంగీకరింపఁబడిన వ్యపేక్షాసామర్థ్యంబుగాక సమాసంబునందు నేకార్థీభావంబని నేకొకసామర్థ్యఁబంగీకరించుటకుఁ గారణంబేమన నాకర్ణింపుము 'సుందరుండు దేవదత్తునియొక్క గురువు' అనిన వాక్యంబునఁ బైనిం జెప్పిన ప్రకారంబున దేవదత్తగురు పదార్థంబులకు వ్యపేక్షా సామర్థ్యంబు గలదుగదా! ఈవాక్యంబున 'సుందరుండు' అనిన విశేషణంబు దేవదత్తున కన్వయించి సుందరుఁడైన దేవదత్తునియొక్క గురువని తోఁచువో సౌందర్యము దేవదత్తునకుఁ దలంపంబడును. (ఏకార్థీభావంబునుగూర్చి కారకపరిచ్ఛేదంబునందలి 27 సూత్రంబునొద్ద విస్తరంబుగ వ్రాయంబడె) 'సుందరుఁడు దేవదత్తునిగురువు' అనిన స్థలంబున దేవదత్తుని గురువనఁగా దేవదత్తసంబంధిగురువని యఖండార్థముగా (ఏకార్థముగా) భావింపంబడినందున 'సుందరుఁడ'నిన విశేషణంబు గురువుతో నన్వయించుంగాని షష్ఠీతత్పురుషంబులో నేక దేశవర్తియైన దేవదత్తునితో నన్వయింపదు. ఇఁకను 'పార్థివ| ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్నిది నీసువలంస్యము' భార-ఆర-6ఆ. 'భూజా|టోపభయంకరుఁ డర్జును కోపానలము' భార-ఉద్యో-1ఆ. ఇత్యాది స్థలంబులయందు 'ధర్మసుతు పన్పు' అనిన సమాసంబులో నేకదేశవర్తియైన ధర్మసుతునితో 'పార్థివ ప్రాగ్రసరుండు' అనిన విశేషణంబును' అర్జును కోపానలంబు' అనిన ద్వితీయోదాహరణంబులో నంతర్భూతంబైన యర్జున పదార్థంబుతో 'భయంకరుఁడు, అనిన విశేషణంబును నెట్టులన్వయించెనని శకింపరేని యట్టిప్రయోగంబులు గతికగతికంబులగుటం జేసి క్వాచిత్కంబుగాఁ బ్రయోగింపంబడునని కారకపరిచ్ఛేదంబునందలి యిరువదియేడవ సూత్రంబువివరించు తఱిని విస్తరంబున వివర్శించి యంగీకరింపంబడియె. కనుకనే పైని సమాసంబునందుఁ గొండొకచో నేకార్థీభావంబును, వ్యపేక్షయును నుభయంబును నుండుననిచూపంబడె. ఇట్టి యుదాహరణంబులందు నేకార్థీభావంబేకాక వాక్యంబున నుండునట్టి వ్యపేక్షాసామర్థ్యముకూడ నంగీకరింపంబడినందున 'పార్థివ ప్రాగ్రసరుండు, ధర్మసుతునియొక్క-పన్పు' ఇత్యాది వాక్యంబులందు 'పార్థివప్రాగ్రసరుండు, ఇత్యాది విశేషణంబులు ధర్మసుతునితో నన్వయించినట్టులు 'పార్థివ ప్రాగ్రసరుండు, ధర్మసుతుపన్పు' అనిన సమాసస్థలంబునందుంగూడ విశేషణంబు వ్యపేక్షా

సామర్థ్యంబున నుండవలెను. పైని వివరించినయేకార్థీభావంబునే మూలంబులో 1 పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబుసామర్థ్యంబనియు, (2 పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబులకేకార్థంబునందు వృత్తిసామర్థ్యమనియు, లక్షణద్వైవిధ్యంబు చూపి సూరిగారు వివరించిరి అనఁగా 1 వేఱుగావున్న యర్థంబులకు నేకార్థత్వభావన సామర్థ్యంబనియును, 2 వేఱుగాఁ బ్రసిద్ధంబులైన యర్థంబులం దెలియంజేయు పదంబులకు నేకార్థంబునందునునికి సామర్థ్యంబనియుఁ బూర్వోక్తలక్షణ ద్వయార్థంబు. ఈలక్షణార్థంబు లుదాహరణసహితంబుగా శాఖాసంక్రమణంబు చేసి పైని వివరింపంబడియెఁ గావునఁ బునరుక్తంబుగ విశదీకరించుట యనావశ్యకంబు. పైనింజెప్పిన సామర్థ్యంబు గలిగిన పదంబులుచేరి యఖండపదంబు కావుట సమాసంబనంబడు. సమాసంబనఁగాఁ గూడికవలననైనది యని యవయవార్థంబు. వాస్తవంబున నాలోచింపఁగా మూలసూత్రంబున 'సమర్థంబులగు పదంబులు' అని సవర్ణదీర్ఘసంధితో నుండవలయును. అయినను (సమ + అర్థ' ఇట్లుండ శకంధ్వాది గణంబున గణనంజేసి పరరూపసంధికలిగి (సమర్థ' అయ్యెను. దీనియందలి సమశబ్దంబునకు 'ఏకము' అనిన యర్థము. (సమర్థము=ఏకార్థము) ఏకార్థీభావశక్తిచే మిళితంబులైనపదంబులు సమాసంబనంబడునని లక్షణార్థంబు.

2 సూ—సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు.

సాంస్కృతికంబనియాచ్ఛికంబనిమిశ్రంబనినసమాసంబు త్రివిధంబు- అందు సాంస్కృతికంబు సిద్ధంబనిసాధ్యంబని ద్వివిధంబు- కేవలసంస్కృతశబ్దంబుల సమాసంబు సిద్ధంబనాఁబడుఁ - రాజాజ్ఞ - తటాకోదకము- లక్ష్మీవల్లభుఁడు ॥ సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబనాఁబడు- రాజునాజ్ఞ - తటాకంబునుదకము - లక్ష్మీవల్లభుఁడు ॥ తక్కిన తెనుఁగులసమాసం బాచ్ఛికంబనంబడు ॥ ఱేనియానతి - చెఱువునీరు - సిరిచె

ట్టము — మంచిరాజు — ఇదిసంఖ్యాపూర్వంబుద్విగుపునాఁబడు - ముజ్జ గములు - ముల్లోకములు ॥ బహువ్రీహి - ముక్కంటి - చలివెలుఁగు ॥ ద్వంద్వము - తల్లిదండ్రులు - అన్నదమ్ములు ॥ ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబుఁ దొడరని సమాసంబుంగలదని సూచింపంబడియె — దానంజేసి చిగురుఁగేలు జుంటిమోవి యిత్యాదులయిన యుపమాన పూర్వపదకర్మధారయంబులు గ్రాహ్యంబులు॥ ముఖపద్మము - చరణకమలములు - ఇట్టియుపమానోత్తరపదంబులు గలవుగాని విపరీతంబులుసిద్ధంబులు లేవనియెఱుంగునది ॥ సిద్ధంబుసర్వంబు గ్రాహ్యంబు - రాజపురుషుఁడు - నీలోత్పలము - పీతాంబరుఁడు - రామలక్ష్మణులు ॥ కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు - దానంజేసియనేకమాఱు లల్పదంకి త్యాదులు దుష్టములని తెలియునది.

1 తత్పురుష బహువ్రీహిద్వంద్వంబులని సమాసంబు లెల్లం ద్రివిధంబులయియుండు; అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయ పదార్థ ప్రధానంబులయియుండు; 2 అందుఁ దత్పురుషంబు వ్యధికరణంబని సమానాధికరణంబని ద్వివిధంబు; 3 ద్వితీయాదులకు మీఁది పదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు; నెలతాల్పు, నెలతక్కువవాఁడు, దేవరమేలు, దొంగభయము, రాముని బాణము, మాటనేర్పరి. 4 విశేషణంబు నకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబునాఁబడు; ఇదియే కర్మధారయంబునాఁబడు; సరసపు వచనము, తెల్లగుఱ్ఱము, మంచిరాజు. 5 ఇది సంఖ్యాపూర్వంబు ద్విగువునాఁబడు; ముజ్జగములు, ముల్లోకములు. 6 బహువ్రీహి—ముక్కంటి, చలివెలుఁగు 7 ద్వంద్వము—తల్లిదండ్రులు, అన్నదమ్ములు. 8 ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబుఁ దొడరని సమాసంబుగలదని సూచింపఁబడియె; దానంజేసి చిగురుఁగేలు, జుంటిమోవి యిత్యాదులైన యుపమానపూర్వపదకర్మధారయంబులు గ్రాహ్యంబులు 9 ముఖపద్మము, చరణకమలములు, ఇట్టి యుపమానోత్తర పదంబులు గలవు గాని విపరీతంబులు సిద్ధంబులులేవని యెఱుంగునది. 10 సిద్ధంబు సర్వంబు

గ్రాహ్యంబు-రాజపురుషుఁడు, నీలోత్పలము, పీతాంబరుఁడు, రామలక్ష్మణులు. కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు; దానంజేసి యనేకమాఱు .లల్పదంజి త్యాదులు దుష్టములని తెలియునది

వ్యా—తత్పురుష మొదలైనవానికి లక్షణంబు తెలియునగ సంస్కృతంబునందు జెప్పఁబడ్డ యశ్లోకమును. తత్పురుషంబనః-ఉత్తరపదంబుయొక్క యర్థంబుప్రధానంబు గఁగలది 1సమాసంబులన్నియు-తత్పురుషము-బహువ్రీహి, ద్వంద్వము, అనిమూఁడువిధము లు. అమూఁడును దఃఖమగాఁదత్పురుషంబుత్తరపదంబుయొక్క యర్థంబు ప్రధానం బుగఁగలదియు, బహువ్రీహిసమాసఘటకంబుగాని పదంబుయొక్క యర్థంబుప్రధానం బుగాఁగలదియు, ద్వంద్వంబు, సమాసఘటకపదార్థంబు లన్నింటియొక్క యర్థంబును ప్రధానంబుగాఁగలదియు నైయుండును, 2 అందుఁదత్పురుషంబు—వ్యధికరణంబనియు సమానాధికరణంబనియు రెండువిధంబులు 3 ద్వితీయ మొదలు సప్తమివఱకు విూఁదపదం బులతో సమాసంబు వ్యధికరణం బనంబడును. ఉ. నెలతాల్ప (నెలను దాల్చినవాఁడు) ద్వితీయాతత్పురుషంబు. నెలతక్కువవాఁడు (నెలచేతఁదక్కువవాఁడు) తృతీయ. దేవర మేలు (దేవరకొఱకు మేలు) చతుర్థి, దొంగభయము (దొంగవలనిభయము) పంచమి. ఈ పంచమికిఁ గారక పరిచ్ఛేదంబునందలి తొమ్మిదవ సూత్రంబును జూడునది. రామునిబా ణము (రామునియొక్క బాణము) షష్ఠి. మాటనేర్పరి (మాటలయందు నేర్పరి) సప్తమి. విశేషణంబు విశేష్యంబుతోఁ గలియు సమాసంబుసమానాధికరణంబనంబడును. ఇదియే కర్మధారయసమాసంబు. ఉ..సరసపు వచనము మొదలైనవి. 'సరసము' ఇయ్యది విశేష ణంబు, 'వచనము' ఇయ్యది విశేష్యంబు ఇచ్చట సంధిపరిచ్ఛేదంబునందలి మువ్వదిరెండవ సూత్రంబునఁ బుప్వంబు. ఇట్టి తెల్ల ప్పులను మున్నుగు వానియందుఁగ్రహింపునది. సమా నాధికరణంబనగానేమ యార్థంబు-సమాస-ఏక ప్రవత్తికరణము=ఆధారంబుగల. అనఁ గా రెండుగాని యంతకంటె నెక్కువైన ధర్మంబులుగాని యొక్క వస్తువును నాధా రంబుగాఁ జేసికొనియుండుట. కర్మధారయ సమాసంబు నందురు. ఉ. సరసపువచన ము. ఇట సరసత్వ ధర్మంబును వచనత్వ ధర్మంబును నీరెండును వచనంబు నాధారంబు చేసికొని యున్నవి. కాన సామానాధికరణ్యంబు కర్మధారయంబునందు, ఆసామా నాధికరణ్యంబు విశేషణ విశేష్యభావంబున్న చోటుననే సంభవించును. 5 సంఖ్యావా

చకశబ్దంబు పూర్వమందుఁగలదై యుత్తరపదార్థ ప్రధాన సమాసంబు ద్విగుసమాసం బనంబడు. ఉ. ముజ్జగములు. (మూఁడు + జగములు) మొదలైనవి. ఇచ్చట జగమను శబ్దంబునకుఁ బూర్వము 'మూఁడు' అను సంఖ్యావాచకశబ్దంబున్న యది. అది, 'జగములు' అన్నశబ్దంబునకు విశేషణంబు. ఈసమాసంబునందు 'జగములకు' ప్రాధాన్యము. ఇట్లే ముల్లోకములు మొదలైనవి. 6 'ముక్కంటి' ఇత్యాది బహువ్రీహిసమాసము. ఇట సంఖ్యావాచకశబ్దంబు పూర్వంబునందున్నను నుత్తరపదార్థంబైన కన్నులకుఁ బ్రాధాన్యంబు కాక విశిష్టసమాసంబుచే శివుండు ప్రధానుండై చెప్పంబడి నందున బహువ్రీహికిని ద్విగువునకును భేదంబు స్పష్టంబగుచున్నయది. ఇట్లే 'చలివెలుఁగు' (చల్లనికిరణములు గలవాఁడు=చంద్రుడు) మొదలైనవి. 7 తల్లిదండ్రులు (గలరు) ఇత్యాది ద్వంద్వసమాసంబు. ఇచ్చట 'తల్లి, తండ్రి' అను రెండు పదంబుల యొక్క యర్థంబును బ్రధానంబు. 'తల్లి దండ్రులు గలరు' ఇత్యాది వాక్యంబులయందు సమాసఘటకంబులైన మాతాపితృపదార్థంబులు రెండును 'కలుగు' అను క్రియతోఁ గర్తలై యన్వయించినందున ద్వంద్వసమాసంబునందు నుభయపదార్థంబులకును బ్రాధాన్యంబు గలదు. ఇట్లే 'అన్నదమ్ములు' మొదలగునవి. ద్వంద్వసమాసంబునం దక్క సమాసఘటక పదార్థంబు లన్నింటికిని బ్రధానత యేసమాసంబునందును లేదు. ఇట్టి సర్వపదార్థ ప్రాధాన్య విశేషంబును బట్టియే 'శ్లో॥ అక్షరాణామకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ। అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః' అని భగవద్గీతా దశమాధ్యాయంబునందు శ్రీకృష్ణభగవానులు సమాసంబులలో సర్వపదార్థ ప్రాధాన్యంబునం జేసి ద్వంద్వసమాసంబు సర్వప్రధానుండగు తనస్వరూపంబని సెలవిచ్చిరని శ్రీమధుసూదనసరస్వతీవిరచితశ్రీభగవద్గీతాగూఢార్థదీపికావ్యాఖ్యయందు వివరింపఁబడినది. 8 మూల సూత్రంబునఁ బ్రాయికంబ (తఱచు)ని చెప్పుటచేత సంస్కృత లక్షణంబు పొందని సమాసంబుంగూడఁగలదని చూపంబడినది. అందువలనే 'చిగురుఁ గేలు, జుంటిమోవి' మొదలగు నుపమానము పూర్వమందుఁ గలసమాసంబులాంధ్రభాషాశైలిం జేసి గ్రహింపఁదగినవి. ఇందుఁబూర్వపదార్థంబులు 'చిగురును, జున్నును' ఉపమానంబులు. ఇయ్యవి హస్తాధరోష్ఠంబులకుఁ బోల్పఁబడెను. సంస్కృతంబులో 'హస్తకిసలయము, అధరమధుప్రాపము (మధుకోశము, తేనెపెర) ఇట్లుపమాన వాచకంబు లుత్తరపదంబుగా నుండవలెను 9 'ముఖపద్మము, చరణకమలములు' అను నిట్టి యుపమాన వాచకంబులు కడపటఁ గల సమాసంబులు గలవి

గాని విపరీతము (ఉపమానవాచకంబు పూర్వపదంబులుగాఁ గలవి) లైనవి(పద్మముఖము, కమలచరణములు) సంస్కృత సమాసంబులు లేవని తెలిసికొనునది. 'ఉపమితంవ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే'ఆ2పా2-సూ56' అను సూత్రంబునఁ బురుషవ్యాఘ్రము, నృసోముఁడు, రామచంద్రుఁడు ముఖపద్మము, చరణకమలములుఁ ఇత్యాది సమాసంబు సమాసఘటకంబులందు నుపమాన వాచకపదంబు పరమం జేయుండవలెను. సాధారణధర్మ వాచకపదంబుకానిచో నుపమానపదంబు పూర్వపదంబుగానుండఁగూడదుగానిధర్మవాచకంబు సమాసమిళితంబయ్యె నేని యుపమానవాచకంబు పూర్వ పదంబు కావచ్చును ఉ. ఘనశ్యాముఁడుఁ తటిద్గౌరి ము. తెలుఁగులోఁ గూడ నుపమానోత్తరపదకర్మ ధారయంబులు మహాకవులచేఁ బ్రయోగింపంబడె. ఉ. మోముఁదమ్మి మోము-దామర, కాఁదీఁగ, మైదీఁగ, కేలుఁదమ్మి ము. ఉ॥ వాడిన మోముఁదమ్మి తెలివాఱిన కన్నులు విన్నఁ బోవ మనసు—3ఆ. తే. గీ॥ ఒప్పుపుప్పొడి పఱపు పైనొత్తి గిల్లి| మోముఁదమ్మి తలాడపై మోపి యడుగు' వసు—4ఆ చ॥ అనయము మ్రోల నేకతమహార్ఘగతిం గనచిన్న రామచంద్రునినగు మోముఁదామరసిరుల్ గనుపండువుగాఁ జెలంగ, రాము—2ఆ. సీ॥ అన్నవకాఁదీఁగెయందంబు మదినిల్పి జనునచలంబుపై జగుపున్సృష్టి' భాగ-ఆది 3ఆ. సీ॥ పాలిండ్లతను వెన వ్రాలింపఁజెన్నొందునసగు కాఁదీఁగ యల్లాడుచుండు' భాగ-విరా-4ఆ. ము. 10 సంస్కృతవ్యాకరణంబునన్నైన సమాసంబులన్నియుఁ దెలుంగులో వాడవచ్చును. ఉ. రాజపురుషుఁడు (షష్ఠీతత్పురుషము రాజుయొక్క భృత్యుఁడనియర్థము.) నీలోత్పలము (కర్మధారయంబు). పీతాంబరుఁడు (బహువ్రీహి; విష్ణువు). రామలక్ష్మణులు (ద్వంద్వము.) 11 కేవలసంస్కృత శబ్దంబు తెలుఁగు శబ్దంబుతోఁ గలియదు. అందుననే, అనేక మాఱులు, అల్పనందు మొదలైనవి దోషయుక్తంబులు. తెలుగు విభక్తి చేఁజిహ్నితంబు గాని కేవలసంస్కృత ప్రాతిపదికంబులకుఁ దెలుంగుతో సమాసంబు కూడదని భావము. ఇన్నటను 'అనేక' శబ్దంబును, 'అల్ప' శబ్దంబును దెలుంగు విభక్తి లేకుండఁ బ్రయోగింపంబడియె. అనేకపు మాఱులు 'అల్పపుదండు' అనినచో సాధువులగు 'హంసనడకలు, సరణిజోఁదు, పాండువిభుకోపలు' ఇత్యాదిసమాసంబులయందుఁ బూర్వపదంబుపై విభక్తి జనించి లోపించినది. కావుననవ్యున్నిసాధ్యంబులుగాని కేవలసిద్ధపదంబులు కావు.

4 సూ—ఆ ఈ ఏ యను సర్వనామంబులు త్రికంబనంబడు.

వ్యా—ఆ-ఈ-ఏ, అను సర్వనామంబులు త్రికమనంబడును. 'త్రికము' అను దానియందలి క ప్రత్యయంబు సంఖ్యార్థంబునందు వచ్చును. ఇట్లే చతుష్కము, పంచకము, షట్కము, సప్తకము, అష్టకము, నవకము, మున్నగునవి గ్రహింపనగును.

5 సూ—కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజ విశేషణపూర్వపదంబయియుండదు.

ఆచందము - ఈచిందము - ఏచందము - వాఁడిమాట - పోఁడిపాట - బెడిదపుటడిదము - మడిసెమదకేసములు ॥ ఈనియమముచే - బల్లిదుఁడుమల్లుఁడు - కానలుఁడుదానకుఁడు - ఇత్యాదుల సమాసంబు లేదు.

వ్యా—కర్మధారయ సమాసంబున—త్రికము. (ఆ-ఈ-ఏ) స్త్రీసమ శబ్దంబులు (ప్రథమైకవచన లోపంబుగల శబ్దంబులు) ముగాగమాంత శబ్దంబులు, (సూత్రంబులో నిముగంత శబ్దంబుచే ముగాగమకంబును గ్రహింపబడును. చూ. తత్స—29 సూ) క్రియాజన్య విశేషణంబులు, పూర్వపదంబులుగలవియైయుండదు. త్రికంబునకు—ఆచందము, ఈచిందము, ఏచందము. స్త్రీసమంబునకు—వాఁడిమాట, పోఁడిపాట, ఇచ్చట 'వాఁడి పోఁడి' శబ్దంబులను నాచ్ఛికపరిచ్ఛేదంబులోని రెండవసూత్రంబున స్త్రీసమత్వాదిదేశంబునంజేసి ప్రథమైకవచనలోపంబు. ఈసూత్రంబునొద్దఁ గర్మధారయోదాహరణంబులు పూర్వోత్తర పదంబులు తెలుఁగుపదంబులైన సమాసంబులే చూపఁబడినవి కాని పూర్వపదంబు తెలుఁగును, ఉత్తరపదంబు సాంస్కృతికంబును నైన కర్మధారయంబునందు నాంధ్రపదంబు 'శ్లో॥ సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం కర్మధారయో భవతి' ఆంధ్రశ-హలంత-48సూ॥ అను సూత్రంబుంబట్టియు, 'ఆంధ్రంపదమ్ యత్పర్యంతం సంస్కృతేనసమస్యతే' అనిన యాథర్వణ కారికను బట్టియు, నాలుగువర్ణంబులకంటె మించి యుండఁగూడదని నియమంబేర్పడుచున్నది. కావున 'వాఁడిమిసాహసములు', 'వేఁడిప

లాక్షణికార్థంబే యంగీకరించినచోఁ గటికి-చీఁకటి యనెడుతిండి (భక్ష్యము) అని సామానాధికరణ్యంబున రెండుపదార్థంబులకుఁ గర్మధారయంబు చెప్పికోవలెను. తిండి యనునది స్వతస్సిద్ధంబుగా నామవాచకంబే గాని విశేషణార్థంబుగాదు 'తిండికరము' అనఁగా భోజనహస్తము. భోజనహస్తమనునపుడు భోజనసంబంధమైన హస్తంబనునట్టులు తిండిసంబంధంబైనకరములని సంబంధార్థంబుతోఁబదార్థద్వయంబును సమన్వయింపఁజేయవలెను. సంబంధార్థంబునందు శేషషష్ఠి గలుగును. 'భోజనముయొక్క హస్తము' అనిన విగ్రహంబు వోలె 'తిండియొక్క హస్తము' అనిషష్ఠీతత్పురుషంబు చెప్పక తప్పదు. భోజనంబునకును. హస్తంబునకును సంబంధంబేమనఁగా భుక్తికి హస్తముసాధనంబు గావున 'రాజపురుషుఁడు' అన్నచో షష్ఠికి సేవ్యసేవక భావమర్థంబయినట్టులు, ఇచ్చట సందర్భవశంబున సాధ్యసాధన భావంబు షష్ఠ్యర్థంబు కావలయు 'ఎంగిలి హస్తము' ఇత్యాది ప్రయోగంబులయందు నెంగిలి సంబంధంబైన హస్తంబని సంబంధార్థంబున షష్ఠీతత్పురుషంబు వోలె 'తిండికరము' అన్నచోటనుం దిండి సంబంధంబైన కరమని సంబంధార్థంబున షష్ఠీతత్పురుషంబే శాస్త్రంబునఁ జెప్పనొప్పగు. కావుననే యీముక్త వ్యాఖ్యయందుంగూడ సంఘటితంబైన యిప్పద్యంబును వివరించుతఱిని నిట్టి సమాసంబేల కనిగెనన్న ప్రశ్నమును, సమాధానంబును ప్రశంసింపఁబడలేదు, మఱియు నీవ్యాఖ్యయందు 'కటికి-చీఁకటి తిండికరములన్నచో 'కటికి-చీఁకటి భక్షణముగాఁగల హస్తములని' బహువ్రీహ్యర్థక విగ్రహంబు విశదీకరింపఁబడినది. ఈపదంబునకే మనుచరిత్రవ్యాఖ్యానంబునందుఁ గర్మధారయార్థక విగ్రహంబు గ్రహింపంబడినది. కాన నియ్యవి ప్రౌఢమార్గంబునంజేసిన వ్యాఖ్యానంబులుగాని సమాసానుకూలంబుగా లిఖింపంబడిన వివరణంబులుగావు. పైనింజెప్పినచొప్పున సమాసంబు షష్ఠీతత్పురుషంబే సయుక్తికంబు గావునఁ గర్మధారయంబని భ్రమంజెంది యిట్టిది ప్రామాదికంబని పెద్దనార్యనిపైనెదిరితద్దయు గద్దించుట పెద్దతనంబుగాదు. కావుననే తిమ్మకవీంద్రుఁడుసర్వలక్షణసారసంగ్రహమందలి ద్వితీయాశ్వాసచతుర్థలక్షణంబందు 'కటికి-చీఁకటి తిండికరముల' అనుసమాసంబు మిశ్రంబునందు లక్ష్యంబుగా నిరూపించెనుగాని దీనిం గర్మధారయంబునొద్ద నుదాహరింపలేదు. మువర్ణకాంత విశేషణంబులకు—'బెడిదపుటడిదము (బెడిదము + అడిదము)' సూత్రంబులోని ముగంతశబ్దంబు మువర్ణకంబునకును గ్రాహకంబు గావున మువర్ణకాంతంబౌ 'బెడిదము' శబ్దంబు కర్మధారయసమాసంబునకుఁ బూర్వపద

బుగానుండె. సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదిరెండవ సూత్రంబుచే, బువర్ణంబును, ఇరువది యెనిమిదవ సూత్రంబుచే, ‘టు’ గాగమంబును, గలుగ ‘బెడిదపుటడిదము’ అయ్యెను. బెడిదపుటడిదము=భయకరమైన ఖడ్గము. సమాసఘటకశబ్దంబులవిభక్తిలోపంబు శాస్త్రీయంబైనను సంధిపరిచ్ఛేదంబులోని ముప్పదిరెండవ సూత్రంబుచేఁ గర్మధారయంబునందలి మువర్ణకంబునకుఁ బుంపు వర్ణవిధానసామర్థ్యంబున నిచట ‘బెడిదము’ అనుదాని మువర్ణకంబునకు లోపంబు రాదని యెఱుంగునది. ముగంతవిశేషణంబునకు—‘బెడిదపుటడిదమును’ ఇచ్చట ‘బెడిదములు + అడిదము’ అనియుండఁగా సమాసంబునకు లోపంబురా ‘బెడిదము + అడిదములు’ అని ముగాగమాంత ‘బెడిద’ శబ్దంబు శేషించె. మువర్ణక కార్యంబు ముగాగమంబునకును గలుగును (తత్స-41సూ) గావున సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పది రెండవసూత్రంబుచేఁ బువర్ణంబును, ఇరువదియెనిమిదవసూత్రంబున ‘టు’ గాగమంబునుగలిగి, ‘బెడిదపుటడిదము’ అయ్యెను. ‘బెడిదములు’ అనుచోటఁ దత్సమపరిచ్ఛేదమునందలి నలువదియొకండవసూత్రంబుచే ముగాగమంబని గ్రహింపునది. ధాతుజవిశేషణంబునకు—‘మడిసెడుపడవములు’ ఇచ్చట ‘మడిసెడు’, అనునది ధాతుజవిశేషణము. మడియుధాతువుపైఁ గ్రియాపరిచ్ఛేదంబునందలి నలుబదినాల్గవసూత్రంబున ‘ఎడు’ వర్ణకంబును, ఏఁబదినాల్గవసూత్రంబుచే సకారంబును నయ్యెను. (మూలము) ఈనియమముచే ‘బల్లిదుఁడు, మల్లుఁడు కావలుఁడు రావణుఁడు’ ఇత్యాదుల సమాసంబులేదు (వ్యా)—త్రికాదిపరిగణనచే ‘బల్లిదుఁడు, మల్లుఁడు, కావలుఁడు రావణుఁడు’ ఇత్యాదిదమంత విశేషణంబుతోఁ గర్మధారయంబు రాదుగావున ‘బల్లిదమల్లుఁడు, కావలరావణుఁడు’ ఇత్యాదికముగా సమాసంబులుండవు. వ్యస్తంబుగానే యుండవలయును.

6 సూ—స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహిఁ జూపట్టెను.

ముక్కంటి-వేగంటి - చలివెలుఁగు - వేవెలుఁగు - మాటబరి-
ఇత్యాదులు వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులు.

వ్యా—స్త్రీసమంబులైన పదంబులతోఁ గూడిన యొకానొక బహువ్రీహి గానంబడును. అనఁగా సమాసంబులోని విశేషణవిశేష్యంబుల మీఁది ప్రథమైకవచనంబు

బును గాఁగాఁ; 'ఉక్కి + ఈ' అయి యపదాదిస్వర నిత్యసంధిచే 'ఉక్కీ' ఆయెను. ఈప్రత్యయాంతంబు మగాదిగణంబుగావున డుక్ వర్ణకంబుగల్గి 'ఉక్కీఁడు' అయ్యెను. రూపాంతరంబు 'ఉక్కివుఁడు' అనియుఁ గలదు. ప్రత్యయభేదంబులచేఁ ద్విరూపంబులలోఁ గొంచెమర్థభేదంబునుగలదు. ఉక్కివుఁడు = కపటముగలవాఁడు. ఉక్కీఁడు = మూర్ఖుఁడు. ఉ॥ ఉ। క్కీలయి నేర్పులేక తమకించి పయింబడినొవ్వు వారు' నిర్వ-3ఆ. ఉ॥ ఉక్కివుఁడై నీకొడుకు నల్లమునిన్నిటు లాడఁగూడునే (భార- ఉద్యో-2 ఆ. ఉ॥ ఉక్కివులెందునుం గలరె యొప్పరువోఁ ధృతరాష్ట్రనందనుల్' భార- ఉద్యో-4ఆ.

16 సూ—ఈప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునందగు.

మొక్కలీఁడు - కల్లరీఁడు

వ్యా—'ఈ' ప్రత్యయంబు కొన్ని శబ్దంబులకుఁ బ్రాతిపదికార్థంబునందువచ్చును. ఉ. మొక్కలీఁడు. 'మొక్కలి' అను ప్రాతిపదికార్థంబుకంటె స్వార్థంబునందు 'ఈ' ప్రత్యయంబుగల్గి యపదాదిస్వరనిత్యసంధియు, డుక్ వర్ణకంబును, గలిగి 'మొక్కలీఁడు' అయ్యె. 'మొక్కలి (శూరుఁడు), అనియే యర్థము. ఇట్లే కల్లరీఁడు. (అసత్యవచనుఁడు) కల్లరికాఁడనియు రూపంబుగలదు.

17 సూ—అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు.

జాలరి - ఒఱపరి॥ జాల - ఒఱపు - కల్ల - చదువు-జూదము- టక్కు - తగవు - తీరుపు - తెంపు - తెరువు - నేరుపు - మతకము- వెరపు - వేఁట - సిగ్గు - సుంకము - ఇత్యాదులు.

వ్యా—'అరి' ప్రత్యయంబు 'కలవాఁడు, కలది' అనునర్థంబున 'జాల' మొదలగుశబ్దంబులకుఁ గలుగును. ఉ. జాలరి, వలగలవాఁడని యర్థము. అనఁగాఁ బల్లెవాఁడని భావము. జాలకాఁడనియు రూపంబుగలదు. 'ఒఱపరి (ఒఱపు + అరి) సౌందర్యవం

తుఁడు. ఇట్లే కల్ల, చగువు, జూదము, టక్కు, తగవు, తీరుపు, తెంపు, తెరువు, నేరుపు, మతకము, వెరవు, వేఁటు, సిగ్గు, సుంకము ఇత్యాదులందు గ్రహింపవలెను., జూదము, మతకము, సుంకము, ఈశబ్దంబులపై నరివర్ణకంబు ప్రయోగించినప్పుడు వృత్తి మూలకమైనమువర్ణకలోపంబుగలిగి యపదాదిస్వరనిత్యసంధిచే ఁజూదరి, మతకరి, (మాయావి) సుంకరి (సుంకముతీయునతఁడు), ఇట్లు రూపంబులేర్పడు. అప్పకవి సీ॥ ఇద్దఱు పడఁతులుఁ బెదఱికంబున గద్దఱి యద్దిఱికమ్మైగుజను, అని ఱకారసీసమాలికలో గద్దఱి, శబ్దంబు శకటరేఫయుక్తంబనివచించెను. ఁగద్దె (ఉన్నతపీఠము + అరి,) ఇట్లుండ నప దాదిస్వరనిత్యసంధిచే ఁగద్దరి, అయినదనియు, ఉన్నతపీఠము గలాఁడని వాచ్యార్థంబైనను దిట్టతనముగలవాఁడని లాక్షణికార్థంబునందు నియ్యది క్రమంబుగాఁ బ్రయోగింపఁబడుచున్నదనియు, కొందఱులాక్షణికులమతంబు. ఁగద్దరికాఁడు, అనియు రూపంబు గలదు. ఁకా, ప్రత్యయంబు స్వార్థంబునందయ్యెడిని.

(18) సూ—ఇవర్ణకంబోయారాదులకు మతుబర్థంబునందగు.

ఓయారి - అక్కసి। ఓయారము - అక్కసము - కడలు - చాగము - జోగము - తమకము - తుటారము - బండారము - బిత్తరము - బిటారము - బేహారము - మచ్చరము - మిటారము - విన్నాణము - వెక్కసము — ఇత్యాదులు.

వ్యా—ఁఓయారము, మొదలైనవానికి ఁకలవాఁడు కలది, అనునర్థంబునందు ఁఇ, ప్రత్యయంబువచ్చును. ఉ. ఓయారి. (ఓయారము + ఇ) వృత్తిగావున మువర్ణకలోపంబు. 'అక్కసి (అక్కసము + ఇ)' మువర్ణకలోపంబు. ఇట్లే, ఁకడలు (కడలి) చాగము, జోగము, తమకము, తుటారము, బండారము, బిత్తరము, బిటారము, బేహారము, మచ్చరము, మిటారము, విన్నాణముఁ వెక్కసము, ఇత్యాదులం దూహించునది.

(19) సూ—తవర్ణకంబు కులవాచకంబునకుస్త్రీవాచ్యం బగు

నపుడు మతుబర్థంబునందగు.

కొఱవత - చాకిత ॥ కొఱవ - చాకి - బోయ - వాని - వ్రే-సాలె - ఇత్యాదులు కులవాచకంబులు.

వ్యా—త, ప్రత్యయంబులను విశేషణంబును జెప్పుశబ్దంబునను స్త్రీవాచ్యంబగునప్పుడు 'కలది' అనునర్థంబునందు వచ్చును. ఉ. కొఱవత. 'కొఱవ' అనఁగా నొకానొకహీనజాతి. అట్టిజాతిగలది యను నర్థంబునందు 'కొఱవత (కొఱవది)' అగును. 'చాకిత = రజకస్త్రీ (చాకి + త) ఇట్లే 'బోయ, వాని, వ్రే, సాలె, కుమ్మరి, గొల్ల, మాల, ఇత్యాదికులవాచకంబులందు గ్రహింపునది.

20 సూ—తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడి.

చెంచెత - మాలెత.

వ్యా—'త' ప్రత్యయంబు పరంబగునపుడు కొన్నిచోటులఁ బ్రాతిపదికంబు తుద 'ఎ' కారంబు గానంబడు. ఉ. చెంచెత (చెంచు + ఎ + త) చెంచుజాతిస్త్రీ. ఇట్లే మాలెత. (చండాలస్త్రీ) చెంచితయను రూపంబును గొందఱుమతంబునఁ గలదు. క॥ చెంచితలం బింఛపత్రచేలాంచితలన్ (భాగ-స్కం-10-పూ. సీ॥ చెంచునింటికి బోయి చెంచెతకుఁ బ్రియంబు, కాశీ-5 ఆ. క॥ తోఁపియక విప్రుఁడు మాలెతఁ। గాయజసుఖకేళిఁ గలిసి కష్టాత్ముఁడగన్ । బ్రాయశ్చిత్తము సేయక । పోయినఁ జండాలజాతిఁ బొందు నిజముగన్ (విజ్ఞా-ప్రా-కాం.

21 సూ—యువతి విటీరజస్వలలు గుబ్బెతమిండత ముట్టుతలు నాఁబడుచుండు. స్పష్టము

వ్యా— తెలుఁగునందు 'యువతి' శబ్దంబునకు 'గుబ్బెత' (యౌవనవతి), అనియు

'విట్, శబ్దంబునకు 'మిండత (విటురాలు)' అనియు, 'రజస్వలా' శబ్దంబునకు 'ముట్టుత (రజస్వలాస్త్రీ)' అనియుఁ బ్రయోగంబులు.

22 సూ—వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యంబగున పుమత్వర్థంబునందాఁడివర్ణకంబగు.

వగలాఁడి ॥ వగ -చిన్నె-కులుకు-వన్నె-దొమ్మి-ఎమ్మె ఇత్యాదులు వగాదులు.

వ్యా—బహువచనాంతంబులగు 'వగ' మొదలైనశబ్దంబులకు స్త్రీయర్థమైనపుడు 'కలది' అనునర్థంబున 'ఆఁడి' వర్ణకంబువచ్చును. ఉ. వగలాఁడి (వగలు + ఆఁడి) వగలుగలయాఁడుది యనియర్థము. ఇట్లే చిన్నె, కులుకు, వన్నె, దొమ్మి, ఎమ్మె, ఇత్యాదులం దూహించునది.

23 సూ—వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థంబాకారంబగు.

ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు ॥ వగలాఁడు-చిన్నెలాఁడు.

వ్యా—బహువచనాంతంబులగు 'వగ' మొదలైనశబ్దంబులకుఁ బుంలింగంబునందు 'కలవాఁడు' అను నర్థంబున 'ఆ' కారప్రత్యయంబువచ్చును. (సూ) ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు. వ్యా—'ఆ' ప్రత్యయాంతంబు మగాదిగణంబులోనిది కావున డుఙ్వర్ణకంబు. ఉ. వగలాఁడు(వగలు + ఆ + డు)వగలుగలవాఁడని యర్థము. ఇట్లే 'చిన్నెలాఁడు' శబ్దంబూహించునది.

24 సూ—ముక్కు-లోనగువానికిం దదభావద్యోతకంబయి మతుబర్థంబునందిఁడివర్ణకంబగు.

ముక్కిఁడి-ముక్కు-లేనివాఁడని యర్థము। ముక్కు-వాలు-వెరవు-సిగ్గు-ఇత్యాదులు ప్రయోగంబులనెఱుంగునది.

వ్యా—'ముక్కు మొదలైనశబ్దంబులకు ముక్కు మొదలైనవానిలేమిని సూచించునదియును 'లేమిగలవాఁడు, లేమిగలది' అనునర్థంబున 'ఇఁడి' ప్రత్యయంబువచ్చును. ఉ. ముక్కిఁడి (ముక్కు + ఇఁడి) ముక్కులేమిగలవాఁడనియర్థము. ఇట్లే వాలు, వెరవు, సిగ్గు' ఇత్యాదులు కవిప్రయోగంబులవలన గ్రహింపవలెను.

25 సూ—మానార్థంబగు నేకత్వంబునం బెఁడువర్ణకంబగు.

తూమెఁడు - ముంతెఁడు - ఎత్తెఁడు - వీసెఁడు - జేనెఁడు - మూరెఁడు - కుండెఁడు - గంపెఁడు.

వ్యా—పరిమాణార్థకశబ్దంబులకు నేకవచనంబున 'ఎఁడు' ప్రత్యయంబు వచ్చును. ఉ. తూమెఁడు(తూము + ఎఁడు) ఒకతూము పరిమాణంబుగలదని యర్థము. ఇట్లే ముంతెఁడు ఏత్తెఁడు వీసెఁడు, జేనెఁడు, మూరెఁడు, కుండెఁడు, గంపెఁడు, అడుగెఁడు' ఇత్యాదులందు నేకపదార్థపరిమాణంబు గ్రహింపునది. క॥ నీనుడువులకే నడుగెం। డైనను దాఁటనని సత్యమాడెను, రుక్మాం-ఆ.

26 సూ—ఎఁడువర్ణకంబుపరంబగునపుడు లివర్ణంబులోపించు.

కమికెఁడు - కొడిదెఁడు - దోసెఁడు - పిడికెఁడు - పుడిసెఁడు - సందెఁడు.

వ్యా—'ఎఁడు' ప్రత్యయంబు పరంబగునపుడు 'లి' వర్ణంబులోపించును. ఉ. కమికెఁడు [కమికిలి (వంపఁబడిన వ్రేళ్లుగలపుడిసిలి) + ఎఁడు] ఇచ్చటఁ బ్రకృతసూత్రంబున లివర్ణలోపంబును, అపదాదిస్వరనిత్యసంధియుఁ గలుగ 'కమికెఁడు' అయ్యె. ఇట్లే 'కొడిదెఁడు, (కొడిదలి + ఎఁడు దోసెఁడు (దోసిలి) పిడికెఁడు (పిడికిలి) పుడి

సీఁడు (పుడిసిలి) సందెఁడు (సందిలి,) ఇత్యాదులూహింపనగు. 'దాలి,' శబ్దంబునకు. 'ఎఁడు,' వర్ణకంబుపరంబగునపుడు లివర్ణలోపంబులేదు. ఉ. దాలెఁడు. (దాలి + ఎఁడు)

27 సూ—దఘ్నార్థంబున బంటికొలఁదులగు.

మోఁకాలిబంటి - మోఁకాలికొలఁది ॥ ఱొమ్ముబంటి - ఱొమ్ముకొలఁది,

వ్యా—దఘ్నార్థము=దఘ్నప్రత్యయార్థంబు. సంస్కృతవ్యాకరణంబున 'ప్రమాణేద్వయసచ్ దఘ్నఇ్ మాత్రచః' అను సూత్రంబునఁ బ్రమాణార్థంబునందు దఘ్నప్రత్యయము విధింపంబడియె. కనుకఁ బ్రమాణార్థంబునందు 'బంటి,' 'కొలఁది,' అనునవి యగును. ఉ. మోకాలిబంటి, మోకాలికొలఁది. (మోకాలివఱకుఁ బ్రమాణంబు గలయది) వృత్తియందు నాపవిభక్తికమైన 'ఇ,'కారంబుగల్గి 'మోకాలి,'అయ్యెను. (జానుదఘ్నము) ఇట్లే 'ఱొమ్ముబంటి,' ఱొమ్ముకొలఁది. ఇత్యాదులందూహింపనది దఘ్నార్థమందుఁ దత్సమపదంబులమీఁద సైతము 'బంటి,' ప్రత్యయంబుగానంబడియెడిని సీ॥ కటిబంటినెత్తురు కాలువల్ వలువలు దడియ నేడ్చుచుఁ జొచ్చి దాఁటిదాఁటి, రామా-8-ఆ. మఱియు మయప్రత్యయంబు తత్సమపదంబులమీఁదఁ గాక తెలుఁగుపదంబులమీఁదను బ్రాచుర్యార్థంబునఁ (అధిక్యంబున) గానంబడుచున్నది. ఆ-దీ॥ సమదవృత్తిఁ గేరిసలిపెఁ జకోరచయంబు చదలు దమమయంబుగాఁగ, నిర్వ-6 ఆ. తే॥ ప్రఘనభూమి । మెదడుప్రోవులమయమయ్యె మిక్కుటముగ, హరి-ఉ. 10 ఆ.

28 సూ—అర్థవిశేషంబులవర్ణకాంతరంబులును మహాప్రయోగంబుల నెఱుంగునది.

మంటమారి - తిండిపోతు - తాచ్ఛీల్యంబున మారిపోతువర్ణకంబులు ॥ అడప - తాంబూలకరండవాహి - మతుబర్థంబునందప్రత్యయంబు ॥

పెండ్లిము - ఊహ - పెండ్లిశబ్దంబునకు మతుబర్థంబునందము ప్రత్యయంబు ॥ ఇత్యాదులూహ్యంబులు.

వ్యా—అర్థవిశేషంబులయందు (భిన్నార్థంబులయందు) నితరమైన ప్రత్యయంబులును, మహాకవి ప్రయోగంబులయందుఁ గనిపించునని. ఉ. మంటమారి, గింజిపోతు (మూ) తాచ్ఛీల్యంబున మారిపోతు వర్ణకంబులు. వ్యా—స్వభావంబున 'మారి, పోతు, ప్రత్యయంబులుగలుగును. సీ॥ మంటమారులుగాని మహనీయబాడబుల ప్రదాతలు గానియట్టి ఘనులు' పట్ట-1 ఆ. తే॥ గీ॥ అనుచుననవింటి పెనుపంట నాడంగాని గెంటపములాడినజియు నమ్మంటమారి, వసు-4ఆ. ఇచ్చట 'మారి' వర్ణకంబు స్వభావంబును దెలుపుచున్నయది. (మూ) 'అడప-తాంబూలకరండవాహి, మతుబర్థంబునంద ప్రత్యయంబు. వ్యా—'అడప' (అడపము + అ) తాంబూలపుబరణిగలది అనఁగాఁ దాంబూలపుబరణిని వహించునది. 'అడప' అనుశబ్దంబునకు 'తాంబూలకరండవాహి' అనియర్థంబు వ్రాయుట యయుక్తమనియు, 'అడప' శబ్దంబు అడపమునందుకొని యుండు పడఁతి, యేయర్థంబుగాన 'తాంబూలకరండవాహిని' అని సూరిగారు స్త్రీలింగంబుగాఁ బ్రయోగింపవలయును గాని వాహి యనుట యుక్తంబు గాదనియుఁ గొందఱందురు 'తాంబూలకరండవాహి' అనునది స్త్రీలింగంబునను. సంస్కృతవ్యాకరణంబులో 'కర్మణ్యణ్' అనుసూత్రంబుచే ద్వితీయాంతంబుపపదంబగునుండ ధాతువుకంటె 'అణ్' ప్రత్యయంబు విధింపంబడి 'కుంభకారః (కుంభం కరోతీతి కుంభకారః), అయినట్టులె 'తాంబూలకరండం వహతీతి తాంబూలకరండవాహః' అని యణ్ ప్రత్యయాంతంబు పుల్లింగరూపంబగును. 'టిడ్ఢాణఞ్' అనుసూత్రంబున జీప్ప్రత్యయంబువచ్చి 'కుంభకార శబ్దస్త్రీలింగంబు 'కుంభకారీ' అయినట్టులు, తాంబూలకరండవాహ, శబ్దస్త్రీలింగంబు 'తాంబూలకరండవాహీ' అగును. కాఁబట్టి 'అడప' శబ్దంబు స్త్రీలింగంబనియే యూహింపనగు. పుల్లింగము 'అడపకాఁడు' అడపశబ్దంబు పుల్లింగంబులోఁగూడ నున్నట్టులు ప్రయోగంబు కానిపింపదు. స్త్రీలింగంబుగాను

ఊన్నందులకు లక్ష్యంబు గలదు చ॥ కలికివరాట రాజదప్పకపరవీడెము వెట్టెవంచనన్ । నలునడపంబు వానికి ఘనాగరవల్లిదళాంతరంబునన్ । బగితపుం దేలుమైనమునంబన్నె' నైష - 7 ఆ (మూ) పెండ్లము - ఊఢ ; పెండ్లిశబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు. ఇత్యాదులూహ్యంబులు. వ్యా — పెండ్లము = ఊఢ (వివాహముచేసికొన్న భార్య) 'పెండ్లికలది' అనునర్థంబునందు 'పెండ్లి + అ' ఇట్లుండ నపదాదిస్వర నిత్యసంధిగలిగి లోకవ్యవహారంబునం గ్లిబత్వనూలక మువర్ణకంబుచే 'పెండ్లము' అయ్యెను. సంస్కృతభాషలో 'కళత్ర' శబ్దంబువలెనే తెలుంగులో నీశబ్దంబు భాషాశైలిం జేసి నపుంసకలింగంబయ్యె. గ్రంథకర్త మూలంబునందు 'అము' ప్రత్యయమని మువర్ణకంబుగూడం దద్ధితప్రత్యయంబు లోనిదియనుట యవిచారితరమణీయంబు. (ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి' ప్రౌఢవ్యా. క॥ అనిలజనీకిట్లనిప ! ల్కను జనునే తలంప తేజికడుపునం బులి పుట్టునె యిట్టిదివ్య తేజం । బున వాండు హీనాన్వయమునం బుట్టునె ।" నెపుమా' భార-ఆది-6 ఆ. (తేజంబున వాండు=తేజముగలవాండు.)

ఇదితద్ధితపరిచ్ఛేదము.

---

# క్రియాపరిచ్ఛేదము.



క్రియలను జెప్పునట్టిభాగము క్రియాపరిచ్ఛేదంబు.

(1) సూ—ధాతువునకు.

ఇదియధికారసూత్రంబు - ఇంక నెయ్యది యుపక్రమింపంబడునయ్యది ధాతువునకగునని యెఱుంగునది.

లైనవి) 3 సంఖ్యయు (ఏకవచనము, బహువచనము) 4 కాలము (వర్తమానము, భూతము, భవిష్యత్తు, తద్ధర్మము) 5 కారకము (కర్తృకారకము మొదలైనవి) స్వకీయోరవాత్మనే పదనిమిత్తే యనుసూత్రస్థంబగు భాష్యంబునఁ గర్తృకర్మాదులు ధాత్వాము లని విశదపఱుపఁ బడినవి, ఇయ్యవి ధాతువునకే యర్థంబులు. ఈయర్థంబులను ధాతువులమీఁది లడాదిప్రత్యయంబులు సహాయంబులై ప్రకాశింపఁజేయునని (ద్యోతకములు) వైయాకరణాల సిద్ధాంతము. నేత్రేంద్రియంబునకు గోచరింపనివస్తువులరూపంబు ప్రకటింపఁజేయుటలో 'సూక్ష్మదర్శిని' యనెడి దర్పణవిశేషము(మైక్రాస్కోప్) సాధనమైనయట్టులు పైనిం జెప్పినధాత్వర్థపంచకంబును స్ఫుటీకరించుటలో లడాదిప్రత్యయంబులు సాధనంబులు కానఁ బ్రకృతంబగు వర్తమానకాలంబు ధాత్వర్థంబులోనే యంతర్భూతమైనది. దానంజేసియే వర్తమానకాలికపదార్థంబునందలి క్రియను దెలియఁజేయు ధాతువునకు లట్ప్రత్యయంబగునని తెలిసికొనవలయును. కాని, లట్ప్రత్యయంబునకు వర్తమానకాలంబు వాచ్యార్థముకాదు. వర్తమానంబనఁగా ప్రారంభింపఁబడి పరిసమాప్తి నొందనిదియని యర్థంబు. ఉ. ఘటంబున్నది. ఇచట వాక్యంబుప్రయోగించుకాలంబున ఘటంబుండుచున్నట్లు తెలియుచున్నది కావున వర్తమానకాలంబు.

(3) సూ.—భూతంబున లిట్టగు.

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు ॥ భూతంబునా విద్యమానధ్వంస ప్రతియోగి - ముందుండి యిప్పటికి లేకుండునది.

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు. భూతంబునా విద్యమాన ధ్వంసప్రతియోగి.—ముందుండి యిప్పటికి లేకుండునది.

వ్యా—భూతకాలంబునందు లిడ్వర్ణకంబుగలుగును, అనఁగా భూతకాలికంబైన వస్తువుయొక్క క్రియను దెలియఁజేయుధాతువునకు 'లిట్' ప్రత్యయంబువచ్చును. భూతకాలంబనఁగా వాక్యంబు ప్రయోగించుకాలంబునకుముందటి నాశనంబునకు ప్రతియోగియైనది. ఉ. ఘటంబుండెను. ఇచ్చట వాక్యంబు ప్రయోగించుకాలంబునకుఁ బూర్వంబునందు ఘటంబుండినట్లు తెలియుచున్నది. కాన వర్తమానకాలంబునందు

దానిధ్వంసంబు (నాశనము) ఉండుమన్నట్లు తెలియుచున్నది. అట్టిధ్వంసంబునకు విరోధి యీవఱలో గతించిన ఘటంబగును. అనఁగా ఘటంబుండిన భూతకాలంబులో దాని నాశనంబుండలేదు, కావున నాశనంబునకు ఘటంబు విరోధియయ్యెను 'రావణుండు గతించెను' అనువాక్యంబులోఁ బ్రకృతకాలంబున రావణుని నాశనము స్ఫురించుచున్నది. రావణుండుండిన గతకాలంబులో వానిలోఁ గూడ వానియభావంబుండుట యసంసర్గ్యంబు కావున వర్తమానకాలంబునందలి వాని యభావంబునకు రావణుండు విరోధియయ్యెను. కాన నిట్టిది భూతకాలంబనంబడును.

4 సూ—భావిని లృట్టగు

భావిక్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకంబగు ॥ భావినా విద్యమానప్రాగభావప్రతియోగి - అప్పటికిఁ బుట్టకుండునది॥

భావిక్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకంబగు. భావినావిద్యమానప్రాగభావప్రతియోగి—అప్పటికిఁ బుట్టకుండునది.

వ్యా—కాఁబోవునట్టి వస్తువుయొక్క- క్రియయ యందుండునట్టి(క్రియనుబోధము) ధాతువునకు లృట్ప్రత్యయంబు గలుగును. వస్తూత్పత్తికి ముందుండుచున్న యభావంబు ప్రాగభావమనంబడు. అట్టిప్రాగభావంబునకుఁ బ్రతియోగి (విరోధి)ఘ. ఘటము కాఁగలదు. ఇచ్చట ముందుజనింపఁగలిగినఘటంబుయొక్క యభావంబిప్పటి వాక్యప్రయోగకాలంబునందుండుచున్నట్లు స్ఫురించుచున్నది. ఘటముపుట్టుటతోడనే ఘటోత్పత్తికి ముంగున్న యభావము (ప్రాగభావము) నశించును. ప్రాగభావనాశనంబునకు భావిఘటంబు విరోధి. అట్టి విరోధియే ప్రతియోగియనంబడు.

5 సూ—తద్ధర్మాదులందులాట్టగు.

తద్ధర్మాదిక్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు ॥ తచ్ఛీలసంభావనా సంప్రశ్న సాతత్యవర్తమాన భావ్యాశీరాదు లాదిపదగ్రాహ్యంబులు.

తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు. తచ్ఛీల సంభావనా సంప్రశ్నసాతత్య వర్తమాన భావ్యాశీరాదులాది పదగ్రాహ్యంబులు.

వ్యా—సః ధర్మః యస్య సః తద్ధర్మః=అది (ఒకానొకటి) ధర్మంబేవస్తువునకో యట్టివస్తువు మొదలైనవానియందలి క్రియను దెలియఁజేయునట్టి ధాతువునకు లాట్ప్రత్యయంబగు, ఉ. పుష్పము పరిమళించును. పుష్పంబునకుఁ బరిమళంబు ధర్మంబు. ఇట 'పరిమళించును' అను క్రియ పుష్పమునకు స్వాభావికధర్మంబైనయట్లు దోఁచుచున్నదిగావునఁ దద్ధర్మక్రియయని గ్రహింపవలెను. తచ్ఛీల (ఒకానొక ధర్మము స్వభావముగాఁ గలిగినవస్తువు) సంభావన (ఊహ) సంప్రశ్నము (పృచ్ఛచేయుట=అడుగుట) సాతత్యము (ఎల్లప్పుడునుండుట) వర్తమానము (వాక్యప్రయోగకాలమందుండునట్టిది) భావి (వాక్యప్రయోగకాలంబునకుఁ దరువాత రాఁబోవునది) ఆశీస్సు (దీవన) మొదలైనవి సూత్రంబులోని 'తద్ధర్మాది' శబ్దంబునందలి 'ఆది' శబ్దంబుచే సంగ్రహింపఁబడినవి.

(6) సూ—ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టగు.

ఆశీరాదులందుధాతువునకులూడ్వర్ణకంబగు.

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

వ్యా—ఆశీరర్థము (దీవన) శాపము (తిట్టు) సంప్రార్థన (వేఁడుట) విధి (ప్రేరణము=భృత్యుఁడు మొదలైనవానిని బ్రవర్తింపఁజేయుట) ఈయర్థంబులయందు లూట్ప్రత్యయంబు గలుగును.

(7) సూ—వ్యతిరేకంబునలజీయగు.

వ్యతిరేక విశిష్టక్రియావృత్తియగు ధాతువునకు లజీవర్ణకంబగు.

వ్యతిరేకవిశిష్టక్రియావృత్తి యగుధాతువునకు లజీవర్ణకంబగు.

అంపపింపుగలము. అంపపింపుగలరు. ఉన్నాను బహువచనమునకుదాహరణంబు. మేఘము వర్షింపుచున్నది. మేఘములు వర్షింపుచున్నవి.

13 సూ—ఉదంతంబులకు లృట్పరంబగునపుడు ఉన్నానుబంధంబగు

ఉదంతంబులగు ధాతువులకు లృట్పరంబగునపుడు - ఉన్న - అనుశబ్దంబు ప్రయుక్తంబగు.

ఉదంతంబైన ధాతువులకు లృట్పరంబగునపుడు 'ఉన్న' అనుశబ్దంబు ప్రయుక్తంబగు.

వ్యా—ఉకారంబు అంతంబునందుఁ గల ధాతువులకు లృట్పరంబగునపుడు 'ఉన్న' అనునది. ముఖ్యధాతువు ననుసరించి వహార్యంబగు.

14 సూ—ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకంబగు.

వ్యా—'ఉన్న' శబ్దంబు పరంబగునపుడు 'చు' ప్రత్యయంబు వచ్చును.

15 సూ—దివీతరంబగుపుష్టు పరంబగునపుడు ఉన్నానుబంధంబునకు దీర్ఘంబగు.

ప్రథమము - వాఁడువండుచున్నాఁడు - వారువండుచున్నారు - అదివండుచున్నది - అవివండుచున్నవి ॥ మధ్యమము - నీవువండుచున్నావు - మీరువండుచున్నారు ॥ ఉత్తమము - నేనువండుచున్నాను - మేమువండుచున్నాము.

వ్యా—ది-వి అను ప్రత్యయంబులుగాక 'డు రు-వు-రు-ను-ము' అనునవి పరంబగునపుడు 'ఉన్న' అను సహాయక్రియకు దీర్ఘంబు గలుగును. ('డున్దు' అనఁగా డువర్ణకంబును ముష్టుయొక్క ఉకారంబుతోఁ జేర్చి పలుకఁగానైన రూపంబు. ఇట్టిది

(ప్రత్యాహారమనంబడును) వర్తమానకాలిక క్రియావృత్తియైన ఁ వండు, ధాతువునకం బెం ట్రప్రత్యయంబు. దీనికి సెనిమిదవసూత్రంబుచేఁ బ్రథమపురుషైకవచనంబు వివక్షింపంబడి నప్పుడు ఁడుఙ్, వచ్చును. (వండు + డు) వండుధాతువుదంతంబుగావునఁ బదు మూఁడవసూత్రంబుచే నున్నానుబంధంబగు. (వండు + ఉన్న + డు) పదునాల్గవ సూత్రంబున మువర్ణకంబగు. (వండు + ము + ఉన్న + డు) పదునేనవసూత్రంబుచే ఁఉన్న, అనుదానికి దీర్ఘంబగు (వండు + ము + ఉన్నా + డు) డుఙ్ఞిత్తుగావున బిందు పూర్వకంబగు. వాఁడు వండుచున్నాఁడు. బహు -వారు వండుచున్నారు. దీనికి ప్ర క్రియ యేకవచనంబున కిచ్చినయుదాహరణంబునందుంబలెనూహింపునది. ఁఅది వండు చున్నది. అవి వండుచున్నవి, ఇచ్చట ఁది-వి, వర్ణకంబులుపరంబైనందున నీపదునేనవ సూత్రంబునను న్నానుబంధంబునకు దీర్ఘంబు నిషేధింపంబడినది. ఁనీవు వండుచున్నావు మీరు వండుచున్నారు, యుష్మచ్ఛబ్దార్థంబునందు నేకవచనబహువచన సమావేశం బులలో మధ్యమపురుషమైనందుల కుదాహరణంబులు. ఁనేను వండుచున్నాను. మేము వండుచున్నాము, అస్మచ్ఛబ్దార్థంబునఁదు నేకవచనబహువచనంబులు కర్తలు గాన నుత్తమపురుషంబు.

16 సూ—లిడ్లోట్టుల డుఙ్ఞునకెను నువర్ణంబులగు.

లిడాదేశంబగు డుఙ్ఞునకు - ఎను - అనునది లడాదేశంబగు డుఙ్ఞునకు - ను - అనునద నాదేశంబులగు.

లిడాదేశంబగు డుట్టునకు 'ఎను' అనునదియు, లాడాదేశంబగు డుఙ్ఞునకు 'ను' అనునదియు నాదేశంబలగు.

వ్యా—స్పష్టము. భూతంబున 'ఎను' వర్ణకంబు నెత్వంబున కత్వంబు కొంచో కచోఁ గానంబడియెడి. శా॥ అయ్యో నీసుతుఁగ్రద్దతన్నుగొని పోయెన్ భీతివాపోవఁ గన్' పంచ - 1ఆ (వేంకటనాథకవి) మ॥ అని శాపావధిఁజెప్ప మున్గఁడుఁను పోయెన్ బో ఎ నాలోన' పంచ- 4 ఆ. శా॥ అయ్యన్నాలవజాము చొచ్చెఁ దడవాయన్ వచ్చి విచ్చేయు' పంచ-4 ఆ ఇయ్యవి ప్రామాదికంబులు.

21 సూ — కలాజీడుమజులు పరంబులగునపుడు నగాగమంబగు.

ద్రుతకార్యంబు ॥ ప్ర- వండఁగలఁడు - వండఁగలరు - వండఁగలదు - వండఁగలవు ॥ మ - వండఁగలవు - వండఁగలరు ॥ ఉ-వండఁగలను - వండఁగలము.

ద్రుతకార్యంబు ప్ర॥ వండఁగలఁడు - వండఁగలరు. వండఁగలదు-వండఁగలవు, మ॥ వండఁగలవు - వండఁగలరు ఉ॥ వండఁగలను - వండఁగలము.

వ్యా— కలజీ-మజీ, అనునవిపరంబగునపుడు ధాతువునకు నగాగమంబు వచ్చును. ద్రుతకార్యంబనఁగా ద్రుతప్రకృతికంబునుబట్టివచ్చు సరళాదికార్యంబులు మూలంబునందలి యుదాహరణంబులయందుఁ బైసూత్రంబులోని వండఁగలఁడు, అను రూపంబునొద్దఁ గనఁబరిచిన సూత్రప్రక్రియయే తక్కిన పురుషంబులయందును నూహించుకొనునది.

22 సూ— లాట్టుఙుఙ్షు పరంబగునపుడు దుగాగమంబగు.

ప్ర - వండును - వండుదురు॥ మ - వండుదువు వండుదురు ఉ - వండుదును - వండుదుము ॥ లాడర్థంబులయందోలి నుదాహరణంబులు వక్కాణించెద ॥ తద్ధర్మంబు - కులాలుఁడుకుండలువానును ॥ తచ్ఛీలంబు - జ్వాలనజ్వాలంబు లుష్ణగంబెగయును॥ సంభావన- ఇప్పుడు వాఁడింటనుండును ॥ సంప్రశ్నము - ఉందునాపోదునా ॥ సాతత్యము - సర్వంబునం దీశ్వరుఁడుండును - సర్వంబీశ్వరునియందుండును ॥వర్తమానంబు - మేననిప్పుడుంబులకలు వొడమెడును - వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునందెడు గాద్యాగమంబులగు ॥ భావి- వాఁడుతేపువచ్చును ॥ ఆశీస్సు - శుభంబగును ॥ వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెను.

15/6

ప్ర- వండును - వండుదురు. మ- వండుదువు - వండుదురు. ఉ- వండుదును - వండుదుము. తాదర్థ్యంబులయందలి యుదాహరణంబులు వక్కాణించెద. తద్ధర్మ్యంబు — కులాలుండు కుండలువానును. తచ్ఛీలంబు - జ్వలనజ్వాలంబులుప్పరం బెగయును. సంభావన - ఇప్పుడు వాఁడింటనుండును. సంప్రశ్నము — ఉండునా పోదునా. సాతత్యము- సర్వంబునందీశ్వరుఁడుండును ; సర్వంబీశ్వరునియందుండును. వర్తమానంబు - శేసన నిప్పుడుంబులకలపొడమెడును. వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడుగాద్యాగమంబులగు. భావి - వాఁడు రేపువచ్చును. ఆశీస్సు - శుభంబగును, పర్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టుగానంబడియెను.

వ్యా— ప్రథమపురుషైకవచనవర్ణ్యం వర్ణకంబునక్కఁ దక్కినవి (రు, వు, రు, ను, ము,) పరంబగునప్పుడు ధాతువునకు దుగాగమంబు గలుగును. వండు + లాట్ ఇట్లుండఁ బ్రథమపురుషైకవచనంబుగావున నెనిమిదవసూత్రంబుచే డుబ్వర్ణకంబు రాఁగా వండు + డు, అనియుండఁ బదునాఱవసూత్రంబుచే డుజునకు నువర్ణాదేశంబై వండును, అయ్యెను. దుగాగమంబు విధించు ప్రకృతసూత్రంబులో డుజుపరిహరింపఁబడినందున దుగాగమంబు రాలేదు. వండుదురు, ఇట వండు + లాట్ ఇట్లుండఁ బ్రథమపురుషబహువచనంబు గావున రువర్ణకంబు లకారంబునకు నాదేశంబై ప్రకృతసూత్రంబున ధాతువునకు దుగాగమంబు గలిగి పైరూపంబు సిద్ధించె. ఇట్లే మధ్యమోత్తమపురుషంబులయందు సూత్రప్రక్రియ యూహింపనది. లాట్ప్రత్యయంబున కర్థంబులైన తద్ధర్మ్యతచ్ఛీలాదులకు నుదాహరణంబుల కర్థవివరణంబునరుసగా నీయఁబడును. తద్ధర్మ్యంబు — కులాలునకుఁ గుండలువానుట కులధర్మంబు. తచ్ఛీలంబు - అగ్నిజ్వాలలూర్ధ్వముఖంబులగుట సహజము. సంభావన - ఊహ. వాఁడు గృహమందుండుట నిశ్చయింప శక్యంబుకానిది. సంప్రశ్నము - అడుగుట. సాతత్యము - సతతంబు నుండుట. ఈశ్వరుండెల్లప్పుడును సర్వజగంబును విడనాడక యుండునని యర్థంబు తోఁచుచున్నది. వర్తమానంబు - ఒడలు గగురుపొడుచుచున్నదని యర్థము. క్రిందను జెప్పఁబోయెడి యిరువదిమూఁడవసూత్రంబుచే ఎడు, గాగమంబును, ఎడిగాగమంబును, తఱుచు వర్తమానకాలంబునందగును. భావి- భవిష్యత్కాలము. వచ్చును= రాఁగలఁడని యర్థము అశీస్సు - దీవన. ఆశీస్సునందు అయ్యెడును, అగుత౯, అనియు నిరువదియాఱవ

సూత్రించుచే నుండఁదగును. సీ॥ తే॥ అపరజనకార్థిసీమ రామాభిధాన | హారికహీన గుణాశ్రితహారశరాశి | గిరిమథనయత్నమున దోఁచు సిరియ శేష | రాజ్యము లొసంగఁదిరుమల రాయమణికి' వసు.-1 ఆ వ॥ స | ర్వకలాకాంతుఁడు ప్రోచు దిర్మలవహారాయక్షమావల్లభుఁడ్, వసు - 1 - ఆ. సీ॥ తే॥ ప్రథనజయమిచ్చెఁ దిరుమలరాయమణికి, వసు 1 ఆ. శా॥ సా॥ ఖ్యాయూఢిఁ విలసిల్లువేఁకటనగాధ్యక్షుండురక్షించు గో॥ బ్యాని తిమ్మనృపాలసింహు నరసింహోర్వీశ చూడామణిన్, రామా-1ఆ. ఉ॥ సా॥ పెసఁగెడు పుల్లరాయఁడు జయోన్నతులిచ్చె నృసింహశౌరికిన్ రామా-1ఆ. మ॥ ఎలమిన్నిత్యముఁ బ్రోచుఁగృష్ణవసుధాధీశుఁడ్ నృసింహాత్మజున్' కళా-1ఆ. ఇచధాతువునకు నర్థంబులైన 'అను, పలుకు, వాక్రుచ్చు, చెప్పు, ఇత్యాదులకు భూతకాలంబున నొకానొకప్పుడు లాట్ప్రత్యయంబు ప్రయోగంబులఁ గానంబడియెడి. తే॥ గీ॥ సర్వతీర్థాభిగమనంబు సర్వవేద | సమధిగమము సత్యంబుతో సమము గావు| ఎఱుఁగుమెల్లధర్మములకు నెందుఁ జెప్ప| యండ్రుసత్యంబు ధర్మజ్ఞులైన మునులు' భార- ఆది. 4ఆ. క॥ మౌనమున దృఢజ్ఞానము | దానంబున నభ్యుదయము ధర్మనిరతయా| శానిగ్రహణంబున నర| కానీకాహరణ సౌఖ్యమగునండ్రుబుధుల్' భార-శాంతి-6, తే॥ సత్యభోగకంబెఁ బ్రశస్తమైన| కృత్యమరయంగ లేదండ్రునిత్యవస్తు| సమ్యగధిగమసిద్ధికి సంయమప్రసిద్ధులాగమతంత్రప్రసిద్ధులార' భార- అశ్వ- 2ఆ. తే॥ వినుమనేకవిధంబుల విస్తరిల్లు | ధర్మములయందొకండునుఁబలఁప నిష్ఫలంబు లేదాత్మమోక్షఫలంబైన | ధర్మముత్తమమండ్రు తత్త్వజ్ఞుఁడధిప' భార- శాంతి - 4ఆ. క॥ ఋతుమతివై పుత్రార్థము | పతిఁగోరిన భార్యయందుఁ బ్రతికూలుండై | ఋతువిఫలత్వము సేసిన| నతనికి మఱిభ్రూణహత్య యగునండ్రు బుధుల్'భార-ఆది-3ఆ. తే॥ గీ॥ పౌరుషంబుచూపె ఫలమండ్రుకొందఱు | ట్లనక దైవమిచ్చునండ్రు కార్య| ఫలము'భార. పై నుదాహరింపఁబడిన 'అండ్రు' ఇత్యాదిలాట్ప్రత్యయాంతంబులకు 'అనిరి' అని భూతకాలమర్థము.

23 సూ—లాట్టు రుణ్ణుపరంబగునప్పుడెద గాగమంబును బ్రథమనుపర్ణకంబు పరంబగునప్పుడెదు గెడాగమంబులును బహుళంబుగానగు.

ప్ర - వండెదును - వండెడిని - వండెదరు ॥ మ - వండెదవు - వండెదరు ॥ ఉ - వండెదను - వండెదము.

వ్యా—తద్ధర్మార్థంబులయందుఁ బ్రథమపురుషైకవచనంబైన డుఙ్ఙు తప్ప 'రు, వు, రు, ను, ము, అనునవి పరంబగునప్పుడు ధాతువునకు ఎదు గాగమంబును, ప్రథమపురుషనువర్ణకంబు పరంబగునపుడు ధాతువునకు ఎడి గాగమంబును, ఎదు గాగమంబును దఱచుగ గలుగును. 'వండు + లాట్, ఇట్లుండ నెనిమిదవసూత్రంబుచే డుఙ్ఙును, పదునాఱవసూత్రంబుచే దానికి నువర్ణకంబును రాఁగా 'వండు + ను, అని యుండె. ప్రకృతసూత్రంబుచే నువర్ణకంబునకు ముందు ఎదుగాగమంబును, ఎడిగాగమంబును ధాతువునకుఁ గలుగఁగా వండు + ఎదు + ను—వండు + ఎడి + ను, అని యుండె. ఈ యాగమంబులు కిత్తులుగావున ధాతువునకుఁ దుదనుజేరె. అపదాదిస్వరనిత్యసంధిచే వండెదును—వండెడిని, (ఇచ్చట 'ఇకారంబుమీఁదినను వు క్రియా, అను తత్సమపరిచ్ఛేదంబునందలి యిరువదియాఱవసూత్రంబుచే నువర్ణకంబున కిత్వంబు) అనురూపంబులాయెను వండెదరు, వండు + లాట్, అనియుండ నెనిమిదవసూత్రంబుచే రువర్ణకంబు గలిగి ప్రకృతసూత్రంబున నెద గాగమంబురా నీరూపంబయ్యె. ఇట్లే మ-వండెదవు. వండెదరు. ఉ- వండెదను, వండెదము, ఇత్యాదిరూపంబులయందును నూహించునది.

24 సూ.—లిఙ్లోట్లు లవకారంబునకు లోపంబు విభాషనగు.

వండితి - వండితివి ॥ వండుదు వండుదువు ॥ వండెదవు - వండెను.

వ్యా—భూతక్రియయొక్కయు, తద్ధర్మక్రియలయొక్కయుఁ బ్రత్యయవకారంబునకు లోపంబు వైకల్పికంబుగా నగును. భూతంబునకు — వండితి, వండితివి. ఇట్లుండఁ బ్రకృతసూత్రంబునఁ బాక్షికవకారలోపంబురాఁగా వండితి + ఇ' అని యుండె. అపదాదిస్వరనిత్యసంధిచే వండితి, అయ్యె వండుదు, (వండుదువు) వండెను (వండెదవు), ఇత్యాదులందుఁ బైఁగానింబలె నూహించుకొనవలయును సీ॥ ఇభరాజగమన నీపెంపుల కరిగితత్తుకుచాభోగయుండున్న దాన । వబల యెవ్వరి చేత

మొగ్గ దిగంతరంబుల! త్రుటిపడరెక్ మరుత్సుతుఁడు దర్పమెలర్పనహార్య ముద్ధతిం బెటుకఁగ గోత్రశైలములు పెల్లడరెక్ గలగెంబయోధులుక్, భాస్క-యు-కాం.

26 సూ—లూట్టుమణ్ణున కెడు తవర్ణంబులు ద్రుంతాంతంబులగు.

ఆశీస్సు - మీకు మేలుగలిగెడును - మీకు మేలుగలుగుతను ॥ శాపంబు - నీకు రాక్షసత్వంబుగలిగెడును - నీకు రాక్షసత్వంబుగలుగుతను ॥ సంప్రార్థనంబు - హరి నన్నుఁ గృపఁగాంచెడును - హరి నన్నుఁ గృపఁగాంచుతను.

వ్యా—ఆశీస్సు, శాపము, సంప్రార్థనము, విధి, వీనియందలి దుణ్ణునకు నకారంబంతమందుఁ గల, ఎడు, త, వర్ణంబులగును. ఆశీస్సు. మేలనుభవించువానికి నిష్టంబు గావునఁ బైరెండు వాక్యంబులును, ఆశీర్వాదార్థంబునందు, ఎడు, త, వర్ణంబులు వచ్చినందులకుదాహరణంబులు. శాపము-ఇచ్చట రాక్షసత్వం బనుభవించువానికి ననిష్టంబు గావున నా రెండు వాక్యంబులును శాపార్థంబునందు, ఎడు, త, వర్ణంబులు గలిగినందులకుదాహరణంబులు. సంప్రార్థనము—ఇచ్చట హరి తన్ను రక్షింపవలెనని ప్రార్థించువాఁడు కావున నట్టి యర్థంబునందుఁ బై ప్రత్యయంబులని యెఱుంగునది. శాపంబునకు- క॥ పతి హీనలైన భామిను ! లతిపనవతులయ్యుఁ గులజలయ్యును ననలంకృతలయ్యెడు మాంగల్యరహితలయ్యెదుఁ గృపణావృత్తి నిదియు మొదలుగాక్, భారత ఆది. 4 ఆ. ఆశీస్సునకు—ఉ॥ వారిజవైరికులేశ నీకు సం । పూర్ణమనోరథంబు రాను బుధ్యనంబులు నిచ్చుచుండెడిక్' భారతము.

27 సూ—విధియందు లూట్టునకు మాఱుగానది యనుతచ్ఛబ్దంబును ముందు నుగాగమంబునునగు.

మైత్రుండు నానిర్దిష్ట కార్యంబుచేయునది - వానికి నీవు బొసటయ యియ్యుఁడునది.

వ్యా—విధ్యర్థకంబునందు (తనకు లోనైనభృత్యాదులను గార్యమందుఁ బ్రవర్తింపఁ జేయుటవిధి) లోట్టునకు బదులు 'అది' అను శబ్దంబును, దానికి ముందు ధాతువునకు 'ను' గాగమంబును, గలుగును, ఉ. మైత్రుండు నానిర్దిష్ట కార్యంబుచేయునది. మైత్రుండు నానిరూపించిన కార్యంబు చేయుటవిధియని యర్థము. ఇచ్చట మైత్రునిఁ గార్యంబునందుఁ బ్రవర్తింపఁజేయుట స్ఫురించుచున్నది. 'చేయు + లోట్' అనియుండఁ బ్రకృతసూత్రంబుచే 'అది' శబ్దంబును, ధాతువునకు నుగాగమంబును నయ్యెను. నుక్కు—కిత్తు కావున 'చేయు' ధాతువు చివరను జేరి 'చేయునది' అను రూపంబయ్యెను. వానికి నీవు దాసుఁడవయియుండునది. ఇచ్చట నీవు దాసుఁడవయి యుండుమని యర్థము. ఇచ్చట 'ఉండునది' అనునది ముఖ్యవిధ్యర్థంబును దెలియఁ జేయుచున్నది. ఇరువదితొమ్మిదవసూత్రంబున దాసుఁడవయియుండుమనియుఁ జెప్పనొప్పును.

28 సూ—ఎడు, తల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారంబగు.

నీకు మేలుగలిగెడు మనియెను - నీకు మేలుగలుగుత మనియెను.

వ్యా—'ఎడు, త' అనువాని ద్రుతంబునకు నచ్చుపరంబగునపుడు మకారంబు గలుగును. ఉ. నీకు మేలుగలిగెడు మనియెను; నీకు మేలుగలుగుత మనియెను. ఇచ్చట సంధిదశయందు 'ఎడు, త' వర్ణంబులు మకారాంతంబులయ్యెను విభాగావస్థయందు 'కలిగెడున్ + అనియెను; కలుగుతన్ + అనియెను' అని నకారాంతంబులుగాఁ జెప్పవలెను.

29 సూ—లోణ్మధ్యమపురుషలకు ముండుబులగు.

ఆశీస్సు - దీర్ఘాయువగుము - దీర్ఘాయువులరగుఁడు ॥ శాపంబు-రాక్షసుండవగుము - రాక్షసులరగుఁడు ॥ సంప్రార్థనంబు - నన్ను రక్షింపుము - నన్ను రక్షింపుఁడు ॥ విధి - నాచెప్పిన పనిచేయుము - నా చెప్పిన పనిచేయుఁడు.

వ్యా—'ఆశీస్సు, శాపము, సంప్రార్థనంబు, విధి' ఈయర్థంబులయందు లూాన్నాన్వ మపురుషంబుయొక్క-యేకవచనబహువచనంబులకు (వువర్ణక రువర్ణకంబులకు) క్రమంబుగా మువర్ణకడుజ్వర్ణకంబులగు. ఆశీస్సు-'దీర్ఘాయువగుము' ఇటఁగారకపరిచ్ఛేదంబులోని ముప్పదియాఁడు ముప్పదినాల్గుసూత్రంబులచే 'దీర్ఘాయువవు' అనుట యాశీర్వ్యకంబైనను నిచ్చటిరూపంబు పూర్వోక్తసూత్రంబులోని ప్రాయిక గ్రహణంబుచే రక్షితంబయ్యె. 'అగుము, కమ్ము, అవుము, ఔము' అని యేకవచనంబునందును, 'అగుఁడు, కండు, అవుఁడు, ఔఁడు' అని బహువచనంబునందును రూపాంతరంబులు. తొంబదియాఱవసూత్రంబునొద్దఁ జూచుకొనునది. 'దీర్ఘాయులరగుఁడు' బహువచనము. దీర్ఘాయులఁగుకండని యర్థమ్మగు.' శాపసంప్రార్థనవిధులందు నిట్లే గ్రహించుకొనునది. విధ్యర్థంబునందు లూట్టుయొక్క- పురుషత్రయంబునంగూను, ఇరువదియేడవసూత్రంబుచే 'అది' శబ్దంబు విధింపంబడి యుదాహృతమైన 'నీవుబాసటయయియుండునది' ఇత్యాదికమైనమధ్యమపురుషాదివాక్యంబు ప్రకృతసూత్రంబున 'నీవు బాసటయయియుండుము' అని పక్షంబున నిర్వాహంబుగానుండునట్లు లూట్టుయొక్క- పురుషత్రయంబునందును విధ్యర్థంబునంగాక తక్కిన యాశీశ్శాపసంప్రార్థనంబులయందు 'ఎడు, త' వర్ణంబులు, ఇరువదియాఱవసూత్రంబుచే విధింపంబడఁగా 'నీవు దీర్ఘాయువయ్యెడు, నీవుదీర్ఘాయువగుత, ఇత్యాదికమైనరూపంబులును, ప్రకృతసూత్రంబునఁ బర్యాయంబుగా మువర్ణకడుజ్వర్ణకాంతరూపంబులును, ఆశీరాద్యర్థంబులయందు నగునని తెలిసికొనునది. ఈ సూత్రంబు, ఇరువదియాఱు ఇరువదియేడు సూత్రంబులకు బాధకంబుగాదని యెఱుంగునది. కేవలతుమున్నంతంబుచేతను సైతము శాపార్థము తెలుపంబడు. అన్వయక్రమంబుచేఁ గ్రియావాచకంబు వాక్యాంతంబునందే యుండవలసినది. కావున శాపక్రియాబోధకంబైన తుమున్నంతంబుకూడ వాక్యాంతంబునందే ప్రయోగింపవలెను. చ॥ శశమునిదిక్కునంబోవమి సర్పముఖంబులమైలువెళ్లిని। త్యమును బలాశసంగతులు దప్పక త్రిమ్మరునట్టి నాలిభూ। తమ ! పవమాన ! నీకుఁగలదా। మఱిభూతదయార్ద్రబుద్ధి? యుక్తమకదనీవుఁ గొమ్మలనపల్చుట నీవడి ధూళిపాలుగాక్, కవి-2 ఆ. 'పవనుఁడానిను బెద్దపాముగఁ-వ, తే॥ గీ. నీకజారాతివిసుఁ దనసెలవుగూాల సేలసృజియించె విధిసృజియించుఁగాక। యేలజైవాతృకునిఁజేసె నేలతప్పుఁ। బుడమి

బాపిచిరాయునకుఁ బెడఁగుసుమగు, వసు - 4 ఆ. తే॥ గీ. అలఘుగుణకాండ ! బహుసిరి గలిగినట్టి | దొరకొమరునందుఁ బొగడువఁ బ్రుల్లిపడుచుఁ | జెంగటులంగడ మునుగలఁ దెరువరులను | బూనియేతువె నీపూనిక్కబుగ్గిగాను, నీలా-3 ఆ. క॥ సారసాక్షిరొంబునఁ బలుమాఱు| విరిఁబోఁడులనెల్ల మిసలవెలవెట్టుదునీ| దొరతనము ద్రుంగిపోవను! మరుఁడా నీ చేతివిల్లు మంటంగలయక్, నీలా-3 ఆ. చ॥ బలితపుటాముసందమిడుచుఁ బొట్టఁగఁ గైకొని యొజ్జముద్దియక్ | గలిసినదోసకారితని కాదె నినుంగని తమ్మికొమ్మ నీ| వ్యాళుతల వంచుచుండునది చాలదొకూఱడి నీకునెంతకుఁ| జలవలజేసి నీసపుఁగుసన్నము గానిఁక నిందురాకుమీ, నీలా-3 ఆ. క॥ జతలేనిపూవుగల్గుట| కతిసలపైఁ జెల్లురేఁగి యలజడి మీఱక్| వెతపెట్టుదురేయిఁక నీ| బ్రతుకుబయల్గాను నాశపయ్యకశాట్ట్వా, నీలా- 3 ఆ. తే॥ గీ. మున్నుకొన్నాళ్లు పలుగాకి మూఁకలోనఁ ॥ గలిసిమెలఁగిన తెఱఁగెల్లఁగాని పింపఁ| జేడియలమీఁదఁ గ్రుడ్డెఱ్ఱసేయరాదు |కోయిలా యింక నీయిల్లకూలిపోను, నీలా-3 ఆ. తే॥ గీ. తలిరుఁబోఁడుల దెందముల్దల్లడిల్లఁ| గూఁకటిదుకొంచు నెంతయుఁగొంతలేక| యాగడంబునఁ బరివిచ్చిగాఁడ జేమి|యక్కటా నెమ్మినీ మాట యడఁపఁగలియా. నీలా -3 ఆ. క॥ నెమ్మిచెఁబలుమాఱు మోఁదుదుమఁ !గమ్మనిపూఁదేనెలాని కడుఁగ్రొవ్వియహా | కొమ్మలఁగలఁపఁగ ఁజూచెదు | తుమ్మెద నీప్రజ్ఞపెద్దపుష్పలు పట్టక్, నీలా-3 ఆ.

30 సూ—ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు. మనమువందుదము.

జీత్తాపరంబగునపు డుత్వంబున కత్వంబగు నను సూత్రముచే లజీపరంబగు నపుడత్వంబు ॥ ప్ర - వండఁడు - వండరు - వండదు - వండవు ॥ మ - వండవు - వండరు ॥ ఉ - వండను - వండము.

వ్యా—నీవును నేనును (మనము) కర్తలైనపుడు, ఇరువదిరెండవసూత్రంబుచే గాతువునకు విధింపంబడిన దుగాగమంబున కత్వంబగును. ఉ. మనము వండుదము,

వ్యా—సంప్రార్థనార్థంబునందలి మువర్ణకదుబ్వర్ణకంబులకుఁ జివరను హ్రస్వాకారంబు మొదలైనవి. విభాషగాఁ జేర్పంబడును. 'వందుము' 'వందము + అ' అనిపదవిభాగము చేయవలయును. 'వందుమా' 'వందుము + ఆ' అని విభజింపవలయును. ఇట్లే 'వందుమి' ఇత్యాదులయందుఁ బదవిభాగమూహించునది. 'వందుము' ఇత్యాదుల కర్థం జేసునఁగా వందుటకు నిన్నుఁ బ్రార్థించుచున్నాఁడనని యర్థంబు.

34 సూ—ఏదాదులను ప్రయుక్తంబులగు నప్పుడు ముజ్జునకు వుజిరుజియగు.

వినవె - వినవే - వినరె - వినరే - వినకువె - వినకువే - వినకురె - వినకురే - వినవమ్మ - వినరమ్మ - వినవయ్య - వినరయ్య.

వ్యా—'ఎ, ఏ, ఒ, ఓ, అమ్మ, అయ్య, (ఏదాదులు) అనునవి మువర్ణకదుబ్వర్ణకంబులపై ప్రయోగింపంబడునపుడు ముజ్జులకుఁ గ్రమంబుగా వుజి (ఏకవచనంబున) రుజి (బహువచనంబున) అగును. 'వినవె' ఇట 'వినుము + ఎ' ఇట్లుండ నేదాదులలోని ఎకారంబు పరమైనందున మువర్ణకంబునకు వుజివర్ణకంబుగలిగి 'వినవు + ఎ' ఇట్లయ్యె. వుజి జిత్తుగావున నిరువదియవసూత్రంబుచే ధాతువుయొక్క ఉకారమకారముకాఁగా 'వినవె' అయ్యె. 'వినవే' ఇత్యాదులయందు నిట్టిప్రక్రియయూహించునది. 'వినకువె' ఇట 'విను + ము + ఎ, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున 'విను + వు + ఎ, అయ్యెను. వ్యతిరేకార్థంబుకావున ముప్పదిరెండవసూత్రంబున మువర్ణకస్థానీయంబైన వుజికిఁ, బూర్వంబునందు 'కుజి' వర్ణకంబుగల్గి 'విను + కు + వు + ఎ, అయ్యెను. 'జిత్తు పరంబగు' అను నిరువదియవసూత్రంబుచే 'కుజి, జిత్తు గావున వినుధాతువుయొక్క యుకారంబున కత్వంబుగలిగి 'వినకువె' అయ్యెను. వుజివర్ణకంబునకు ముందున్న కుజియొక్క ఉకారంబుప్రత్యయసంబంధికాని, ధాతుసంబంధికాదు. కావుననిరువదియవసూత్రంబుచే నత్వంబురాదయ్యె. ఈపరిచ్ఛేదంబునందుదాహరింపంబడిన 'ధాతువునకు' అను ప్రథమ సూత్రంబు తక్కినసూత్రంబులయందుంబలె, 'జిత్తుపరంబగు' అను పైయిరువదియవసూత్రంబునందుంగూడ ననువర్తించునని స్మరించునది. 'వినవే,

ప్రత్యయములందుఁ బహువిభాగము 'వినుము + ఎ, వినుఁడు + ఏ; వినవుము + ఎ, వినవుఁడు + ఎ, వినుము + అమ్మ, వినుఁడు + అమ్మ, వినుము + అయ్య, వినుఁడు + అయ్య' ఇట్లు సేయవలయును.

'ప్రార్థనంబునందు న్నప్రత్యయాంతక్రియలమీఁదఁ గద గదవు పూర్వోక్తంబులన్నాదులును ప్రయుక్తంబులగు. పోవఁగదన్న పోవఁగదవన్న, పోవఁగదయ్య పోవఁగదవయ్య, పోవఁగదమ్మ, పోవఁగదవమ్మ, పోవఁగదె పోవఁగదే, పోవఁగదవె పోవఁగదవే 'సుకీర్తి మానఁగదన్న' భాగ-10-స్కం-పూ. 'చెప్పఁగదయ్య' భాస్కరశతకము ఉ॥ తుదియెప్పుడు మద్విరహాంబురాశికిం। జెప్పఁగదమ్మ 'భాగ-10, స్కం, పూ; శా॥ తండ్రీ నాకు ననుగ్రహింపఁగదె నైప్యంబందుఁ బ్రార్థించినన్, మను-5ఆ. క॥ నీపాదకమల సేవయు। నీపాదార్చకులతోడి నెయ్యము నితాం। తాపార భూతదయయును। దాపసమందార నాకుఁ దయసేయఁగదే' భాగ-10-స్కం-పూ. ఉ॥ పురంబుఁ జేసని। కెవ్విధిఁగాంతుఁ దెల్పఁగదవే తెరువేది, మను-2ఆ. 'ప్రౌఢ— క్రియా—ప.

## 35 సూ—టవర్ణకంబు భావంబునందగు.

భావంబనఁగా ధాత్వర్థంబు - వండుట - పంపుట - వినుట - కనుట.

వ్యా—ట ప్రత్యయంబు ధాతువుయొక్క యర్థంబునం దగు. ఇచ్చట భావశబ్దంబు ణిజంతమైన భూధాతువుకంటె 'ఎరచ్' అను సూత్రంబుచే నచ్ప్రత్యయంబు రాఁగా నిష్పన్నంబైనది. భూధాతువునకు 'అగుట' అర్థము. దానిపైని ణిచ్చునకుఁ బ్రేరణంబర్థంబు. కావున 'అగు' ధాతువుయొక్క ప్రేరణారూపంబు 'కావించుట', కాఁబట్టి ప్రేరణార్థకణిజంతంబైన భావశబ్దంబునకు 'కావించుట' అని యర్థంబగును. కావించుట యనఁగా నుత్పత్తిని జేయుట. 'ఘటమును గావించెను' అను వాక్యంబునకు 'ఘటోత్పత్తిని జేసెను' అని యర్థంబగు. 'వండెను' అనుచోఁ గూడ వంటను గావించెనని

యర్థము. ఫలమును వ్యాపారమును (ఫలవ్యాపారయోర్ధాతుః, అను కారికచేత (కారకపరిచ్ఛేదంబునందలి ద్వితీయసూత్రవ్యాఖ్యయందుఁ జూచుకొనునది) ధాతువునకు నర్థంబులు కాఁబట్టి వ్యాపారంబే భావంబునాఁబడు. వ్యాపారశబ్దంబునకు (కావించుట, చేయుట, అనునవి పర్యాయపదంబులు. ఫలవ్యాపారంబులు ధాతువునకు నర్థంబులు గావున వ్యాపారంబును జెప్పనిధాతువే జగంబునలేదు. అనఁగా (కావించుట లేక చేయుట, అన్న యర్థంబియ్యనిధాతువులేదు. ఉ. (పండు) ఇట పంట చేయుట. (నడచుట) అనఁగా నుత్తరదేశసంయోగంబును జేయుట. (ముందుచోటితో సంబంధము) పైనుదాహృతంబైన పండుధాతువునకు పంట ఫలము. చేయుట వ్యాపారము. నడచు ధాతువునకు నుత్తరదేశసంయోగము ఫలము. చేయుట వ్యాపారము. ఫలంబులు భిన్నంబులైయుండుఁగాని వ్యాపారంబుమాత్రము సర్వధాతువులకు సామాన్యార్థంబై యుండును. ప్రకృతసూత్రంబున వ్యాపారార్థంబునందు, అనఁగా (కావించుట లేక చేయుట, అనిన ధాత్వర్థంబునందు ట ప్రత్యయంబు వచ్చునని ఫలితార్థము. చేయుట యనునది ధాతువునకే యర్థంబైనను బ్రకృతసూత్రంబుచే విధింపంబడిన ట ప్రత్యయంబు పూర్వోక్తధాత్వర్థంబునే యనువదించునని భావము (పండుట, పంటచేయుట (చేయుట యను ధాత్వర్థంబునందు ట ప్రత్యయంబు వచ్చినది.) ఇచ్చటఁ గాయ పరిపాకమును గావించుటయనఁగా ఫలత్వావస్థను క్రమంబుగా నెదిగినందున నెదుగుట యనెడి వ్యాపారద్వారంబునఁ బండుటయను ఫలంబును దానె కలిగించుకొన్నదని భావము. చేతనాచేతనంబులగు నెల్లవస్తువుల యందును నీక్రియలుండుననుట యవశ్యంబంగీకర్తవ్యంబు. ఇచ్చట శలాటువునందు ఫలత్వావస్థ గారణంబైన క్రియ యంగీకరింపకతీరదు. అట్టిక్రియ యెద్దియనఁ జక్కఁగ నెదుగుటయేయని యూహించుకొనవలయు. లోకంబులోఁ గాయ మునుమునుపంతయు నెదిగినంగాని పండదుగదా! కాన నిట నెదుగుట భావంబు (భావ = వ్యాపారము = క్రియ) అట్టివ్యాపారంబునకును, నద్దానివలనం గలిగినపంటకును శలాటువే యాశ్రయంబైనది. కాన నిట ఫలవ్యాపారంబులు రెండింటికిని ఫలంబునందు సామానాధికరణ్యంబు గలిగినందున (పండు, ధాతువకర్మకంబయ్యె. ఫలవ్యాపారంబులకు వైయధికరణ్యంబు గల్గినచో ధాతువు సకర్మకంబగు.

'దేవదత్తుఁడు వంటకమును వండెను' అన్నయుదాహరణంబునందు ఫలము విక్లిత్తి (వంట=మెత్తఁబడుట) వ్యాపారంబెద్దియనఁగా నధస్సంతాపన (స్థాలి క్రిందనగ్నిమంటగావించుట పూత్కారాదికము (ఊఁదుట) దికము. ఈవ్యాపారము దేవదత్తునియందును, విక్లిత్తియనెడి ఫలము వంటకమందును, సంతి వ్యధికరణంబైనందున (భిన్నాశ్రయకము) నిట వండు ధాతువు సకర్మకంబయ్యెనని యెఱుంగునది. ఇట్లు సకర్మకాకర్మక క్రియాస్థలంబుల ఫలవ్యాపారంబులు బుద్ధిసూక్ష్మతచే గ్రహించుకొనవలయును. ప్రకృతసూత్రంబున విధింపంబడిన టప్రత్యయంబు ధాత్వర్థంబైన వ్యాపారంబునే స్పష్టీకరించుచుగాని యేలికముఖ్యలైనశబ్దంబులందు నికవర్ణకాదులవోలెఁ గర్త్రాదికారకార్థంబును దెలుపదని తాత్పర్యము. ఈమార్గము భూవాదిసూత్రస్థభాష్య నాన్యధాతుకేయ స్యాత్రిస్థశబ్దేందుశేఖరవైయాకరణభూషణాది సంస్కృతవ్యాకరణగ్రంథంబులందు సిద్ధాంతీకరింపంబడెనదియే సూరిగారనుసరించిరని యెఱుంగునది.

36 సూ—కజివర్ణకంబు పురార్థయోగంబునవిభాష ను భావంబునందగు.

వండకమునుపు - వండుటకుమునుపు - చేయకమునుపు - చేయుటకుమునుపు - మునుపు - మును - మున్ను - తొల్లి.

వ్యా—'ప్రాక్త్వము' అనుపదంబుతో సంబంధించినప్పుడు భావార్థకంబునందు వైకల్పికంబుగా 'కజి' ప్రత్యయంబువచ్చును. ఉ. 'వండకమునుపు, ఇట 'మునుపు' అనునది పురార్థంబు వండుధాతువ్యాపారార్థంబుతో సంబంధించినదికావున 'కజి' ప్రత్యయంబుగలిగెను. (వండు + క + మునుపు) జిత్తునకు ముందున్నయుత్వంబునకు నిరువదియవసూత్రంబుచే నత్వంబుగలిగి 'వండక' (వండ్ + అ + క + మునుపు) అయ్యె. ఇట్లే తక్కుంగల యుదాహరణంబులు గ్రహింపునది.

37 సూ—వ్యతిరేకభావంబున మిజియగు.

వ్యతిరేక విశిష్టక్రియాభిధాయి ధాతువునకు మిజియగు

వండను - వండమి.

వ్యా—వ్యతిరేకభావార్థంబునందు ‹మిజి› అనునదియగును. అనఁగా వ్యతిరేక క్రియార్థకధాతువునకు ‹మిజి› వర్ణకంబగు. ఉ. ‹వండమి, పండమి› ఇచ్చట ‹వండు› ధాతువునకు ‹మిజి› వర్ణకంబురాఁగా జిత్తుగావున నిరుపదియవసూత్రంబున వండుధాతువు నుత్వంబున కత్వంబురాఁగా ‹వండమి (వండ్ + అ + మి)› ఇత్యాదు లయ్యె. వండకుండుట, పండకుండుట యర్థంబులు.

38 సూ—సమానాశ్రయంబులం బూర్వకాలంబునంది వర్ణకం బగు.

ఏకాశ్రయంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలికంబగుం దద్వాచియగుధాతువున కివర్ణకంబగు - ఇదియె క్త్వార్థంబునాఁబడు॥ వండి - పండి - విని - కని ॥ సమానకర్తృకంబులన కసమానాశ్రయంబు లనుటంజేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడియెడిసి నిత్యాది సిద్ధంబయ్యె.

వ్యా—ఈసూత్రంబునందు సమానశబ్దంబునకు నేకత్వంబర్థంబు. అనియె ‹ఏకాశ్రయంబులగు› అనెడిమూలవాక్యంబుచేస్పష్టపఱుపఁబడినది. ఒకవస్తువు నాశ్రయించు క్రియలలో నేదిముందుజరిగినదో యట్టి ముందుజరిగినక్రియను జెప్పునట్టిధాతువునకు ‹ఇ› వర్ణకంబుగలుగును. ఇట్టిధాతువును క్త్వార్థకంబని వాడుదురు. ఉ. వండి, పండి విని కని, ‹దేవదత్తుఁడు వండిభుజించె› ఈవాక్యంబున వండుటయు, భుజించుటయు రెండుక్రియలుగలవు. వీనిలో ‹వండుట› మొదటజరిగినదికావునఁబదార్థకంబయినవండు ధాతువుకంటె ‹ఇ› ప్రత్యయంబుగల్గి యపదాదిస్వరనిత్యసంధిచే ‹వండి› (వండు + ఇ) అయ్యెను. ఇట్లే ‹పండి› ఇత్యాదులందు నూహించునది. సంస్కృతవ్యాకరణంబులో నేకకర్తయే కలిగినరెండుక్రియలలో ముందుజరిగినక్రియపైఁ క్త్వాప్రత్యయంబు వచ్చునని ‹సమానకర్తృకయోః పూర్వకాలే. అ 3- పా4. సూ 21› అని చెప్పంబడియె. అట్లు తెనుంగులోఁ జెప్పినచో మూలంబులోనుదాహరించినవాక్యంబునదోషంబుగలుగునని గ్రంథకర్తచే ‹సమానాశ్రయంబులని చెప్పంబడియె. చైత్రునిచేత మైత్రుండుకొట్టం

బడిమడిసె, ఈవాక్యంబునందుఁ గొట్టుటయు మడియుటయు రెండుక్రియలుగలవు. కొట్టినవాఁడు చైత్రుండు. మడిసినవాఁడు మైత్రుండు. గాన రెండుక్రియలకుఁ గర్తలు భిన్నులైరి. దానంజేసి మూలంబులో సమానకర్తృకంబులనిన చోఁ బైవాక్యంబు సిద్ధింపకపోవును. సమానాశ్రయంబులనినయెడలఁ గొట్టఁబడినవాడును, మడిసినవాఁడును మైత్రుండేకాన మొదటజరిగిన 'కొట్టఁబడు' అనుదానికంటె 'ఇ' ప్రత్యయంబువచ్చును. అనఁగా కొట్టుక్రియయును, మడియుక్రియయును, మైత్రునిమీఁదనే జరిగినదికాఁబట్టి మైత్రుఁడే యాశ్రయంబాయె. సంస్కృతంబులో నీవాక్యంబు తెలుంగునందుంబలెఁ గ్త్వార్థకంబుతో రచింపవలనుపడదు. 'చైత్రేణహతో మైత్రో మమార' అని కర్మార్థకక్త ప్రత్యయాంతంబుతో రచింపంబడును. భాషాశైలినిజేసి వాక్యంబులుతాత్పర్యంబులో నేకంబైనను రచనంజేసి భిన్నంబులగును.

39 సూ—కజివ్యతిరేక క్త్వార్థంబునందగు.

వండక - పండక - కొట్టక - తిట్టక.

వ్యా—వ్యతిరేకక్త్వార్థంబునందు 'కజి' అనునదియగును, 'వండు + క', ఇట్లుండ 'జీత్తుపరంబగునపు డుత్వంబున కత్వంబగు' అను నిరుపదియవసూత్రంబుచే 'వండక' అయ్యె. ఇట్లే తక్కుంగలవి యూహించునది,

40 సూ—తుమర్థ భావలక్షణంబులందును జియగు.

భావలక్షణంబునా నన్యక్రియకు లక్షణభూతంబగు క్రియ - తుమర్థంబందును భావలక్షణంబు నందును ధాతువునకు నజివర్ణకంబగు ॥ తుమర్థంబు - చైత్రుండు వండను బోయెను ॥ పాకక్రియార్థము పోయెనని యర్థము ॥ భావలక్షణము - చైత్రుండు వండనతిథివచ్చెను । ఇచట వంటలక్షణమువచ్చుట లక్ష్యము.

146

వ్యా—పూర్వోక్తంబైన మప్పఁడైదః సూత్రంబునందుంబలె నీసూత్రంబు

వంపక భావశబ్దంబును ణిప్రత్యయాంతంబైన భూధాతువునకుం బై నన్ప్రత్యయంబు రాఁగా నైనరూపంబని యెఱుంగునది. భావంబనఁగా భావన. అనఁగా గావించుట (చేయుట) క్రియయని పర్యవసానార్థము. తదర్థంబునందును, భావమందును అనఁగా ప్రసిద్ధంబుగాఁ దెలియంబడు కాలముగలయొక క్రియయు జ్ఞాపకకాలముగల (తెలియని కాలముగల) వేఱొక క్రియయందని కాలంబునకు బోధకంబగు. అట్టియపూర్వ ప్రసిద్ధ క్రియావాచకంబుకంటె నజీవర్ణకంబగును. ఏక్రియానిమిత్తముచే నొక్క క్రియ జరుగునో యాక్రియ తదర్థంబునాఁబడు. తదర్థంబునకు - చైత్రుండు వంటకుఁబోయెను. ఇట వండుట యనుక్రియనిమిత్తము పోవుటయనుక్రియ జరిగినదికాన వండుధాతువునకుం బైఁ దుమర్థమందు నజీవర్ణకంబు రాఁగా వండను, అయ్యె. వండునిమిత్తమని యర్థము. భావలక్షణమునకు - చైత్రుండు వండ నతిథివచ్చెను. ఈవాక్యంబునందు వండుటయు, వచ్చుటయు రెండుక్రియలుగలవు. వీనిలో వండుక్రియ ప్రసిద్ధకాలంబుగలది. సర్వసామాన్యంబుగా నెంతప్రొద్దెక్కినపిమ్మట వండుట యారంభింతురో యట్టికాలంబు సర్వులకుఁ దెలిసినవిషయంబు. అతిథివచ్చునట్టికాలంబు నిరూపింప శక్యంబుకానిది. వండునట్టికాలంబునందు నతిథివచ్చెనన్నచోఁ బ్రసిద్ధంబైన వంటసమయంబునంజేసి యతిథియొక్క యాగమనసమయంబు తెలియ సులభంబగు. కానఁ బ్రసిద్ధకాలక్రియను (వండుట) దెలియంజేయునట్టి వండుధాతువునకుం బై నజీవర్ణకంబుగలిగి వండను, అయినది. ఇట వండుక్రియజ్ఞాపకము (అతిథివచ్చుకాలము దెల్పుచున్నది) (అతిథి) వచ్చుటలక్ష్యంబు. చైత్రునివండుటచే నతిథివచ్చినకాలంబు తెలుపంబడుచున్నది. ఇట్లే కోడికూయఁగా మైత్రుండేగెను, ఆవులుపిదుకంబడుచుండ దేవదత్తుండు వచ్చెను. ఇత్యాదులూహించునది.

41 సూ—చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణకంబు ద్రుతాంతంబగు.

వానలుగురిసినం బంటలుపండును ॥ వానకురమ్మని ననఁబోయి

లైన్ని,

వ్యా—చేదర్థంబునందున్నట్టి పైలక్ష్యంబునందు ద్రుతాంతంబైనప్రత్యయంబువచ్చును. చేదర్థంబనఁగాఁ గార్యకారణభావాదికము. ప్రథమోదాహరణంబునందుఁ బంటలుపండుటకార్యము. (దానికి) వానకురియుట కారణంబు. కావునఁగారణక్రియావాచకంబైన కురియు ధాతువుకంటె ద్రుతాంతంబైననవర్ణకంబు గలిగె. ద్వితీయోదాహరణంబునందు (పోవుట), కార్యంబు. (దానికి) వాఁడు రమ్మనుట కారణంబు కావునఁ గారణక్రియావాచకంబైన (అను, ధాతువుకంటె ద్రుతాంతమైన నవర్ణకంబు గలిగె.

42 సూ—ఆనంతర్యంబున చువర్ణకంబు ద్రుతాంతంబగు.

జాబిలితోఁ దెంచుచుం గువలయలు వికసిల్లె.

వ్యా—అంతరము = ఎడము. అనంతరము = ఎడములేనిది. ఆనంతర్యంబునఁ (అవ్యవధానంబు తోఁచుచుండ) గారణక్రియావాచకంబుకంటె నకారాంతంబగు చువర్ణకంబగు. ఉ. జాబిలితోఁ దెంచుడుం గువలయంబులు వికసిల్లె. చంద్రుఁ డుదయించిన తత్క్షణమునందే కలువలు వికసించినవని యర్థము. ఇటఁ గలువలు వికసించుటకు జంద్రుఁడుదయించుట కారణంబు కావునఁ దద్వాచకంబైన (తోఁతెంచు, ధాతువుకంటె ద్రుతాంతంబగు చువర్ణకంబు గలిగె.

43 సూ—చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు.

చూచుచుంబోవుచున్నాఁడు - చూచుచుంబోయెను - చూచుచుంబోవఁగలఁడు.

వ్యా—నకారాంతంబైనచువర్ణకంబు క్రియాంతరసంబంధంబునందు వర్తమానార్థంబందగు. (శత్రర్థము) శతృప్రత్యయంబు సంస్కృతవ్యాకరణంబున లట్టునందు (వర్తమానార్థమందు) విధింపఁబడెను. ఉ. చూచుచుంబోవుచున్నాఁడు; చూచుచుంబోయెను; చూచుచుంబోవఁగలఁడు. పైవాక్యంబులలోని (పోవు, ధాతువుక్రమంబు

గా వర్తమానభూతభవిష్యత్కాలంబుల కుదాహరణంబు. అట్టిక్రియాసంబంధంబు, 'చూచు' ధాతువుకంటె వర్తమానార్థంబునందు నకారాంతంబైన చువర్ణకంబు గలిగె.

44 సూ—తృవర్ణకార్థంబు నం బెడి యెడువర్ణ్ణి యలగు.

ప్రహరించెడివాఁడు - ప్రహరించెడువాఁడు - ప్రహర్తయనియర్థము.

వ్యా—"ణ్వుల్ తృచౌ, అ 3-పా1-సూ133' అనుసూత్రంబునఁ గర్త్రర్థంబునందు ధాతువుకంటెఁదృచ్ప్రత్యయంబు సంస్కృతవ్యాకరణంబునందు విధింపంబడియె. కావునఁ దృవర్ణ కార్థంబునందు (కర్త్రర్థమందు) 'ఎడి, ఎడు' వర్ణకంబులగును.వర్ణ్ణియ వర్ణకశబ్దభవంబు. ప్రత్యయంబనియర్థము. ఉ. ప్రహరించెడివాఁడు; ప్రహరించెడువాఁడు. ఇటఁబ్రహరించుధాతువు. ఎడివర్ణకంబును, ఎడువర్ణంబును, కర్తయను నర్థంబునవచ్చెను. ప్రహరించుటకుఁ గర్తయనిభావము. ప్రహర్త, తృచ్ప్రత్యయాంతంబు మూలసూత్రంబున తృవర్ణకార్థంబునందు' అనినుడువుటంబట్టి తృవర్ణకాంత రూపము' 'ప్రహర్త' నిదర్శనార్థమిఁ బడియె.

45 సూ—వానికిలోపంబు బహుళంబుగానగు.

ప్రహరించువాఁడు - ప్రహర్తయని యర్థము.

వ్యా—'ఎడి, ఎడు' వర్ణకంబులకు లోపంబు బహుళంబుగాఁ గలుగును. ఉ. 'ప్రహరించువాఁడు, ప్రహరించెడువాఁడనియర్థము. 'ఎడి' ప్రత్యయంబుపుట్టి లోపించినను లుప్తప్రథమైకవచనంబులైన 'వనిత' ఇత్యాదులందుఁ బ్రథమార్థంబువోలె 'కృతసంస్కారోననశ్యతి' అనున్యాయంబున నిటఁగర్త్రర్థంబు లోపింపదు. 'ప్రహరించెడువాఁడు' ఇత్యాదులండలి తచ్ఛబ్దంబు సమాసపరిచ్ఛేదంబులోని తొమ్మిదవసూత్రంబుచేననుప్రయుక్తంబయ్యెనని యెఱుంగునది,

46 సూ—ఉన్న కలజీన, వర్ణకంబులు భవద్భావిశతృక్త్వవదర్థంబులందగు.

ఉన్న వర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబునందగు - కలజీవర్ణకంబు భవిష్యదర్థకశత్రర్థంబునందగు - నవర్ణకంబుక్తవదర్థంబునందగు- ఇవిసత్వాభిధానంబునందగునని యెఱుఁగునది - సుబంతవాచ్యంబు సత్వంబనాఁబడు - వండుచున్నవాఁడు - వండఁగలవాఁడు - వండిన వాఁడు.

వ్యా—ఈసూత్రంబునందుఁ గ్రమాలంకారంబూహింపనగు. 'ఉన్న' వర్ణకంబు భవదర్థంబునందును (భూధాతువుకంటె వర్తమానార్థంబునందు శతృప్రత్యయంబుప్పతిల్లఁగా భవత్, అనియగును. అందున వర్తమానార్థకశత్రర్థంబునందని మూలంబున వివరింపంబడియె.) 'కలజీవర్ణకము భావిశత్రర్థంబునందగును. (భవిష్యదర్థవిహితశతృ ప్రత్యయార్థమందు) మూలంబున వర్తమానార్థకశత్రర్థంబునను 'భవత్' అను వర్తమానార్థకశత్రంతము ప్రయోగించినట్లు లిచ్చటఁగూడ భవిష్యదర్థకశతృప్రత్యయార్థంబుదుంగూడ సూత్రంబున 'భవిష్యత్' అని ప్రయోగించి 'భవద్భవిష్యత్క్తవదర్థంబులందగు' అని సూత్రింబురచించినచో నధ్యేతలకు (చదువరులకు) సుబోధంబుగనుండును. 'లృటస్సద్వా' అ 3. పా 3 సూ 14. అను సూత్రంబున భూధాతువు కంటె భవిష్యదర్థంబున శతృప్రత్యయంబురాఁగా 'భవిష్యత్' అను రూపంబాయె. నవర్ణకంబుక్తవత్ప్రత్యయార్థంబునందగు. 'నిష్ఠా' అ 3 – పా–2-సూ–102. అను సూత్రంబునఁ క్తవత్ప్రత్యయంబు భూతకాలంబునందు విధింపంబడెను. సంస్కృతంబులో భూతకాలంబునందుఁ క్తవత్ప్రత్యయంబువోలె (గతవాన్ = వెళ్లినవాఁడు) తెలుంగునందు భూతకాలంబున నవర్ణకంబు గలుగునని భావంబు. పైనిం జెప్పిన 'ఉన్న, కలజీన' వర్ణకంబులు సత్వాభిధానంబునందుఁ గలుగునని తెలిసికొనునది' సత్వంబనఁగా ద్రవ్యము (పదార్థము) ద్రవ్యంబు వాచ్యంబగునప్పుడే వచ్చును. ద్రవ్యము (రాముడు, సిరి, జ్ఞానము' ఇత్యాదికము) సుబంతంబుచేఁ జెప్పంబడునుగాన 'సుబంతవాచ్యంబు సత్వంబనాఁబడు' అనిమూలంబున నుడువంబడినది వండుచున్నవాఁడు, ఇట 'ఉన్న'

కోరికి కోర్కి యనియుం గలదు. చ. అకట! యజాతశత్రుఁ డను నప్పలు కిచ్చెడు నిక్కమయ్యె వానికిఁ గురునాథ యిట్టులతనిం దెగఁ జూచుట కోరకాఁ బట్టి కొను గోరితివ్వనము డెప్పర మెంతయు నిత్తెఱంగు గోర్కికిఁ గత మేమి పాండవుల గెల్చి ధరణి సగమీఁ దలంచితే. భార. ద్రో. ౧ఆ.

పోలికి — క॥ పెనఁ జొంపిలోపలను బ్రుంగిన ధేనువు నెత్తఁ బోలికిని శల్యుండు మొత్తన సఖ జఘలమునఁ గలఁ గనియట్లుగ నిలిపె శౌర్యగర్వము మెఱయన్॥ భార. శల్య. ౧ఆ.

17 సూ.—వు వర్ణకంబు మాన్యాదుల కగు.

మను - మనువు. కాచు - కావు. కొలుచు- కొలువు. చచ్చు - చావు. తడయు - తడవు. నిలుచు - నిలువు. నొచ్చు - నోవు. పూచు - పూవు. ప్రిచ్చు - ప్రివ్వు

వ్యా— కావు-కాచు + వు; ఇట్లుండగ, ౨ సూత్రమున వుగాగమక వకారము పరమగునపుడు ధాతుచకారమునకు లోపంబు. సీ. కనదోయిఁ దిన్నఁగాఁ గాటుక తీరిచి న గుటికై నునుఁగావు నుదుటికొల్పి॥ చంద్రా. ౨ఆ. కావు — కావలి (రక్షణార్థంబైన) బొట్టు. నోవు— నొచ్చునకు వుగాగమంబు పరమగుచో, చుద్వయలోపంబును బూర్వంబునకు దీర్ఘంబునగు. 'వేదన' వ్యాధి, యర్థము. కం. కౌరవపాండవులం దొక్కొక్క వ్యాకులమం జావు నోవు వచ్చిన మేలు! ధీరమతిఁ జిత్తమునని ట్లాగ యుమా నీకు దుఃఖమగునట్లైనన్॥ భార. ఉద్యో. ౩ఆ. ప్రకీర్ణకపరిచ్ఛేదములోని ౬ సూత్రమున నూయేలాదులలోనిది గాన నోవునకారంబునకు ద్విత్వంబును, సమాసపరిచ్ఛేదములోని ౧౩ సూత్రమున దీర్ఘాక్షరంబు హ్రస్వంబునై "నొవ్వు" అగును. నొవ్వు— తే. వాయు సంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి నొవ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వు చెఱుచు సందులెడలించు గ్రమమున నెండుఁ బఱచి తనువు గ్రామనుగఁ జేసి జీవుని వెలార్చు॥ భార. అశ్వ. ౧ఆ. (నొవ్వు-వేదన)

18 సూ— అ వర్ణకరంబు గీఱ్ఱాద్యుల కగు.

గీఱ - ఊఁద - ఎండ - కాయ - చదియ - తునియ - పరియ - పాయ - పిడుచ - మీఁట - మూఁడియ - వదర - వ్రియ్య.

వ్యా— చదియ— వలఁగుడు. ద్వి. కటములు చదియలుగాఁగఁ బడఁగలాత్రియు న॥ హరిశ్చ. ౧౮.

వదర— వదరుఁబోతు. ఆ. శేర్చినోరయమూయఁ బెడతలవాపోయె। దిట్టవదర గలఁడె యొనట్లునైన॥ లక్ష్మీ. ౮౮. కం. పదునాలుగులోకంబులుఁ। బొదలింపం దున్రింపవలసి పొడవులు రెండై। తుదఁ దారొక్కటియగుదురు। వదరఁజేయుదు రభేద వాదులకెల్లన్॥ ఉ. హరి ౨ ఆ.

19 సూ—అకవర్ణకంబు మాఁఱ్ఱాద్యుల కగు.

మాఁఱు - మాఁఱకము - అమ్ము - అమ్మకము. అంపు - అంపకము. పంచు - పంపు - పంపకము. వండుడకారంబు టకారంబగు - వంటకము. తోఁము - తోఁమకము. అద్దు అద్దకము.

వ్యా—తోఁమకము-తోఁముట మూలంబునఁ గ్రావడి మద్రప్రమాదమూలకంబు. వా॥ పిడుక గొఱపంపుఁ గోమకంబునం బుటపుటనై-ఆము ౪ ఆ.

20 సూ—డువర్ణకం బాఱ్ఱాద్యుల కగు నగునపుడు పకారంబు చయలకగు.

ఆఱు - ఆఱుడు. అమ్ము-అమ్ముడు. అల్లు - అల్లుడు. ఎక్కు-ఎక్కుడు. క్రమ్ము-క్రమ్ముడు. చోఁపు-చోఁపుడు. త్రొక్కు -త్రొక్కుడు॥ త్రోవు - త్రోఁపుడు॥ దంచు - దంపుడు॥ దాఁచు - దాఁపుడు॥

దిగు - దిగుడు॥ దోఁచు - దోఁపుడు॥ పెంచు - పెంపుడు - ప్రేఁపుడు ప్రాఁకు - ప్రాఁకుడు॥ మాయు - మాపుడు ॥ రాచు - రాపుడు ఇత్యాదులు.

వ్యా—ఎక్కుడు- ఆరోహణము (భావార్థమందు) వాహనము (ఆరోహింప సాధనము; అధికరణార్థమందు); ఉ॥ ఎక్కుడివారొకో గరుడుఁ డెక్కుడుగాఁ గలవారు॥ ఉ హరి ౬ ఆ.

దోఁపుడు—కలఁతయర్థము. దోఁపుధాతువు క్షుభధాతుభవము. భావార్థమందు డువర్ణకంబు. గీ॥ కలయఁ జోఁపుడు వెట్టింపఁ గిరియుఁ గిరియు। గాసరముఁ గేసరియు దుప్పికడితియెలుఁగు। బూరగము మొదలగు మెకములు కలఁకఁదోలఁక। చెదరి నలుదిక్కులకుఁ బాఱె నదరిబెదరి॥ ఉ. రా. ౫ ఆ.

పెంచు, పెంపుడు. ప్రేఁపుడు—పెంచుధాతువునకే డువర్ణకంబుపరంబగునపుడు "ప్రేఁచు" ఆదేశంబై ప్రకృతిసూత్రమ్మున నేచకారమునకుఁ బకారంబగు. కర్త్రర్థకప్రత్యయము. ప్రేఁపుడు-పెంచువాఁడు, వర్ధిల్లఁజేయువాఁడు; అధికుఁడని ఫలితార్థము. కం॥ సన్నపువారల (అల్పులను) నధిపతి! మన్నించినఁ బ్రేఁపుడైనమంత్రికి బ్రతుకే। మున్నది? మనుమున్నయతఁడు। సన్నకసన్నదటువాసి చనకున్నఁ జెడఁడ॥ పంచ. నా ౧ ఆ. మాపుడు-మలినము. కం॥ వలపలిదిక్కునకిందుక। మలగంగాఁ దఱిమి కులుచమాపుడుపుట్టం। బెడవడఁగట్టి జటావల్కలమున నవ్వేఁగఁ జన్నుఁగవగప్పి తగన॥ భార. వి ౧ ఆ.

21 సూ—ఉవర్ణకం బడుకాద్యులకగు.

అడుకు-అంటు-ఒప్పు-ఒలుగు-ఒసఁగు.

వ్యా—అడుకు (లు) బియ్యమునాననబోసివేఁచికొట్టినవి. ఈయర్థమందు నిత్యబహువచనాంతము. కం॥ అడుకులు దన్ను [illegible]

పా॥ డొదలెఱుఁగక పాండుసుతులు సుడిగిపడఁగవలసె నిప్పుడొకసాత్యకిచేత॥ భార. ద్రోణ ౪ ఆ

ఒఱగు—ఒఱసుఎందు మూలములో సకారమస్వము ప్రామాదికము. "ఒఱగు మీఁదటఁజేరి" కళా ౭ ఆ.

ఒసఁగు—ఈవి, త్యాగము, బహుమానము. గీ॥ చూచిసామాజికులు తమసొమ్ము లెల్ల।నొసగులుగనై॥ ప్రభా ౪ ఆ.

22 సూ—వడిభృతులిల్లెఱుంగునది.

వడి; కొలువడి-గెలువడి-నటపడి. వ్యతిరేకంబున లేవడి. వి; తనవి-తెలివి- విరివి. అవు; తగవు - నగవు - ఉఱవు. ఇ: చేయి - వ్రాయి. కలి; కనుకలి - వినుకలి. ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది.

వ్యా—కొలుపడి- కొలుచు + వడి; ఇట్లుండ, (౭) సూత్రమున, ఏకారాదిప్రత్యయపరత్వమ్మునఁ జులోపమని యెఱుంగునది. ఇట్లే, గెలువడి (గెలుచు + ఏడి) నడవడి (నడచు + ఏడి); ఇత్యాదులందు వడిప్రత్యయఏకారంబు పరంబగుచోఁ జలోపంబు.

లేవడి—కలుగునకీసూత్రమున వడిప్రత్యయంబురాఁగాఁ గ్రి. పరి. ౧౧౬ సూ. న, వడిపరత్వమున "లే" అనునాదేశంబు. లేమియర్థము. సీ. నిదురలేవడిఁ గెంపు నెరయుకన్గనతోడఁ బొడిపొడియైన మేపూతతోడ॥ గని ౨౪ ఆ. దారిద్ర్యమునన ర్థము. మ॥ లేవడిం। బడియుండెందగదంచు సత్యగరిమన్ మన్యంబు గన్పట్టఁగా॥ చంద్రా ౧ ఆ.

తనివి—తనియుధాతువునకు విప్రత్యయము పరమగుచుండఁగా ఏకారాదిప్రత్యయముగాన (౭) సూత్రమున 'యు' లోపంబు ఇట్లే తక్కినవానికిని నూహింపవలయు.

# ప్రకీర్ణకపరిచ్ఛేదము.



1 సూ—పదాద్యంబులు ఋ ఌ వర్ణంబులు రల తుల్యంబులు.

అతఁడు ఋషి - ఇటసంధిలేదు. ఆఋషి - ఇట యడాగమంబు లేదు. వచ్చెఋషి - వచ్చెన్ ఋషి - వచ్చెనుఋషి. ఇటదుగ్రితమునకు లోపసంశ్లేష స్వత్వములు.

(వ్యా) పదంబు మొదటిఋకారమును, ఌకారమును, రేఫముతోడను లకారముతోడను, గ్రమంబుగా సమంబులగు. సంధియందు నియ్యవి యచ్చువంటివిగాక హల్లువంటివియగునని భావము.

కం॥ ఆఋషిపుత్త్రుఁడుగట్టిన। చీరలు మృదులములు నవ్యశిష్టములుమనో।హారులు నాతనిపృథుకటి। భారంబున నొక్క కనకపట్టముఁ బ్రేలుఁ॥ భార. ఆరణ్యపర్వ. ఇట ఋకారంబు స్వరంబువంటిదిగాదు గాన సంధి. పరి. (3) సూ-న యడాగమంబు రాలేదు.

కం॥ ఝషకేతుద్విషునకుఁ గి।బ్బిషపర్వతవృషున కమృతవిషనిధిజామా। త్రిషునకు ఋషిపూ।జితునకు విషమాక్షున కింద్రముఖదివిజపతునకుఁ॥ ఋకారంబు హల్లువంటిదిగాన "ఇషునకుఋషి" అనుచోట షష్ఠీవిభక్తి ద్రుతంబునకు సం. పరి. (౧౭ సూ-న, లోపంబుకలిగె. ఇట్లు స్వత్వసంశ్లేషంబు లూహింపునది.

చ॥ రతిపతిసర్మకర్తఁ ఋతురాజబలావళి సెంచియేగును। ర్మతులమధించి కైకొని సమానధనంబుల ముద్రవెట్టుచోఁ। బ్రతినవదీ పికాశిఖికరంగెడు లక్కయుఁబోలెమంజు లస్థితమయి తేఁటిముగ్గలపుఁ దేలియుఁ గాయుటఁ గంటివేచెలీ! వసు. ౩ ఆ.

2 సూ—అచ్ఛికంబులం దుత్తమంబులగు రు లు డు ముందటి యేత్వంబునకు హ్రస్వంబు విభాషనగు.

నల్లేరు—నల్లెరు-పల్లేరు-పల్లెరు-పెన్నేరు-పెన్నెరు - మానేరు-మానెరు-ఆడేలు-ఆడెలు-కుందేలు-కుందెలు-తోఁడేలు-తోఁడెలు-నాఁగేలు-నాఁగెలు- నేరేడు-నేరెడు-మారేడు-మారెడు - పూరేడు-పూరెడు - తంగేడు - తంగెడు.

(వ్యా)—మూఁడచ్చులుగల యచ్చతెనుఁగు పదంబులందుఁ దృతీయంబులగు రు, లు, డు, లు పరంబులగునపుడు, పూర్వమందలి యేకారంబు విభాషను హ్రస్వంబగునని యర్థము.

నల్లేరు—ఇది మూఁడక్షరములుగల తెలుఁగుపదము.

ఇట రువర్ణంబు తృతీయంబు. అట్టి రువర్ణమునకు ముందుదియైన యేకారము, (లకారతద్వయమీఁదిది) వికల్పంబుగా హ్రస్వంబగు. కావున, నల్లేరుశబ్దము హ్రస్వముఖ్యంబును నగును. ఉదా. నల్లెరు.

కుందేలు—ఈమాట మూఁడక్షరములుగలది. ఇందు లువర్ణంబు మూఁడవది, అట్టి లువర్ణంబునకు ముందరియేకారము (దకారముమీఁదిది) విభాషను హ్రస్వంబుఁగాఁగా, కుందెలు అనియదిహ్రస్వముఖ్యంబగు ను. ఇందుల కిమ్మెయిన్మనుజు లెన్నఁడువత్తురె వచ్చిరేనియా| నందముఁబొందెనిర్భయముగ న్వనినింతురెయిట్టివంటయుల్| కుందెలు| సాచ్చెవేగఁబని కోమలివారలఁజంపి తెచ్చినా| కుందనవంటి పెట్టుము రసోత్కటమానస మాంసఖండముల్|| భార, ౬ ఆ.

తోఁడెలు—క|| వలబోరినవానినిభటు| లలుగులపాలాడిరథపు కైపట్టిరి బె| బ్బులిమహిషము మెలుఁగుఁగేఁటిఁదోఁ| డెలు మొదలగువానిఁ గొన్నిటిని వేఁటకరుల్|| ము. ౪ ఆ.

నేరెడు—ఉ॥ ఆరమణీయజంబువునయందనిశంబును భూరిసింధుర| స్ఫారగఫలంబులన్నగముపైఁబడి వ్రయ్యఁగఁ దద్రసంబు సొం| పారఁ బ్రవాహనద్యైజనిజాంబ్రిఁ బ్రదక్షిణించియు| న్నేరెడుమ్రానిమూలమున నెక్కొనియుండు జగత్ప్రశస్తమై॥ మార్క. 3 ఆ. గీ॥ నేరెటేటియసల్ దెచ్చినీరజాక్షు| సానఁబట్టినరాజాడించక్కి మెఱచి| పదునుసుగనిడిచే సెనో పద్మభవుఁడు| వీనిఁగాకున్నఁగలదె? యీమేనికాంతి॥ మను. 3 ఆ.

తంగేడు—సీ॥ కెలకులనున్న తంగేటిజున్ను గృహమేధి యుపవాసుఁడంకసిద్ధార్థపేటి॥ మను; ౧ ఆ. ఇట్లుతక్కినవి యూహించునది.

3 సూ—ఉయ్యాల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులం దుయాకుం దాలవ్యవక్రయోగంబు లేదు.

స్పష్టము.

(వ్యా)—ఉ॥ ఆకొట్టికంబుమాలి ప్రజనాడినోంవుదునోంపనైతినా| త్రిక్కరణంగిపోదురు పరిత్తులనాళులు వోవుకైవడిన్॥ (వాసిష్ఠ రామా. ౪ ఆ.) ఇత్యాది ప్రయోగంబులంజేసి త్రిక్కశబ్దము తక్కశబ్దనకుఁ బర్యాయపదంబు.

ఉయ్యాల' పయ్యెద, తాయెతు వీనియందుంగాక తక్కిన నామవాచకములందు యకారమునకు, దాలవ్యవక్రయోగంబు లేదు. తాలవ్యవక్రమనఁగా "ఏదైతోః కంఠతాలు" అనుటంజేసి, ఎకారయోగంబులేదని యర్థము. ఒకారము, "ఓదౌతోః కంఠోష్ఠం" అనుటచే నోష్ఠ్యవక్రముగాన, దద్వ్యావర్తనార్థమై తాలవ్యవక్రంబని చెప్పంబడియె. ఉయ్యాల ఇత్యాది శబ్దత్రయంబునంబలెఁ బయ్యెద, తొయ్యలి ఇత్యాదులందును మధ్యాక్షరంబున నెత్వంబుండునని భ్రమగలుగఁగాఁదన్నివారణార్థ మీసూత్రంబు రచియింపఁబడియె. ఈసూత్రార్థము కొంచెము చర్చింపఁదగియున్నది.

ఉయ్యాల, పయ్యెద, తాయెతులందక్క నామంబులందని సూత్రమునందు వ్యాఖ్యకమయిన తక్కశబ్దముతో నామవాచకములనుండి (ప్రాతిపదికంబులనుండి) యుయ్యాలాత్రయంబును వర్జింపుమని చేసి "వర్జనయుక్త మన్యపదార్థేకరణే, కర్మణ్యపాదానే చ;"

(నఞ్ యుక్తమివయుక్తంచయత్కించిద్దృశ్యతే,తత్రతస్మాద్భిన్నేతత్సదృశే, అధికరణే= ద్రవ్యే,కార్యంవిజ్ఞాయతే॥ హి=యతః, తదా అర్థావగతిః=అర్థప్రతీతిరస్తి) అను పరిభాషాన్యాయంబున నఞ్ యుక్తస్థలంబునందు నివశబ్దయుక్తస్థలంబునందుంబలె భేదసాదృశ్యంబులు దోఁచుచుండుంగాన నామంబులందుంబలె (ప్రాతిపదికంబులందు) నుయ్యేలాదిత్రయంబున నఖండశబ్దత్వరూపధర్మంబు (ఏకపదత్వము) సాదృశ్యంబున స్ఫురించుచున్నది. ఇయ్యవి యవయవార్థశూన్యములయిన యఖండశబ్దంబులని సూత్రకారుని తాత్పర్యము. ఈసూత్రమప్పకవ్యాదిగ్రంథకర్తలమతంబునకు నత్యంతవిరుద్ధము. కాన నయ్యది యిచ్చట నుద్ఘాటింపఁబడుచున్నది. అప్పకవీయముఁ ద్వితీయాశ్వాసము, గీ॥ ధరణి నుయ్యేల, పయ్యెద, తాయెతులను। గలయకారంబులకు వక్రములు నిజంబు. ముద్దరాజు రామనవానిమూఁటినిపద। మధ్యయలని చెప్పె నిమ్ముటమిథ్య॥ తే॥ ఊచనెల కాకగుటచేత నుయ్యేలయ్యెఁ॥ బయిని నెదకునిక్కవక్రోక్తిఁ బయ్యెదయ్యెఁ॥ దల్లికాపునకై। కట్టఁదగినసరులు। తేలఁబల్కఁగ.దాయెతుల్ దేశ్యములను॥ ఉయ్యేల లోనగుశబ్దంబులు కవిలోకసంజీవనియందు ముద్దరాజు రామన్న యేకపదంబులని భ్రమసెంది యాశబ్దంబులలోని మధ్యయకార మెత్వంబుగలదనిలక్షణంబుసెప్పెగాని యయ్యది యవిచారితరమణీయంబనియు, పేలాశబ్దభవంబైనయేలశబ్దంబుపూర్వనికారంబునొందఁగా, ఊచు + ఏల "ఉయ్యేల" యనియు, ఎదకుఁబయినుండునన్న వ్యుత్పత్తినిజేసి "పయ్యెద" యనియు తాయి (తల్లి) + ఎత్తులు (నండలు) అనుచోఁ దల్లిరక్షకై కట్టినదండలన్న యవయవార్థమునఁ డకారమును దేల్చిపలుకగాఁ "దాయెతు" లనియు శబ్దనిరూపణంబు సూపి, ఏల మొదలగువానికిఁ బదద్వయమధ్యంబున సంధిలేమింజేసి యడాగమంబు గలిగెంగాన,కృష్ణునియేలలు, రామునియెద, లక్ష్మనియెత్తు, ఇత్యాదులందుంబలెఁ బ్రత్యేకలక్షణసూత్రమనావశ్యకంబన్న తాత్పర్యంబున నప్పకవీంద్రుండిట్లు ఖండించె. శబ్దరత్నాకరమందును "ఊయేల, శబ్దమునొద్ద "ఊచు + ఏల అనియవయవార్థము చూపఁబడినది. ఇట్టివాస్తవార్థంబును బరిశీలింపక సూరిగారు, "తే॥ దాయెతులు నుయ్యేలయుఁ బయ్యెద, యనుదక్కఁ। గలుగ దెత్వంబు మధ్యయకారమునకు'॥ అనిన కవిలోకసంజీవని ననుసరించి యేకపదంబులన్న భ్రమమూలంబున నీసూత్రమురచించెనని యెఱుంగునది. ఈసూత్రంబున నుయ్యేలాదిశబ్దత్రయంబునం గాకతక్కిన నామంబులందు మధ్యయకారమునకెత్వములేదని విధింపబడ్డదిగాని యుయ్యేలాదులందు సర్వదా యెత్వమేయుండునని

నియమింపఁబడలేదు గాన (౮)' (౨౭) సూత్రములప్రకారమున నెత్వరహితములైన యుయ్యాలాదిపయ్యెదశబ్దంబులును బరస్పరవిరోధంబులేక గ్రంథకర్తమతంబున రక్షితంబు లయ్యె. అప్పకవి యెత్వయుక్తములైనయుయ్యేలాదిత్రయంబునకే తనగ్రంథంబునఁ గవిప్రయోగంబులు చూపెను అంతమాత్రమున నెత్వములేనియుయ్యాలాదు లతనిమతంబున నప్రమాణంబులనియూహింపఁదగదు. అతండుస్థాలీపులాకన్యాయంబునఁ నట్టులుదాహరించెనని యెఱుంగునది.

ఉయ్యేల — చ॥ కలిదమయింతిఁబాపసమకట్టి సతింబతివాయనోపఁడా। లలనను దీర్ఘసౌహృదబలంబున నిట్టులు రెంటఁజేసి య। న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారియైన యు। య్యేలనుబోలె నూఱడకయెంతయుఁ బొ్రిద్దువినిశ్చితాత్ముఁడై॥ భార. ఆర. ౨ అ.

పయ్యెద — సీ॥ పలఁబడఁజక్కనల్ వలెనున్న జిలుగు పయ్యెదలోని గబ్బపాలిండ్లు మెఱయ॥ య. 3 ఆ.

తాయెతు — సీ॥ ఒకయింతియొరగిన సికమీద ముడిపువ్వు బెత్తులు దొరయఁదా యెతులు చుట్టి॥ చం. భా. చరి.

గీ॥ ఇమ్ముగా మేల్పసిండి తాయెతులు మొల్ల। విరిసరుల్ దట్టముగఁజుట్టివేసినట్టి యోరసగమీఁదఁ బైచెంగులునిచికట్టి। నట్టి బురుసారుమాల్ పహాయల్ బిట్టుదనర॥ రసి॥ ౧ ఆ.

4 సూ — ఊయెల యూయాలల చాఁపుల నొండొంటికిం గుఱుచయొండెనగు.

ఉయేల - ఊయెల - ఊయేల - ఉయాల - ఊయల - ఊయాల - వక్ష్యమాణంబు యద్విత్వంబు - ఉయ్యేల - ఉయ్యెల ఉయ్యాల - ఉయ్యల.

(వ్యా)—ఊయేల, ఊయాల. ఈరెండుపదంబులలోని దీర్ఘంబులకుఁ బర్యాయంబున హ్రస్వంబు విభాషనగునని యర్థము. ఒక్కొక్కటియే హ్రస్వంబు వికల్పంబున నగుంగాని రెండుదీర్ఘంబులు నొక్కమాఱుగా హ్రస్వంబులు గావని ఫలితార్థము.

ఊయాల—సీ॥ నిలువుటద్దములు గంటలయుయ్యాలలు హంసతూలికపాన్పులు దోమతెరలుఁ॥ షో. 3 ఆ.

పైనింజూపినవిధంబుల సంధిని వర్ణవికారంబులు గల్గెనని యూహించునది. పయ్యెద శబ్దమునొద్ద నిట్లులే బ. సీతారామాచార్యులవారు వ్రాసిరి.

5. సూ—పయ్యెద పయ్యాద.

(వ్యా)—"పయ్యాద" అని యకారమన్యముగాను నుండవచ్చునని యర్థము. సంధిని వర్ణవికారమని శబ్దరత్నాకరము.

సీ॥ గాననేగమునఁ బయ్యాద కొంగుసడలిన. .షో ౭ ఆ!

6 సూ—ఉయేలాదులందొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనంబొండె నగు.

ఉయ్యేల - ఊయేల-ఊయోల - ఊయెల - ఊయాల - ఊయల - ఆయె - ఏలిదము - ఓయు - ఓయారము - కోపు (ధనుర్గ్రహము) జాజర - తీనియ - తీయము - తేప (ప్లవము) తేమ - తోయలి - దీవియ - నూవు - నోవి - నోపు - పూవు - పేయు - మోక (అంకురము) మోటిక - మోవు - వీయము - ఇత్యాదు లూయేలాదులు.

[వ్యా)—ఊయేల మొదలగుశబ్దంబులయందుఁ బ్రథమస్వరంబుమీఁది హల్లునకు ద్విత్వంబుపక్షంబున నగు. ఉదా. ఉయ్యేల. ఇటఁ బ్రకృతమాత్రమున బ్రథమస్వరంబైన యూకారముకంటెఁ బరంబైన యకారమునకు ద్విత్వంబురాఁగా సమాసపరి ॥౧౩ సూత్రమున, ఊకారమునకు హ్రస్వంబు. ఇట్లు ఊయాల, ఊయల శబ్దంబు లీగణంబులో నివగుటంజేసి ద్వితీయహల్లునకు ద్విత్వంబురాఁగాఁ సమాసపరి. (౧౩) సూత్రమున దీర్ఘం

టునకు హ్రస్వంబుగలిగి, ఉయ్యాల, ఉయ్యెల' అనురూపంబులునగు. సీ॥ జోదలఁజనలేటి లేఁదరఁ గలుబొలుఁడగుచందమామ నుయ్యాలలూఁప॥ హరి. ఉ. ౬ ఆ. ఉయ్యాల శబ్దము; ఊయేలయొక్క రూపాంతరమని శబ్దరత్నాకరము. ఇట్లు తక్కినశబ్దములు వికారాంతరములని యూహింపనది. క॥ పలుమరుతలయంటితెగన్। నలుఁగిడిదోయిళ్ళజలమునన్ బోర్కాడిం చిలిలింజన్నిమ్మచు; నుయ్యాలనూఁపుచుఁ బెనుపఁబొదఁగె నావర శిశువున్॥ కళా. ౬ ఆ. సీ॥ ఉయ్యాలతొట్టిలోనునిచి చేతులుపట్టి యూఁచియూడెడు పాటనుబ్బనేర్చి॥ వి. పు॥ ౭ ఆ ఏలిదము. క॥ బాలుఁడని తలఁచితివుతో। నేలిదమునఁ గలసియునికి యిదికార్యమె॥ భార. ఆది. ౬ ఆ.

ఎల్లిదము—పూర్వమందుంబలె నిటఁ బ్రక్రియ యూహింపనది.

చ॥ అనవిని యింద్రుడిట్లనియె నగ్నికినిమ్మరివోయిచెప్పు మజ్జనపతితోడ నాపలుకు సమ్మతిఁజేయక తక్కనేని నేఁ। బనిచెదవజ్రమున్ జమునిపాలికి నన్నరనాథు వేగమే। యనుచుటకింత యెల్లిదమె యాతనికిన్ మనయాజ్ఞ మీరయన్। భార. ఆశ్వ ౧ ఆ.

ఉ॥ ఇంతలుకన్నులుండఁ బెరువేన్నరివేఁడెదు భూసురేంద్రయే। కాంతమునందు నున్న జనరాండ్రనెపంబిడ పల్కరించులా। గింతియుకాక నీవెఱుఁగవే మునువచ్చిన ద్రోవచొప్పునీ। కింతభయంబులే. కడుగ నెల్లిద మైతిమె మాటలేటికిన్॥ మను ౨. ఆ.

జజ్జర—జాజరశబ్దము పకృతగణంబులోనిది గాన ద్వితీయాక్షరమునకు ద్విత్వం బురాఁగాఁ దాలవ్యమునకు సమా-పరి-(౧౩) సూ-న, హ్రస్వము. ద్వి॥ వలదువసిష్ఠ యీ విట్టి జజ్జరల। (పంచనలకు) కలఁగునే కౌశికుఁడల్పునిరీతి॥ హరిశ్చ ౧ భా.

తక్కిన యోగణాంతస్యూతశబ్దంబులును నిట్లే ప్రయోగింపవలె.

7 సూ—అకారంబు క్రింది అకారంబునకును దుదినులుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు.

అట్టు - అటు. గొట్టియ - గొటియ. కన్ను - కను. నన్ను - నను. పల్లు - పలు. విల్లు - విలు.

(వ్యా) గొట్టియ- ఇత్యాదులయందుఁదుదికానిచోటను అకారలోపంబునకై అకారము ద్వంద్వంబునం జేర్పఁబడలేదు.

ఆఱు—సీ॥ ఇందుబింబముఁజూచి చెందుప్పు. గలుగుసావి (అని) యఱులెత్తినాకంగ నాసపడిన॥ కాశీ 3 ఆ:

గొటియ—ఉ. అవకు సారుగపంట్లలు। గొటియల వాడియునుపలుపగుణ. భార. ౨౦. ౪ ఆ.

పలు—సీ॥ పలురాకమునువచ్చి బాలువేలువుమన్నఁ బంన్లులేసన్న నభావ్యఁడనియె॥ భాగ ౯ స్కం:

8 సూ—అక్కటాదులజడ్డకు లోపంబు విభాషసగు.

ఆకట - అక్కట. అక్కట - అట్టిక - అట్టుక - అట్టె - అయ్యో - అయ్యారె - అవ్వారి - ఇట్టిక - ఉప్పనడము - ఉమ్మి - ఎక్కసక్కియము - ఎక్కసెక్కియము - ఎక్కిరింత - ఎడ్డ - ఎన్నిక - ఎమ్ముక - కజ్జాయము - కట్టా - కట్టిక - కప్పురము - కమ్మటము - కమ్మతము - కువ్వాడము - కొట్టిక - కొమ్మ - కొయ్యగూర - గయ్యాళము - గుజ్జరాతి - చిట్టి - చిన్న - చిమ్మట - చెన్నఁటి - చెప్పము - చెప్పఁడు - చెమ్మట - చెల్లియలు - జవ్వాజి - జాబిల్లి - తమ్మటము - తమ్మలము - తల్లి - తుమ్మికి - తువ్వర - తెల్లి - దవ్వు - దివ్వియ - నవ్వు - నిద్దుర - నివ్వరి - నివ్వాళి - నువ్వు - నెట్టిక - నెమ్మలి - పవ్వళించు - పిన్న - పుల్లియ - పువ్వు - పెద్ద - పొట్టి ప్రాకెన్న - ప్రెగ్గడ - బెగ్గడు - బొమ్మ - బొమ్మికము - బొమ్మిడికము - బొమ్మిడీకము - మజ్జ - మత్తాబు - మల్లారము - ముక్క - ముద్దియ - మెట్టిక - మొక్కరము - మొగ్గరము - మొల్లాము - రడ్డి - లొట్టిపిట్ట - వట్టి - వయ్యాళి - సన్నియ - సవ్వడి -

సిపర్వంగ - అట్టు - ఇట్టు - ఎట్టు - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - మమ్ము - మిమ్ము - తమ్ము - అమ్మ - అక్క - అవ్వ - అయ్య - అప్ప - అచ్చోటు - ఇచ్చోటు - ఎచ్చోటు - అచ్చటు - ఇచ్చటు - ఎచ్చటు - ఇత్యాదులు కల్కటాదులు.

(వ్యా) — అక్కటాది గణమందలి శబ్దములయొక్క సంయుక్తాక్షరములను లోపంబు విభాషనగు.

అర్థంబుం దెలుపఁగా బద్ధకంకణంబులైన నిఘంట్వాదులు పెక్కులున్నందున "లఘ్వర్థం హ్యర్థానాదిశ్యంతే" అనుసమర్థ సూత్రస్థపతంజలిచవనప్రకారంబున గ్రంథలాఘవార్థము సంస్కృతవ్యాకరణంబున సర్వశబ్దార్థనిర్దేశము సలుపంబడని యట్టులే ప్రకృతంబునను గ్రంథవిస్తరభీతిం జేసి గణపరిగణితంబులైన శబ్దంబులకెల్లను నర్థప్రదర్శనంబు లేకుండ స్థాలీపులాకన్యాయంబునఁ గవి ప్రయోగంబులతోఁ గతిపయంబులైన శబ్దంబులకే యర్థంబు లుదాహరింపఁబడుచున్నయవి.

అటె — కం॥ నహుషుండు పనుచువాఁడటె । విహితానుష్ఠాన పరులువీరటె పోలో। కహితంబటె యిది మనకుఁ । మహనీయమ కాకయెట్లు మానఁగవచ్చుఁ॥ భార. ఉద్యో. ౧ ఆ: (అటె=ఆశ్చర్యము. టవర్ణలోపంబు.)

ఎకిరింత — (వాహనము) సీ॥ శేవెలుంగునుదాల్చుందేవేరియుదుగ్గ కెకిరింతయై మింట మెకముదక్క॥ రాము. ౨ ఆ: ఇటఁగలోపంబు. గిజిఁగాఁడు — (పచ్చపిట్ట) ఉ॥ కూర్చిర వనేభదంత హుతకుడ్య, పరచ్యుత వజ్రపట్టికఁ బొల్పారు ముకుంగుఱుంబురువులంచు వెసంగొనిపోయి పొంతశ్రంగార వనద్రుమాళి గిజిఁగాడులు గూడులఁ జేర్చుదీపికల్ । గారపిఁ గృష్ణరాయమహీకాంతిని శాత్రవ పత్తనంబులఁ॥ మను. ౧ ఆ: (ఇటజలోపంబు) జవాజి-సీ॥ కసటువోబీరెండఁ గరఁగికజ్జలనంటిగమగమవలచుచొక్కపుజవాజి॥ వసు. ౨ ఆ: (వకారలోపము) జాబిల్లి — తరల॥ పలుదెఱంగులఁ బోవుచందురుఁ బట్టవన్నిటికన్నియై । యులిగి వేవెసువెంట నేగెడునట్టి జాబిల్లి

(చంద్రుఁడు) మేపరల్ | బలెజడల్ గడునీటఁ దేలుచుఁ జైపయిం జనుదేరఁగా | నిలువుఁజేఁతులవచ్చు కొమ్మల సెమ్మొగంబులు పొల్పగన్ ॥ య. 3 ఆ: (లకారలోపము.

పెంగడ—కం॥ తగనీలో నూహింపుము| దిగవిడువకు ధర్మతనయు దృఢమతివై పొం | దగు చందము కొడుకులకుం | బెగడలకుం జెప్పితీర్పు పెంపేర్పడఁగన్ ॥ భార ఉద్యో. ౨ ఆ: (వయాళి—విహారము; వాహ్యాళిశబ్దభవము) చ॥ అవికులవేణియిట్లు వలయాంక బిసాంకుర పన్నగాళికిన్ | జలమరి చల్లగాలికిని జక్కరఖాణపుఁ దేజిదోలుపూ | నిలుతువయాళికిన్ జిగురు విందులనీలి గయాళికిన్ హాలా | హాళి గుళికా భయుర్మ్యఘునాళికి నాళికి లోఁగియాత్మలోన్ ॥ వసు. 3 ఆ: (యలోపము)

9 సూ—జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబుగూడుచో జడ్డకు లోపంబు లేదు.

ఆట్రత్తె - కన్నదరే - నన్నడిగె - పల్లొత్తె - విల్లందె.

(వ్యా) సంయుక్తాక్షరంబునకు నజాదిపదంబులతో సంధి గలుగుచో లోపంబు గలుగదని యర్థము.

ఇట్లుమిత్త్రెక్కి, మున్నేఱు ఇత్యాదు లూహింపనగు. శా॥ ఏమీ పార్థుఁడు నీవు దండిమగలై యీవచ్చు కౌరవ్య సం | గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్ద మిత్త్రెక్కి మీమేన్మెల్ల సొబఁగంది చూచెదముగా కీసారికిం బోయిరా | భీముం డిత్తెఱి రిత్తమాటలకుఁ గోపింపండు నూ పెంపటన్ ॥ (ఇట శకటరేఫంబునకు లోపంబు రాలేదు.) భార. ఉద్యో 3 ఆ.

మున్నేఱు—మ॥ అనిలుఁ బప్పురిఁ బొరచిత్తముల కళ్యాణంద మొందంగ న ద్రివిమున్నేటి తరంగలన్ జెలఁగుచున్ ॥ భార. ఆది ౮ ఆ:

కన్నాకు—సీ॥ ఎఱచు నూఁతలు ముట్టెమెత్తి బిట్టాలించి గమికిఁ గన్నాకయి గాలి యరయు॥ మను. ౪ ఆ. క॥ కన్నాకు మనకు భీష్ముండి | న్నరవరుఁగావవలయు

నెమ్మెయి నైనన్ । దన్నుం గాచిన నితఁడు జ।గన్నుతుఁడీరణమునం బగఱ వఁగించున్॥
ఇట వలోపము రాలేదు. భార. భీ ౧ ఆ:

క॥ "వలుఁగిడి దోయిళ్ళజలమునన్ బోర్కాడిం । చిలలిం జన్నిచ్చ్యుదు" ౯ శా ౬ ఆ: సీ. పంకనిశ్శంకుఁడై పారదారికవృత్తి వదలక పల్లొత్తు వానిఁ జెడసి॥ ఎసు ౧ : ౫.

10 సూ—హాదులయు నీలుగు లోనగువాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగ నగు.

హడపము - అడపము - హరిదళము - అరిదళము. హాలఁది- అలఁది-నీలుగు - ఈలుగు. నీలుగు - నెగయు - పొందు - పొనరు పూను-పొదవుల కాదిలోపంబొకండు వచియించె నది యవిచారమూలకంబు.

(వ్యా)—హకారాది శబ్దములయొక్కయు, నీలుగు మొదలగు శబ్దములయొక్కయు మొదటిహల్లునకు లోపంబుఁ బహుళంబుగా నగును.

ఆ॥ పూనె నెగ నెఁబొదవెఁబొనరెఁ బొందెటనన్న । పలుకులందు మొదలఁ గలుగు నట్టి । వ్యంజనంబులడఁగి వానిపై స్వరములు । నిలుచు వలసినపుడు నీరజాక్ష॥ అని యప్పకవి ద్వితీయాశ్వాసమందు వ్రాయుచు "కం॥ మానవతి యిట్లుమానిన । మానక్రోధములచేత మరలిచిచింతా । దీనగతి నుండమదిలో । నూనినప్రేమమునవంబు జోపఁదుఁ డనియెన్"॥ అను పారిజాతాపహరణములోని పద్యమును బూనుధాతువు నాద్యక్షర లోపంబునకు నుదాహరణముగాఁ జూపి. 'పొదవు' నాదివర్ణలోపంబునకు, "క॥తదనంతరం బక్రియమ్మఱ ! యదువిభుఁడు కృపావిధేయుఁడై వాణీశ ! త్రిదశేశుల కాశ్చర్యం । బొదవ మనిచె నుభయసైన్య యోధులనెల్లన్॥అను చిత్రభారతాదిపద్యంబుల నుదాహరించెను. ఒదవునకుఁ గలుగు, ఉపయోగించు యుక్తమగు, అను నర్థములు శబ్దరత్నాకరాది నిఘంటువులందు వ్రాయఁబడినవిగాని పొదవునెత్తుకొని యర్థములుగాని కవిప్రయోగంబులు గాని కన్పట్టుటలేదు! కావున శబ్దరత్నాకరాదులయందును [illegible] ప్రా[illegible]

నిఘంటువులందును బొదవుయొక్క నామరూపంబులు గగనకుసుమాయమానంబులై కానంబడక యున్నయవి. కాని యప్పకవీయమందు మాత్రము ద్వితీయాశ్వాసమందే పొదవునకు నృసింహపురాణములోని పద్యయములు లోపము రానందులకు నుదాహరణముగాఁ జూపుటలో మూఁడవదిగా నీపద్య ముదాహరింపబడియె.

"క॥ అదియట్ల కాదెనిప్పుడ। జెదలంటునె దేవదేవు శ్రీరమణీశుఁ। మదినుంచుకొన్నవానిని। బొదవునె యాపదలు రవినిఁ బొందునె తమముల్॥" ఈపద్యమే శబ్దరత్నాకరములోనను "మది నునిచిన యుత్తమునిఁ। బొదవునె యాపదలు సూర్యుఁ బొదువునె తమముల్" అని యుత్తరార్థమందలి యీషన్మాత్ర పాఠభేదముతోఁ బొదువు ధాతువునకు సకర్మకార్థమైన క్రమ్ముటయొద్ద నుదాహరింపఁబడినది. ఇట్టి యప్పకవీయ శబ్దరత్నాకరంబులందలి పాఠభేదములలో నేది యుక్తియుక్తమో కొంచెము చర్చించి చూతముగాక!! సూర్యునిఁ జీకట్లు క్రమ్మని విధంబున శ్రీహరిని ధ్యానించు నుత్తముని నాపదలు క్రమ్ముకొనసేరవనిన పైపద్యార్థము నాలోచింపగాఁ నిట సకర్మకార్థకమయిన పొదువు ధాతువుగాని పొదవు గాదు. ఇప్పద్యంబునఁ బొదవు ధాతువే యని యప్పకవీయ లక్షణపద్యప్రకారమున నాదివర్ణము లోపించి తనరూపాంతర మనఁబడునట్టి యొదవు శబ్దమువలె నకర్మకమై పైనిఁజూపిన యర్థత్రయమునె తెలుపును గాన, నీపద్యమునందు నర్థసమన్వయంబు లేకపోవును. ఆదివర్ణలోపములేని తజిని బొదవునకు క్రమ్ముటయను నర్థ ముండునన్నచో "ఏకదేశవికృతమనన్యవత్" అను న్యాయంబున జరగునకు జరుగును, నడచునకు నడుచునుంబోలెఁ బొదవునకుం బొదువు ధాతురూపాంతరము కావలసివచ్చును. అప్పుడు పొదువునకు నున్నయర్థము లన్నియు వినిగమనావిరహంబునఁ బొదవునకును జెప్పక తీరదు. అట్టియర్థములు పొదవున కున్నట్లు కవిప్రయోగంబులఁ గానంబడదు. కావున "అదిరిపాటున వెసవిచ్చి పొదవికొనిన" పొదలి "యొండొండ దివియును భువియు దెసలుఁ। బొదవికొనియుండు చీఁకటి ప్రోవువలన" అనినట్టి తక్కిన యప్పకవ్యుదాహృతనృసింహపురాణ పద్యములందును "బొదవు" పాఠము ప్రామాదికముగాఁ దోఁచుచుండు. అకర్మకమైనపొదవునకు నాత్మనేపదార్థకమైన కొను ధాత్వనుప్రయోగం బయుక్తంబైనందునను, సకర్మకార్థమే (క్రమ్ముట) యిట సందర్భోచితము గానునను. [illegible] బొదువు పాఠమే [illegible] సమంజసంబు

కాఁతీయు, శబ్దరత్నాకరమందు, ఒదవుధాతువు వైకృతమని యుద్ఘోషింపఁబడుచున్నయది. అపసరశబ్దంబువలన, ఓసరుధాతునైనట్లు లియ్యది యుద్భవశబ్దంబువలన నైనట్లు గ్రంథకర్తల తాత్పర్యముగా స్ఫురించుచున్నది. ఇట్లు పరాపేక్షలేక గీర్వాణవాణ్యంశంబున స్వయంభువుగా నవతరించిన యొదవుధాతువు పూర్వపక్షులమతంబున దేశ్యంబై నిఘంట్వాదులయందును నామరూపంబులులేనిపొదవుధాతువునకు రూపాంతర మెట్లు గాఁజాలును కావున నే? "ఒదవుధాతువు పొదవుయొక్క రూపాంతరమని వ్రాయఁబడినట్లు లీధాతువు పొదవుయొక్క రూపాంతరమని శబ్దరత్నాకరాదులయందు లిఖింపబడనే లేదు. కర్మిమ్మట బోనపవర్ధమున్నట్టి పొదవుధాతువు వైకృతమేయని సాధింతురేని యపుడు పొదువు గూడఁదాన్యశాస్త్రమందు వైకృతమనవలసివచ్చును. నిఘంటువులందు "బొదువు" దేశ్యఁబనియే వ్రాయఁబడినది. కాన వైకృతమని ప్రసిద్ధిఁజెందిన యొదవు పొదవువలనఁ గానేరదు. ఒదవునొద్దఁగాని వేఱుగాఁగాని పొదవు నిఘంటువులందు నెత్తుకొనఁబడనందున దాని ప్రత్తియు సంశయాస్పదమై యున్న్యాల లూఁగుచున్నయది. కాన. ఆ॥ "పూనె నెగసెఁ బొదివెఁ బొనరెఁ బొందె" ననియే యప్పకవీయలక్షణపద్యము చదివినచోఁ సలక్షణముగా నుండును. అపుడు, 'ఒదువు' నొద్దఁ బొదువుయొక్క రూపాంతరమని వ్రాసిన శబ్దరత్నాకరము శాస్త్రానుకూలముగా నుండును. పూను ధాత్వర్థమును వివరించుతఱిని నీపద్యము శబ్దరత్నాకరములోఁగూడ నకార మధ్యంబగు పొదవు శబ్దముతోడనే వ్రాయఁబడినది. కాని యది ముద్రాప్రమాదము కావచ్చును. అట్లే కానిచో నొదవునొద్దఁగాని వేఱుగాఁగాని గ్రంథకర్త యీశబ్దము నేల యెత్తుకొని వ్రాయకుండును? బాలవ్యాకరణపుస్తకములందుఁగూడ నీసూత్రము నొద్ద నీశబ్దము నకారమధ్యముగానే దిద్దుట యుక్తంబగుంగాన గ్రంథవిస్తరంబుతోఁ జాలును. ఒకవేళ ప్రోద్భవశబ్దవైకృతమైన పొదవు శబ్దం బొకటి యున్నదనియు నందుననే దాని రూపాంతరమైన యొదవు వైకృతముగా వ్రాయఁబడినదనియు నచ్చటంగాని వేఱుచోటంగాని యీశబ్దము నెత్తుకొని వ్రాయకునికి శబ్దరత్నాకరాది గ్రంథకర్తల ప్రమాదమనియుఁ గొందఱందురేని "ధాతోరర్థాంతరే వృత్తేః ధాత్వర్థేనోపసంగ్రహాత్, ప్రసిద్ధే రవివక్షాతః। కర్మణోఽకర్మికా క్రియా" అను వైయాకరణమర్యాదం జేసి సకర్మకధాతువు శ్లోకోక్తకారణంబులచే నకర్మకార్థము నీవచ్చుం గాని యకర్మకధాతునిష్పన్నంబైన ప్రోద్భవశబ్దంబుయొక్క వైకృతం బగువాశ్చర్యమునకని పొదవునా పవ్వు

పైనుదాహరింపఁబడిన పద్యంబులుసమన్వయింపఁగాఁ 'గ్రమ్మటు' ఇత్యాదిసకర్మకార్థము నెట్టులీఁజాలునో తెలియకున్నది. కాఁబట్టియయ్యదివిచారింపఁగా విద్వద్బృందంబునకే విడుచుచున్నాఁడనుగాన సుధీమణులు శోధింతురుగాక. మఱియు బాలవ్యాకరణమందు బూనుపోదవులకు నాదిలోపంబుచెప్పిన గ్రంథకర్తవచనం బవిచారమూలకంబని సాహసించి వ్రాయఁబడినది. ఆదిలోపంబుగల పూను ధాతువునకును, పోదవురూపాంతరమే యని భావింపఁబడిన యొదవునకును నర్థవిశేషంబులందు ధారాళముగా సుకవిప్రయోగంబులు గానవచ్చుచున్నయవి—

ఉ॥ పూని వృకోదరార్జునులు భుగ్నులుగాఁ జెడచేతఁ గన్నునీ
రూనఁగనెత్తికొంచుఁ జని యుగ్రవనంబున దుఃఖమగ్నులై॥ భార-ఉద్యో-3ఆ:

క॥ హీనప్రజ్ఞుఁడకార్యము | లైనవిచేసి తుదివగచు నతుల ప్రజ్ఞా | సానుపదారూఢుఁడువగ | నూనఁడు దురిత మనువజెతి కోడక యునికిన్॥ భార-శాం-3 ఆ:
(పూనుట కాదిలోపంబు)

గీ॥ అతనిముందఱఁ బార్థ్వంబులందు బిఱుఁద | నొక్కయమ్మడిఁ జెక్కండ్రు రుక్కుమిరిలి | యొరవడించిన దేవిపై నుగ్రదివిజు | లొదువఁ జేరల్కఁ జెదవు లొం డొండ యదర॥ మార్క-౬ఆ: (పొదువు నాదిలోపంబు)

క॥ పార్థునపమా | ర్థకళేబర మెదురఁగని రోదవుశోకమునజై. ౭ఆ. పొదవున కాదిలోపమున్న వారి మతంబున)

ఇట్టులసామాన్య కవిప్రయోగంబు లుండఁగాఁ బరిశీలింప కవిబ్రహ్మవాక్యన కెదురాడిన చిన్నయసూరి వచనంబు చిన్న యనూరి వచనంబుగాఁ జెల్లందగు.

ఇట్టి యభిప్రాయమె పూను ధాతువునొద్ద శబ్దరత్నాకర గ్రంథకర్తయు వెల్లడించె. ఇట్టు, పొచ్చెము, పంచు, చెనయు, ఇత్యాదులకు నర్థవిశేషములందు నాదిలోపంబు చూపట్టు. పొచ్చెము (న్యూనము) క॥ ఇచ్చటి బంధులు నీవును | నచ్చెరుగడి వినుమనుంప నయిదూళ్ళును మా | కిచ్చినను జాలునంటిని | పొచ్చెముకా దింతపట్టు బూరగ మనుమీ॥ భార. ఉద్యో 3 ఆ:

ఓచ్చెము—గీ॥ అధ్వరారంభమింతొ ప్పునయ్య దక్షు। శివునిఁ దోడ్తేని యొక్క యొచ్చెంబుగాని॥ కాశీ. ౭ ఆ: పంచు-అజ్ఞాపించు-వ॥ తనశిష్యులైన, పైల వైశంపాయన సుమంత జైమినులం బంచి క్రమంబునఁ జతుర్వేదసూత్రంబులఁ జేయించి వేదవ్యాసుం డై-భార. ఆది ౧ ఆ:

మత్స్వరచితమయిన చార్జిముక్తావళియందలి యీపద్యంబును రాజభక్తిసూచకంబుగా నీసందర్భంబునఁ జేర్పఁబడు.

చెనయు-పోలు—చ॥ తనసతి జహ్నవింజెనయు చారయుస్వీయ సురద్రుసంఖ్యసం। దనులు రమాభకన్యయు సుధామయవాక్కు ను గల్గు చార్జిపా। వనగుణరత్నుఁ జూచి యొరుపచ్చ సహింపక సాగరుండు త్రో, ధనిఁదికిఁ గాంచి రెమ్ము! పతిభావరవర్ష వసుంధరామణీ!॥

ఎనయు—చ॥ వినినజనంబు లీతఁ డవివేకి యనక్కొ వలదింతరగ్జల। ర్జును బలశౌర్యసంపదలు చూచి యెఱుంగమె? మున్ను నిన్ను నా। తెఱఁగలనం జగం బెఱుఁగదా యతఁ డద్భుతవిక్రమోజ్జ్వలుం। డెనయుదె నీవు పౌరుషవిహీనుఁడ వద్ది విజేంద్రనందనుఁ॥ భార. కర్ణ. ౨ ఆ:

11 సూ.—ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు.

ఆరాటము - ఆరటము. ఆరాటము - కకుర్కృత్తి- కేళాకూళి- కొమారుఁడు - కొమారిత - గంబూరము - పెండారము - బంగారము - బేహారము విటతాటము - సంతోషము.

(వ్యా)—ఆరాటము లోనగు శబ్దంబులందు మొదటి నీర్ఘమునకుంగాక తక్కిన దీర్ఘంబులకు హ్రస్వంబు వికల్పముగా నగు.

ఆరటము-(పరితాపము) క॥ పటునఖర శైత్యమున నారటముడిపిసురారిసేలురసికున్నసింహుల్॥ పాండు. ౫ ఆ:

కప్పుటితి-(లోభము) చ|| కిటుకులఁ బెట్టి వీరి నడకించితొలంగెదమన్న వట్టి కప్పుటితియ కాని దైవ మనుకూలముగాదు|| జై. ౬ ఆ:

సీ|| మనసు కప్పుటితి మెల్లనలేచి చేతులఁ గాంతుని బబ్బగాఁ గౌఁగిలించు, మను ౩ ఆ:

12 సూ—ఓయారాదులం దాదిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు.

ఓయారము - ఒయారము - ఓయారపు - కేళాకూళి - కోల- గూడారము - గోరువంకపక్షి - జోహారు - నీలుగు - పేఁడ - బేహారము - దీర్ఘమధ్యమ్ము - మాఱు - మూలుగు - మోటుకు - వీటతాటను - వీడియము. ఇత్యాదులు.

(వ్యా)—సూత్రార్థము స్పష్టము.

ఒయారము—గీ|| రతివిసంబున గను నొయారమునఁ బొదలి| చంద్ర: ఉయ్యాలాడులం దున్కించేసెఁ ఒయ్యారము. సీ|| హారముల్ మెఱయ నొయ్యారంబులుగ గ్రుచ్చి యందంద వింతగా నలవరింతు|| భార. విరా. ౧ ఆ:

గోరువంక—కం|| గోరువంక యన్నమాటల| వరునంకఁ దలంకుగన్గి మనువకుఁ దమలో| సెరువింక నేమిగలదని| యిరువంకల వగలఁ బొగిలి రెంతయుఁ వంతన్|| విక్ర ౭ ఆ:

మ|| శరసంధానముతోనె కొన్నియడుగుల్ జొజన్వనం బాఱయు| ధ్వగశృంగాగ్రాని ద్రోణముల్ దివియు దోర్దండంబులం జేఁదియే| సిగిబోయల్ దినుమంచు నార్చి పరగం జిట్టాసలం దాయుమన్| గోరువంకల్ మొఱపెట్టినట్లు గుణముల్ ఘోషింపరోషించుచున్|| మను ౪ ఆ: (ఈ శబ్దము నప్పకవి శకటరేఫశబ్దములలోఁ బఠించె నది చింత్యంబు)

ము పిల్చినఁ బోటుబంటునై ! యక్కడ కేలపోయితి మహాగుణాభూషణుఁ గోలుపోయి తిఁక. భార-ద్రో-౨ ఆ:

15 సూ—ఏతాదులకు మువర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు.

ఏతము - ఏతాము - ఏతము కళ్లము - గాలము - గుడ్డము - గోణము - గోతము - జాజము - జుంజము - జోతము - తణగము - బొండ్లము మండము - లాతము - వీణము. ఇత్యాదులు.

వ్యాఖ్యానము-సీ॥ వాలారు గోరుపెఁ గాలాము చేసెనే జేజేహిరణ్యాక్షు శిశుకమునకు॥ పాండు. ౨ఆ: (గాలాము=బడిశెము)

జాజాము—(పాలికలయందుఁ బోసిన నవధాన్యములనాఱు) గీ॥ శర్వరీచంద్రపరిణయ సముదితాంకు । రార్పణక్రియలందు వియద్విభాగ । పాలికలదోఁచు కొత్త జాజాలమొలక । లనఁగఁదారక లొండొంట యంకురించె॥ కవి ౪ ఆ:

లాతాము—సీ॥ కకపాల కేదార కటకముద్రితపాణిఁ గుఱుచలాతాతోఁము గూర్చిపట్టి॥ మను. ౧ ఆ: [సన్యాసులు చేతఁబట్టెడు దండము.]

వీణాము—[సన్నవస్త్రము] కం॥ పనీటను జలకమాడెను । సన్నని వీణాముగ ట్టెనువిరులు దుఱిమెఁ । సన్నముగ నలఁదెఁగస్తురిఁ । జన్నుల ముత్యాల బన్నసరములు దాల్చెఁ॥ జై ౩ ఆ:

16 సూ—పదాంతంబులయి యసంయుక్తంబు లయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.

ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు॥ మాన్పడె - మినువడె - మిన్వడె - వత్తురువారు - వత్తు

ర్వారు - కారుకొనసియె - కాత్మ్యానియె - గ్రామములు - గ్రామముల్ - వనములు - వనముల్.

(వ్యా)—పదము తుదనున్న, ను, రు, లు, వర్ణంబులు సంయుక్తములు గాని యపుడు, వాని యుకారంబునకు లోపంబు బహుళంబుగానగు. ఇందు నువర్ణ, రువర్ణముల యుకారమునకు లోపంబు హల్లు పరంబగుచోఁ దఱచుగాను, అవసానమందు విరళంబుగాను, నగును.

ప్రాన్పడు— స్రవించు —ధాతుజవిశేషణంబైన యను శబ్దముయొక్క యుకారమునకు లోపంబు ప్రాయికంబగు. సీ॥ సలుపుచు దమసుఁ డన్నన్మునిఁ బత్నియుఁ దాను నుపాసించి తద్వారమున॥ భార. ఆర. ౨ ఆ:

కం॥ అన విని నిరుత్తరుండయి। మనుజేంద్రుఁడు గొంతసేపు ప్రాన్పడి తలఁపుల్ పెనఁగొన నిద్రాహీనిం। దనువలయఁ గవిదురుతోడఁ దానిట్లనియెన్॥ భార. ఉద్యో. ౨ ఆ

శా॥ పాలో మీప్రభృతుల్ కుమారినిటు సంభావింపఁగా మున్నది। క్ష్మాపులర్ రాజు నలంకరించి శుభలగ్నంబుం బ్రతీక్షింపఁగా। నాలోఁ దాను దదగ్ర్యసన్మణివిశేషాన్వేష సన్నద్ధుఁడో। నాలోకాప్తుఁడు చేరెరాగ మహిమన్ రత్నాకరప్రాంతమున్॥ వసు. ౬ ఆ:

ఏతత్సూత్రోదాహరణ సందర్భంబున మద్విరచితంబైన జాజీముక్తావళిలోని యిప్పద్యంబులనుగూడ సంధించి యీగ్రంథంబున నిట్టిత్రిచతురపద్యసంఘటనాద్వారంబునఁ బరిపాలనా గౌరవముం గుఱిచి త్రికరణశుద్ధిం దెలెపెద.

మ॥ పొగ కార్మబ్బులు మంటచాల్మెఱుపులుం బోగారు కన్నీటియే। టిగముల్ సప్పిన దాండవ గోపాత్రికుల ఘాటీవృష్టులేఁచఁగా మహా। యాగమైతోఁచిన దుర్దినాళి బహుదుర్భిక్షంబు మాయించిబల్ । సుగమ్ముంగాక్రొదు శాంగికేయ విజయ [illegible]

[illegible]

చ॥ ధులియనఁదగ్గచోటను గడుంభ్రమఫిల్లి యటండుఁ; మానులి! య్యలజగదీశ్వరుండలఘులీశ్వరుఁడై తన మూర్తిపృష్ఠమం| దెలమినహింమనట్లు నహియించుచుఁజేసి ధులీశ్వరాఖ్యతోఁ | బిలిచిరి ధర్మజాదులను బేర్వడు మాగతి జార్జిభూపతీ!

మొదటిపద్యములోఁ గార్మబ్బులు, చాల్మెఱపులు, కన్నీటి, గముల్నిప్పి, బల్నిగము, చంద్రికల్ (అవసానంబున) అనుచోట్లను; రెండవపద్యమందు, 'పేర్వడు' అనుచోటను, రు, లు, ను వర్ణంబులను లోపంబని తెలియందగు లువర్ణాంతమైన ధాతుజవిశేషణముయొక్క యుకారమునకును. లోపంబు విగళంబుగాఁ గానంబడు.

క॥ చిట్టుములు నోకిలింతలు ! నట్టంబుగఁ బొడమోఁజవులు దప్పెం గోర్కుల్। బిట్టోడవెఁ బిఱుఁదులుం జను । కట్టులు నడుబలిసెనపుడు క్రాల్గంటులకున్॥
అచ్చ. రా. బాల. కాం.

సీ॥. విరహాగ్ని నీరీతిఁ గరఁగెనామానసం బనినట్లు వెన్నగాచిన ఘృతంబు। పాలఁబోల్ వయసు నీపాలుజేయుట కిదె యానవాలన్నట్లు లానవాలు॥

తారా. శశాం. విజ. 3 ఆ:

17 సూ—అచ్చికంబులం బదమధ్యంబుల న ల డ ర లయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.

కినుక - కిన్క॥ కానుక - కాన్క॥ చిలుక - చిల్క॥ కాలువ కాల్వ॥ అడుగు - అడ్గు॥ కడుపు - కడ్పు॥ పెరుగు - పెర్గు కూరుకు - కూర్కు.

(వ్యా)— అచ్చతెనుఁగుమాటల నడుమనున్న, న, ల, డ, ర, వర్ణంబులమీఁది యుకారమునకు లోపంబు బహుళంబుగా నగు

కిన్క—(కోపము) పంచచామరము॥ అనంగొఱంతలేని కిన్కనక్కడించి ఖోగు! గ్రన్నవకదిశంపవింపనా లునారసంబులూని॥ అచ్చ-రా-యు

చ॥ అళికులవేణి కీలెఱిఁగి యాచెలి వెండియు నేకతంబునన్ | బొలతుకరాల యీచిగురుబోడి సుచారిత్రహారనాయకో | జ్జ్వలరుచిఁ గంటిరే యనినఁ జంద్రముఖుల్ చెలునవ్వుఁ బూనిరా | లలనలఁజూచి, కిన్కయుఁ గలంకయుఁ గొంకును సంకరింపఁగన్॥ వసు. 3 ఆ:

కాన్క—(కానుక) సీ॥ సుమములుగాఁ బొలుపుపూగముల జెన్నొందు పూగములఁ గొన్నింటిఁ గైకాన్కచేసి॥ చం.ప్ర:

కాల్వ—శే॥ గీ॥ కడలి కోఁతుల కొకతోట కాల్వయయ్యె॥ అన్న.రా. యు.

18 సూ—లాఁతియచ్చునకు సహితి మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి.

కలికి - కల్కి - ములికి - ముల్కి - బుడిపి - బుడ్పి
పొలఁతి - పొల్తి.

(వ్యా) తెలుఁగుమాటల నడుమనున్న ఇకారన యచ్చులకు క్వచిత్తుగా లోపంబగు.

కల్కి—(1. ఒప్పిదము 2. మనోజ్ఞురాలు) సీ॥ ఈకల్కి మదనునిచేకటారి యొకాకకాను పేరటపిడి గాంచనేల? తా-శి-విజ 3 ఆ: సీ॥ అత్రిసవృత్తి చెన్నలరి నూతనరాగమహిమఁ గుల్కెడు కల్కి మానికములు. వసు. ౬ ఆ:

ముల్కి—(బాణము) వ॥ తనరాజీవశరం బెఱుంగదు నిశాతత్వంబు లేఁగల్వతూ | పునసుం జాలదు వేగలీలయని యాపూముల్కు లెగ్గించి క్రొ | న్ననవిల్కాఁడు నవాంబుజోత్పల వితానంబీను మీనాక్షిలో | చనము ల్వెంట ఘటింపఁజొచ్చెనవి నిస్తంద్రాంబకఖ్యాతులన్॥ వసు. ౨ ఆ:

19 సూ—అబ్బురాద్యులందుత్వంబునకు లోపంబు విభాషనగు.

అబ్బురము - అబ్రము - అబ్బురము - కప్పురము - అప్పుడు ఇప్పుడు - ఎప్పుడు - చప్పుడు - నెత్తురు. ఇత్యాదులు.

(వ్యా)—అబ్బురములోనగు తెలుఁగుమాటల నడుమనున్న యుకారము వికల్పంబుగ లోపించును.

అబ్రము—ఉ॥ కాయను మేటితప్పు కొడుకాయను నిద్దపుఁ బూతమావిమో కాయనుఁ బంజరంబుఁ జిలుకాయని నబ్రపు సోయగంబుఁ బ్రో। కాయనుఁ బల్కవేమి యలుకాయనుఁ బంతము దీటునోటికై। కాయను నేరయిట్లు దుడుకాయనుఁ బాయఁగ గోరకాయనుల్ అన్య. శా. అయో.

కప్రము—(కర్పూరము) ఉ॥ చెన్నగునన్న దీవులినసీమల దాగిలిమూత లాడుదుర్ । వెన్నెలరేలఁ గప్పురపు విప్పుట నంటుల నీడనీగురా। కన్నెలగోయునన్నులకుఁ గన్నులు హాయిఁ గదియువాసనల్ । మన్ననఁగాంచి కప్రపు దుమారము రేచుసమీర డింభముల్॥ వసు. ౧ ఆ:

20 సూ—చుక్కరక రువర్ణకంబున కుముందఱిదువర్ణంబు నుత్వంబునకులోపంబు విభాషనగు; నగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు.

అదురుచు - అద్రుచు॥ ఎదురుచు - ఎద్రుచు॥ పదురుచు - పద్రుచు.

(వ్యా)—రువర్ణమునకుఁ జూగాగమంబు పరమగుచుండ రువర్ణముముందఱిదువర్ణముయొక్క యుకారమునకు లోపంబు వికల్పంబుగానగు. అట్లులోపించుచో దకారరేఫ సంయోగమునఁ బూర్వస్వరము గురువుగాదు. ఇట్టిద రేఫసంయోగంబే యన్యోన్యంబును బ్రాసంబుగాఁ జెల్లుననియు నియ్యది లఘుద్విత్వప్రాసంబని పేర్వడుననియు నప్పకవీయ తృతీయాశ్వాసమందు నిట్లు చెప్పంబడియె.

లఘుద్విత్వప్రాసము—తే॥ గీ॥ భువిలఘుద్విత్వ సంజ్ఞికంబులయి కొన్ని । య్యూ

దఁబడని క్రారలతోడనొకటికొకటి । ప్రాసములకగుఁ దమలోనఁ బత్రయుగము। విద్రిచిన తాత్మజుఁడు దిక్కుల ద్రువననఁగ॥

అద్రుచు—కం॥ ఇలయును నింగియు నద్రువం। జెలఁగ మహాంబు వారిసేనల గురుచా। నలుక నొసర్చిన నక్కడ। బలరిపుఁడే తెంచి తోడుపడె నఁడనొక్కో॥ భా. ర. ద్రో. ౨ ఆ: కం॥ పదిగడల ద్రుంగనార్చుచుఁ। బదిమోముల జోడుకలనఁ బడలుండ బనుచున్। బదివింశుల. గైకొనియు। ప్పదితేరుల నోనికోడుకు బడలఁగనేసెన్॥ కం॥ నొప్పినడి వాఁడువద్దయు। నుప్పరమద్రువంగనార్చి యొకవాలుంమా। పప్పాల ముద్రిమ్మరి పయిన్। గుప్పున నడరింప సాక్షుగొని యుండునెడన్॥ అచ్చ. రా. యుద్ధ కాం.

ఇట్లు, "అద్రుచన్" అను శబ్దంబునఁ జూగాగను బకారంబునను, క్రి-పరి-౭౮ సూత్రంబున "యానుపన్, కూరుపన్" ఇత్యాదులయందుబలెఁ బకారంబు రాక సిద్ధచకారంబునకుం బోలెఁ బ్రయోగంబులచకారంబు కానంబడు ఇట్టి బ్రేరణార్థమును గనంబడును.

చ॥ ఎద్రిచినకోలపాకమున నీగతి నీమదిఁ గోత్రభవల్లికన్ । బద్రిచిన వారు ఉ-హరి. ౪ ఆ:

ఇట్లు, అద్రుచు, ఎద్రుచు, పద్రుచు, అనుచోట్లను దకార రేఫసంయోగంబునకు ముందున్న యకారంబును, ఎకారంబును లఘువులే కానఁ బద్యలక్షణభంగంబు గల్గ లేదు. కొందఱు మిత్రశాస్త్రవాది బనంబులలోని రేఫాంతసంయోగంబునకు ముందున్న స్వరమును గూడవలసినచోఁ బద్యలక్షణంబున నొకానొకప్పుడు లఘువులుగా నెన్నకొనవచ్చునందురు. అయ్యది పూర్వోక్తస్థలంబుల విశేషించి లఘుత్వమును విధించిన ప్రకృతసూత్రాప్పకవ్యాది లక్షణంబులంజేసి నిరాకరంబని తెల్లంబగుచున్నయది. విక్రమార్కుని సభలోని నవరత్నంబులలో నొక్కండని ప్రసిద్ధిం జెందినవరాహమిహిరాచార్యుండు మాత్రము బృహజ్జాతక గ్రంథంబును వ్యాకరణయుక్తంబుగాఁ జిత్రవృత్తంబులతోఁ గావ్యంబుభాతిని రచియించి ద్విత్రప్రదేశంబులందు నిట్టిసంయోగంబునకు ముందున్న వర్ణమును లఘువుగా నిల్పి లెంచుచుండు.

బృహ—(ప్రవ్రజ్యాయోగాధ్యాయము-శాలినీవృత్తము-శ్లో॥ జన్మేశో? న్యైర్యద్యదృష్టో! ర్కపుత్రం । పశ్యత్యార్కిర్జన్మపంవాబలోనం । దీక్షాంప్రాప్నోత్యార్కిద్రేక్కాణసంస్థే । భౌమార్కాంశే సౌమ్యదృష్టేచ చంద్రే॥—ఈశ్లోకంబులోఁ దృతీయపాదంబున ద్వితీయగణంబుగా నుండవలసిన తగణంబునకు దరేఫసంయోగంబున భంగము గలుగుచున్నయది. తేల్చి పలుకవలయునని గ్రంథకర్త తాత్పర్యంబు. ఇట్టిది జ్యోతిశ్శాస్త్రగ్రంథంబులందే యాథాతథావముగాఁ గనంబడు. దీనికి మూలంబు గానరాదు.

21 సూ—జూదాదుల దకు జకారంబు విభాషనగు.

జూదము - జూజము - ఆపుదు - జవాద - జాది - జాదు - విరవాద.

(వ్యా)—ప్రకృతిసూత్రంబునఁ గొన్ని తెలుఁగుశబ్దంబుల దకారమునకు జకారము వికల్పంబుగా విధింపంబడుచున్నయది. సంస్కృతభాషలోఁ సయుక్తము దకార జకారంబుల సాక్షికోచ్చారణంబునంజేసి 'దంపతీ' అనియు జంపతీ అనియు నీశబ్దమును ద్వివిధంబుగాఁ బలుకవచ్చును ప్రాకృతభాషయందుఁ గేవల దకారమునకు జకారవిధి లేదు గానివకారసంయుక్తసాంస్కృతికదకారమునకు-సూ-త్వథ్వద్వధ్వాంక్వచిచ్ఛఝజఝాః॥ అనుసూత్రమున జకారంబుక్వాచిత్కముగా విధింపంబడియె. ఇట్లు భాషాంతరములయందును దకార జకారములకు మైత్రి క్వచిత్తుగానుండు.

22 సూ—నిందయుం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గి గీ లగు.

కుంభకర్ణుఁడు - గింభకర్ణుఁడు॥ రావణుఁడు - గీవణుఁడు.

(వ్యా)—రెండవపర్యాయంబున నుచ్చరించు మాటయొక్క మొదటిస్వరము హ్రస్వంబయ్యెనేని, గి, వర్ణంబును, దీర్ఘంబయ్యెనేని గీ, వర్ణంబును నిందయందు క్రమముగా నగు.

ఉ॥ అంచవహుష్కాయిజోడు నలరారఁగఁజేసి కడింగికోరికల్ । గాంచి పిసంచ రక్కసి కొలంబున కెల్లను మేలుబంతియై । మంచపుఁగోడు తాలుపరిమన్కి బిడావపు

మెట్టు నెంతయుం। గొంచక యెత్తినట్టి నినుఁ గోఁతులుగేఁతులు గల్వఁజాలునే? అచ్చ రా. యు. కాం.

క॥ డింభక సద్వస్థలముల। నంభోరుహనేత్రుఁ డుండుననుచు మిగులసం। రంభమునఁ బలికెదవీ। స్తంభంబునఁ జూపఁగలవె సక్రిం గ్రికి॥ భాగ. ౭ స్క:

ఆ॥ వె॥ ఎసఁగుభసలములను గిసలయములను నీర। జాతములనుగీరజాతములను విగ్రహింపనీని విరహాంబితోఁ మగా। వెలఁది వెనలె విపిన వీథులకును॥ వసు. ౩ ఆ

ఇటఁ జక్రి భసల శబ్దముల మొదటి హ్రస్వమునకు, గికారమును, "కోఁతులు నీరజాతములను" అను మాటల మొదటిదీర్ఘమునకు సూత్రరీతిని గికారంబును నయ్యెనని యెఱుఁగునది.

23 సూ — పాదంబునం బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసం బులునాఁబడు.

(వ్యా)—పద్యపాదముయొక్క మొదటియక్షరంబునకు వళి యనియుఁ రెండ యక్షరమునకుఁ బ్రాసమనియు, లక్షణగ్రంథములయందు సంజ్ఞ గలవని యర్థము.

24—సూ—యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు రేఫం బులుపొరయవు.

వ్యా— యకారవకారలకారములు లఘువులును నలఘువులును యతిప్రాసములం దు నన్యోన్యముఁ జెలిమిగ్గియుండు. అట్లు లఘ్వలఘువులైన రేఫంబులుమాత్రము మైత్రితోనుండనేరవు.

ఉదా—కం॥ అన్నలుఁ దమ్ములుఁగలురట। యున్నతుగాఁ జేయు నెంతయు నున్నపతిందా। పన్నవయనీకియును సం। పన్నంబులు గాఁగవారిఁ బాటింపటుగా భా-శాం ౨ ఆ: (ఇలయతిమైత్రి).

ఈపద్యమందు "నృపసత్తముని యతివ"—(నృపసత్తముని + అతివ)=రాజశ్రేష్ఠుఁడైన ధృతరాష్ట్రుని భార్య యని భారతార్థమందు లఘువైన యకారమే. "నృపసత్తము"= దశరథునియొక్క. "నియతివశతన్"=అనివృత్తసంప్రాప్తిని యని రామాయణార్థమందున లఘుయకారమయ్యె.

గీ॥ అలఘుమాననీయబల విడిపింపుమా | మాయావులబలు మేటిగానైన తపసి | కౌరి గలుమకలుషిత తాతన్న సుయోధను | నృపవిభూషణు గరమునను వధించి దాని కని ఆ:

ఇట—"నీయబల"—(నీ + అబల)=నీకాంతయైన సీతనని రామాయణార్థమందు లఘువైన యకారము, "అలఘుమాననీయబల"—గొప్పదియైనట్టియు, పూజ్యమైనట్టియు, బలముగలవాఁడా యని భారతార్థమందు నలఘువయ్యెను. "మాయావుల" (మా + ఆవుల)=మాయొక్క, ఆవులని భారతార్థమున లఘుయకారము. "మాయావుల" + మాయావంతులలోనని రామాయణార్థమున నలఘుయకారము.

గీ॥ అలఘుమణి సంప్రవిభాసిత హేమాద్రినిభస | నగరమునకెంచ మఖిలభూనగరము లను | లలితజయసంపదల బోల్చు నిలువయోధ్య | లఘుగభీరాంబు పరిఖాకలాపమగుచు॥ హరిశ్చంద్రనలోపాఖ్యానము ౧ ఆ:

ఈపద్యమందు "లలితజయ సంపదలఁబోల్చు నిలువయోధ్య"—(నిలువు=అయోధ్య)=జయసంపదలకు నిలుకడయైన యయోధ్యానగరమని హరిశ్చంద్రార్థమందు వకారమలఘువు. జయసంపదలఁబోల్చు నిలు + పయోధ్యలఘు గభీరాంబు పరిఖాకలాపము= జయసంపదలచేనొప్పునట్టి గృహమువంటిదియు, సముద్రమువోలె గొప్పలోతు నీరుగలయగడ్త భూషణముగాఁ గలదియునని నలార్థమందుఁ బ్రథమాంతమైన యిలుశబ్దముకంటెఁ బరమయినపయోధిశబ్ద పకారంబునకుఁ బన్యపాదసమయంబున సంధివశంబున నైన వకారంబుగాన లఘువు.

కం॥ పలుపగతురగములనుహో | బలదిత్రి ప్రౌఢిఁదోలి బహుచక్రశ్రీ | వెలయుపుష్కరభువుఁడా | ప్రియముఁగను తినగొప్పునఁనీపఁ బరపుమనమునకు॥ హరిశ్చం- నలు౧ ఆ:

ఇట "పలుపగతురగముల" — (పలు + పగతురగముల) = అధికమాపగవారిసమూహములను అని హరిశ్చంద్రార్థమందుఁ బగతుశబ్దముయొక్క పకారాదేశమగు వకారము లఘువు.

పలువగ + తురగముల = అనేకవిధములైన గుఱ్ఱములనని నలార్థమందున లఘువకారము — లఘ్వలఘువులైన యవలు పద్యంబున వెవ్వేఱుచోటులనుండి యతిప్రాసంబుల యందుఁ జెలిమినొందుటయే కాక, పైనిం జూపిన విధంబున శ్లేషకావ్యంబులయందు ద్వ్యర్థియొక్క చోటనే యభేదంబు నొందుచుండు. ల, ళ లు మాత్రము వెవ్వేఱుచోటున నుండుచు యతిప్రాసంబులందుఁ బరస్పరమును జెలిమినొందినిలుచుండంగాని శ్లేషస్థలంబుల నభేదంబు నొందనేరవు.

## శకటరేఫము.

సంస్కృతవ్యాకరణంబున వకారయకారములు మాత్రము లఘువులు, అలఘువులు, యని రెండువిధములుగానున్నవి. లఘువనఁగా లఘుతరోచ్చారణ గలది యని యర్థము. యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం స లఘూచ్చారణః' అని వ్యాకరణమునందు వివరింపఁబడినది. లఘూచ్చారణః॥ అనఁగా లఘుతరోచ్చారణమని శబ్దేందుశేఖరమందుస్పష్టపఱుపఁబడియె. నాలుకయొక్క చిట్టచివర, చివర, మధ్యప్రదేశ మూలప్రదేశములందును మిక్కిలి శైథిల్యపలుకఁబడువర్ణము లఘువనఁబడును. ఇట్టివి సంస్కృతభాషలో యకారవకారములు మాత్రమే యున్నవి. ఆంధ్రవ్యాకరణకర్తలు యకారవకారములే కాక రేఫముకూడ లఘుత్వాలఘుత్వభేదముతో నున్నట్లుకనుఁగొనిరి. లఘురేఫము జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలములందు లఘుతరముగాఁ బలుకవలయుననియు, శకటరేఫము జిహ్వాగ్రాదులయందు గౌరవముగా నుచ్చరింపవలయుననియు, భేదంబుచెప్పుదురు. కనుక లఘురేఫము కోమలవర్ణముగా, నలఘురేఫంబు పరుషవర్ణంబుగాఁ బెద్దలుగ్రంథంబులందు లెక్కించిరి. శ్లో॥ పవర్గవర్జితాః స్పర్శాః స్వస్వవర్గాంత్యశేఖరాః। లఘురేఫణకారౌచ కోమలాః పరికీర్తితాః॥ అని యహోబలపండితీయము ఇట్లు లఘురేఫము కోమలవర్ణమనుటవలన శకటరేఫము పరుషవర్ణమని స్పష్టమగుచున్నది లఘురేఫమీక్రిందిశ్లోకమునఁ జెప్పఁబడిన హల్వర్ణములతో సంబంధించినప్పుడే పొందు

వ్యమును బోధింపనుగాని కేవలస్థితిలోఁ గోమలత్వమే సహజగుణముగాఁగలదని ప్రతాపరుద్రీయరత్నాపణవ్యాఖ్యానము. శ్లో॥ రేఫే ఽయస్యైకస్యాపి। యోగ ఆద్యతృతీయయోః। స్యాత్తరాభ్యాం తుల్యయోర్వా। పరుషాస్తగణశ్మశా॥ అని వర్ణాంతరంబులతో సంబధించి నప్పుడుగాని రేఫంబునకుఁ బరుషత్వగుణము రా నేరదని చెప్పుచు, శ్లో॥ మాంసకీకససంకీర్ణాః। ప్రసరద్రుధిరాపగాః। వసాకర్దమితాయుద్ధే। భువోంద్రసుభ్రైఃకృతాః॥' అను శ్లోకంబునఁబరుషంబయిన బీభత్సరసమునకు రేఫసంయోగ ముదాహరణముగాఁ జూపఁబడినది. శ్లో॥ అత్యుద్ధతగసారౌద్రబీభత్సాపరికీర్తితా॥ అని బీభత్సరసమత్యుద్ధతము గావున నట్టిరసమును దెలియఁజేయుటకు రేఫసంయోగంబు సమంజసంబని గ్రంథకర్త తాత్పర్యము. ఇట్లు సంయుక్తరేఫమును, అలఘురేఫంబును బారుష్యగుణము గలది గావున రౌద్రబీభత్సరసములకుఁ దగినవియనియు, కేవలరేఫంబు కోమలంబుగావున శృంగారాది సుకుమారరసంబులయం దుపయోగింపఁ దగినదనియుఁ బర్యవసానము తేలుచున్నది. "శ్లో॥ రసాశ్శృంగారబీభత్సౌ తథా వీరభయానకౌ। రౌద్రాద్భుతౌ తథాహాస్యకరుణౌ వైరిణౌ మిథః" అని శృంగారబీభత్సములకుఁ బరస్పరవిరోధంబు గనుక శృంగారరసంబులో నుపయోగింపఁదగిన లఘురేఫంబునకును బీభత్సరసంబులో నుపయోగింపఁ దగినయలఘు రేఫంబునకును నయ్యారసంబులకుంబోలె మైత్రి చెల్లదని గ్రంథకర్తల తాత్పర్యము. కోమలపరుషత్వంబులచే నన్యోన్యవిరోధంబుగల లఘురేఫశకటరేఫంబులకు యతిప్రాసములలో మైత్రి హాస్యాస్పదమని పెద్దలచే నిషేధింపఁబడినది.

హూణభాషలోఁగూడ నొక్కయక్షరమునే లఘురేఫంబువోలెఁ దేలికగాను నలఘురేఫంబువోలెఁ గఠినముగాను నుచ్చరించు సంప్రదాయంబు కలదు. ఇ. జి.

(1) క్రైట్, రిసీడ్ ఇత్యాదిశబ్దంబులో (ర) గురుత్వముగా నుచ్చరింపఁబడును.

(2) హియర్, నియర్ ఇత్యాదిశబ్దంబులో (ర)వర్ణము తేలికగాఁ బలుకఁబడును. హూణభాషలో నొక్కయక్షరమునే లఘుగురుత్వములతో వాడుచుండఁగా తెలుగునం దవి సౌకర్యమునకై రెండువర్ణంబులుగా నుచ్చారణభేదమును బట్టియే యేర్పఱుపఁ బడినది. ఇట్టిభేదం బితరభాషలలోఁగూడ ననాదిగఁ జూపట్టుచున్నందున మన భాషలో నట్టిభేదంబును నిరాకరించుటకై నిరాకరంబయిన యలఘుక్రమంబు స్వీకరింపకుందురని విశ్వసించుచున్నాఁడను.

25 సూ — రేఫంబులు లఘ్వలఘువులుం దక్కంగల విశేషంబులు నార్యవ్యవహారంబులం దెలియుట శ్రేయంబు.

వ్యా—లఘువనియు నలఘువనియు రేఫంబు ద్వివిధంబు. ఆభేదము సర్వలక్షణసారసంగ్రహము, అప్పకవీయము మున్నగు నితరగ్రంథముల సాహాయ్యంబునం దెలియందగు. కావున నట్టిభేదవివరణంబు గ్రంథవిస్తరభీతిం జేసి యిట వివరింపఁబడదు.

ఇంకను నార్యులచేత నవలంబింపఁబడిన విశేషంబులం దెలిసికొని వ్యవహరించుట శ్రేయోదాయకము. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణ్యాయుష్మత్పురుషాణిచభవంతి అధ్యేతారశ్చ ప్రవక్తారో భవంతి" యను భాష్యకారవచనంబున మంగళార్థము సూత్ర గ్రంథాంతమందు శ్రేయశ్శబ్దము ప్రయోగింపఁబడినదని యెఱుంగునది.

మహాభాష్యప్రారంభమున గ్రామ్యభాషానిరసనంబొనర్చి వ్యాకరణప్రయోజనంబును దృఢపఱిచినట్టు లీసూత్రము నొద్ద సందర్భానుకూలంబు గాన నార్యులను నాదరణీయముగాని గ్రామ్యభాషను ఖండించి వ్యాకరణప్రయోజనంబును దృఢపఱుచుటయె కాక యింకను గొన్నివిశేషంబులు చర్చించి యార్యవ్యవహారంబు శ్రేయోదాయకంబని ప్రదర్శింపఁబడును.

## గ్రామ్యభాషాఖండనము.

శ్లో॥ సారశ్లేష విశేషచిత్రభరిణామోదాత్తసద్రూపకై।
ర్వ్యాఘాతవ్యతిరేకవద్భిరుపమిత్యన్యోన్యదృష్టాంతకైః।
ఏతైరర్థగుణైర్నరేణ ఘటితైస్సమ్యగ్గణో జృంభితై।
ర్నిర్దోషైర్వివిధైరలంకృతిగణైరమ్యో రసో రాజతే॥

(సాహిత్యరత్నాకరము).

ఉపమ, ఉత్ప్రేక్ష, సారాలంకారము మొదలగు నలంకారములును, మాధుర్యము మొదలగు గుణములును గవివాక్యములయందు ఘటిల్లినందున రసము విస్ఫురించి గ్రా

జెల్లుచుండునని పైపద్యముయొక్క భావార్థము రసప్రవృత్తిగలదియే వాక్యమని చెప్పం దగుఁ గాని రసహీనంబగుశబ్దంబు వాఙ్మాత్రంబునకు నర్థంబుగాదని "సాహిత్యరసప్రవృత్తిః" అను నాంధ్రశబ్దచింతామణియందలి ద్వితీయసూత్రము రసప్రాధాన్యము నుద్ఘోషించు చున్నది శ్లో॥ గుణాలంకారశ్రీకులపరికరో భావవిభవః! స్ఫురద్రూపోద్భావః క్రమగళితవేద్యాంతరమతిః। సుఖంవా దుఃఖంవావిషయతు యయానోస్వాత్మనయేత్య మందానందాత్మా పరిణమతి పూర్ణోరసభరః॥— అనియు, శ్లో॥ రసోవాక్యార్థస్సన్ విలసతి పదార్థాః పునరమీ విభావాద్యాయస్మిన్ కిల దధతి విశ్రాంతిముచితాం। అతో భావా ఏవక్రమ సముదితాన్యోన్యవ్యభిచరా రసీభావం బిభ్రత్యథచపటుతాం తంత్రపఠితః॥— అనియు, గుణాలంకారసంపదగల పదార్థసామగ్రియే విశిష్టరసోత్పత్తికిఁ బ్రధానంబని ప్రతాపరుద్రీయప్రబంధకర్తయగు విద్యానాథపండితుండును నిర్ణయించియుండెను. ఇట్లు తత్తద్రసోచితంబులగు వర్ణంబుల పొందికతో నింపగుపదంబుల మేళనంబునఁ గావ్యంబునకు జీవితస్థానీయమును బ్రహ్మసంప్రతిభటంబగు రసముదయించుచుండునని సర్వాలంకారికులును నైకకంఠ్యంబునఁ దమతమ తాత్పర్యంబులను జాటుచుండుట వీనులార వినుచున్నారము.

"శ్లో॥ మహాజనో యేన గతస్సపంథాః" యను న్యాయంబున మహాజనులుసంచరించునదియే మార్గంబుగాని యన్యంబు మార్గంబుగాదని స్పష్టపడుచుండఁగా వర్తమాన కాలంబున జనులకు సుబోధ్యంబయి లౌకిక యాత్రకుపయోగించుచుఁ బామరులను రంజించునట్టి గ్రామ్యభాషయే గ్రామ్యభాషయనియు, ప్రబంధభాష ప్రతిబంధభాషయనియుఁ గొన్ని వాక్యంబులు కర్ణగోచరంబులగుచున్నవి. గ్రామ్యభాష పామరులు సర్వదా వ్యవహరించునట్టి భాషగానున్నది, కాబట్టి యట్టిభాషనుఁ బామరులేసర్వదా శరణంబు. పండితులు పామరులతోడి సంబంధదోషంబుననో, శాస్త్రీయభాష పామరులకుఁ దెలియదన్న కారణంబుననో గ్రామ్యభాష కొంతయుపయోగించుచున్నను గవితారచనాది క్రియాకాలంబులయందు గ్రామ్యంబును దూరంబుగా నెంచి శాస్త్రీయంబగు భాషను నాదరించువారు గానున్నారు.

మనకాళ్ళను వ్రేళ్ళను బసుమ దుమ్ము మొదలగునపరిశుద్ధపదార్థములు మన గృహములయందుఁ జిరపరిచయంబుతో నున్నను సమయమువచ్చినప్పుడెల్లను వానిని సమ్మా

గ్గని వస్తువు (చీపురు) తోడుఁడిచి దూరముగా విడనాడుచున్నారముగదా! సస్యముతోఁ గలుపు మిక్కిలి బలిసి పెరుఁగుచున్నను దానిని బ్రయత్నపూర్వకముగాఁ బరిహరించుచున్నారము. పంకిలంబగు నుదకంబునఁ గతక రేణు(ఇండుపగింజ)సం బుపయోగించి పంకంబు నడఁగించు నిర్మలోదకంబును గ్రహించునట్లు, లోకవ్యవహారదశయందు నపశబ్దములు సుశబ్దంబులకంటెఁ బ్రబలానురాగంబును సంపాదించి తలయెత్తికొని విచ్చలవిడిగాఁ బ్రవర్తిల్లుచున్నను, యుక్తసమయములందు శాస్త్రజ్ఞాన ముపయోగించి వానినడఁగింప వలయునె కాని యెంతమాత్రము చెల్లనీయునట్లు పురికొల్పఁగూడదు.

లోకమున సర్వజనులు నానందమునకై ప్రయత్నించుచున్న సంగతి తేటతెల్లమేగదా! అట్టి యానందము సంపాదింపవలయునన్నచో గుణాలంకారాదుల పరిపోషణంబుగల కవివాక్కులనే మనము శరణమొందవలయును గాని యసభ్యశబ్దములవలన నది సాధ్యంబుగానేరదు. గ్రామ్యభాషకును రసంబునకును, (అనగా నానందంబునకును) నరకమునకు నాకలోకంబునకును గల యంతరంబు గలదు. గ్రామ్యభాషయనెడి నామంబుననే రసహీనత స్పష్టపడుచుండఁగా నట్టిభాషయె మూర్ధాభిషిక్తంబైనచో గురువులశిక్షితులైన పండితులపయినిఁ బామరులే యధికారమును జూపుచునుండుటకు నించుకైన సందియంబుండదు. ఈపామరులు (పా + అమరులు) పండితులపయినే కాక యమరుల కన్నను దమకుఁ బాకారమెక్కువ గలదన్న కారణంబునఁ దాము పాకారులమయితి మని (దేవేంద్రులము ఇతిని) విజ్రృంభించుచుఁ బాకారిస్థిన మెక్కినపక యమరులపయిని నయితము రాజ్యంబుసేయఁ జూతురని తోఁచుచున్నది. దేవానాంప్రియులు దేవతాసురుల నుభయులను సమానముగా నాదరింతురుగదా! వ్యాకరణశాస్త్రప్రయోజనం బుపన్యసించు ప్రకరణంబునఁ బతంజలిభగవాను డిట్లు నొక్కి వక్కాణించుచున్నారు. 'తస్మాద్బ్రాహ్మణేన నమ్లేచ్ఛితవై నాపభాషితవై । మ్లేచ్ఛో హ వా ఏష యదపశబ్దః। మ్లేచ్ఛా మాభూమేత్యధ్యేయం వ్యాకరణం।' మ్లేచ్ఛ అవ్యక్తే శబ్దే అని సిద్ధాంతకౌముదివ్యాఖ్యాతలయందు వ్రాయబడియున్నది. 'అస్పష్టే అపశబ్దే నేత్యర్థః' అనియు నర్థము వ్రాయఁబడినది. 'నమ్లేచ్ఛితవై ఇత్యస్యపర్యాయో నాపభాషితవా ఇతి' అని కైయటము. తవైప్రత్యయము కృత్యప్రత్యయము గాన నిచ్చటఁ గర్తవ్యార్థమును జెప్పును

బ్రాహ్మణునిచేత నపశబ్దము పలుకఁబడఁగూడదు. మ్లేచ్ఛుఁడనఁగా నపశబ్దము గాన నది యవలంబించినవాఁడు బ్రాహ్మణుఁడుగూడ మ్లేచ్ఛుఁడగును. అట్లు మ్లేచ్ఛులము గాకుండుటకై వ్యాకరణాధ్యయనము సేయవలయునని యర్థము. పైని వ్రాసిన భాష్యతాత్పర్యము చూడఁగా గ్రామ్యభాషావలంబనమున బ్రాహ్మణుఁడే మ్లేచ్ఛుఁడగునని స్పష్టపడుచున్నందున వేఱే మ్లేచ్ఛజాతి లేక మనమే మ్లేచ్ఛులమై శ్లో॥ ఏకత్త్రివానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా॥ యోషితో బహునక్తిశ్చేద్రసాభాసస్త్రిధామతః॥ అని నిర్ణయించిన యాలంకారికులకుఁగూడ సులభముగాఁ జేఁజిక్కి పైశ్లోకంబునఁ దిర్యగ్జంతువులతో సాహచర్యంబుగాఁ బరిగణింపఁబడి ప్వాంస్వంబునఁ దులఁదూఁగుచున్న మ్లెచ్ఛులకు దాహరణమై రసాభాసమున కాస్పదమగుదుము. మఱియు వ్యాకరణశాస్త్రప్రయోజన ప్రకరణమందే పతంజలిభగవద్వాక్యమిట్లు చాటుచున్నయది. "అథవాభూయాం సధర్మః ప్రాప్నోతి। భూయాంసో పశబ్దాః। అల్పీయాంసశ్శబ్దాః। ఏకైకస్యహిశబ్దస్యబహవో పభ్రంశాః। తద్యథాగౌరిత్యస్య శబ్దస్యగావీగోణీగోతాగోపోతలికే త్యేవమాదయో బహవో పభ్రంశాః! అథయో వాగ్యోగవిత్ అజ్ఞానంతస్యశరణం॥ శ్రు॥ సక్తుమివతితఉనా। పునంతో యత్రధీరా మనసావాచమక్రిత। అత్రాసఖాయస్సఖ్యానిజానతే। భద్రైషాంలక్ష్మీర్నిహితాధివాచి॥ లోకములో నొకశబ్దంబునకు దేశము, జాతి, కులము, పురుషుఁడు మొదలగుభేదంబులను బట్టి యనేకవిధంబుగా నపశబ్దంబులు ప్రయోగించుటవలన ధర్మముకంటె నధర్మమే యధికంబగుచుండుననియు, శాస్త్రచోదితమైన యొక 'గో' శబ్దంబునకు, 'గావి, గోణి, గోత, గోపోతలిక,' మొదలగు నపశబ్దంబులు పెక్కులు లోకవ్యవహారమునందుఁ గానవచ్చుచున్నవి యనియు, లోకములో బుద్ధిమంతులు పెంటతో మిళితంబైన పరిశుద్ధ ధాన్యములను జల్లెడతో జల్లించి విడదీయునట్లు వ్యాకరణవేత్తలు వ్యవహారమునందుఁ బాహుళ్యప్రాబల్యంబున నపశబ్దంబులతోఁ గలసిమెలసి యున్న సుశబ్దంబులను వ్యాకరణజ్ఞానమున వేఱుపఱిచి గ్రహించుచున్నట్టి బ్రహ్మప్రతిపాదక శబ్దమునందు భేదబుద్ధిలేక సమానజ్ఞానులయి సఖ్యంబుల నొందుచుందురనియు నట్టివారి వాక్కులయందే భద్రంబైల క్ష్మి నివసించుననియుఁ బైవాక్యంబులకు ఫలితార్థము. కాఁబట్టి యనేకగ్రంథప్రమాణంబులఁ బరిశీలించినను యుక్తియుక్తంబులగు వాక్యంబుల విమర్శించినను శాస్త్రమర్యాదకు వెలుపలైన గ్రామ్యభాష రసాభాసంబునకుఁ బుట్టినియి గర్హణీయంబుగాని గౌరవయోగ్యంబుగాదని స్పష్టపడుచున్నది. నాటకంబులందు

నీచపాత్రంబుల కుచితంబుగాన నీ గ్రామ్యంబునను గావలసినంత యవకాశమిచ్చి యుత్తమపాత్రంబుల యందుమాత్రము రిత్త సేయవలయును.

ఇంక నుత్తములు ప్రయోగించునట్టి సంభాషణంబుననే గ్రంథరచన చేయవలయునన్న యంశముగూడఁ గొంతచర్చించి చూతము.. 'శ్లో॥ శతేషుజాయతేశూరః॥ సహస్రేషుచపండితః' అను న్యాయంబునఁ బామరసంఖ్యకంటెఁ బండితసంఖ్య మిక్కిలి స్వల్పంబుగదా! పామరులతో సంబంధంబునంగాని, శాస్త్రీయముగా మాటాడినచోఁ బామరులు తెలిసికొనలేక నవ్వుదురన్న సిగ్గునంగాని పండితులును వ్యవహారమునందు నితరు లుపయోగించినంత గ్రామ్యంబు నుపయోగింపకున్నను నుత్తమువీఁద నపశబ్దంబులను సయితము క్రియాభాగంబులో వాడుచుందురు. లోకవ్యవహారమునందు నొకవేళ వ్యాకరణయుక్తంబుగా మాటాడినను నట్టిమాటలు రసవంతంబులైన యొక యుత్తమ గ్రంథంబును రచించుటకు నెంతమాత్రమును జాలియుండవు. వ్యవహారావస్థలో మనకు వలసిన వస్తువులను వాడుకొనుటకు నవసరము దీర్చునట్టిమాటలు వ్యాకరణయుక్తముగ నుపయోగించినంతమాత్రముననే మనము ప్రాఁజదువుల బ్రహ్మలమనిపించుకొందుమేని, మన గృహాధిష్ఠాని దేవతలయిన స్త్రీలుసయితము కొంచెము వ్యాకరణాంశము మనకంటెఁ బెక్కువగాఁగ నట్టి ద్రవ్యగుణక్రియలపేర్లను బ్రతిదివసంబును బ్రయోగించుచుందురు గాన వారునుగూడఁ జదువులసరస్వతీ దేవతలనియే చెప్పంబడియుందురు. ఇట్లు ప్రతి గృహంబును బ్రహ్మణీబ్రహ్మలతో నిండారుచుండును. కావునఁ నిట్టి పేలపిండివంటి పేలవంపుమాటలతో నిండిన నీరసగ్రంథంబులను నాకర్ణించినవారు కావ్యరసామృతంబును గర్ణపుటంబులతోఁ జాలాడి జుత్తైనవిబుధాగ్రగణ్యులగుదురని యెన్నిటికిని దలఁపఁగూడదు. మనముత్తములనుకొన్న జనులు మాటాడుభాషగూడ గ్రామ్యాంశసంకీర్ణమై గ్రాంథికశైలికి ననువుగా నుండనందున గురుకులవాసముచేసి సమార్జించిన సరస్వతీ కరుణాకటాక్షంబు ననుసరించియే గ్రంథంబులు రచియింపవలయునని సిద్ధాంతమగుచున్నది.

మఱియు, పతంజలిభగవానులు శాస్త్రీయములుగాని శబ్దంబులు ప్రయోగింప నర్హంబులు గావని భూవాది సూత్రభాష్యంబుననిట్లు వాక్రుచ్చి యుపసంహరించిరి. ఏతేషామన్వాఖ్యానవయత్వాది నివృత్త్యర్థః పాఠః కర్తవ్యః। కేషునాణవయత్వాదయః।

ఆజ్ఞాపయతి వర్ధయతీతి । శిష్టప్రయోగాదాజ్ఞాపయత్యాదీనాం నిష్పత్తిర్భవిష్యతి । సహావశ్యం శిష్టప్రయోగ ఉపాస్యః। యేపిపశ్యంతే తేషామపివిపర్యాసనివృత్త్యర్థః। లోకేహి కృషత్యర్థే కసిం ప్రయుంజతే। దృశ్యర్థే దిసిమ్॥ లౌకికవ్యవహారదశయందుఁ బ్రయోగించినంతమాత్రమున సిద్ధములైన "ఆజ్ఞాపయతి, వర్ధయతి" ఇత్యాదులును, కృషధాత్వర్థమందు "కసి" శబ్దంబును, దృశిర్ ధాత్వర్థమందు "దిసి" శబ్దంబును లౌకికులు ప్రయోగింపఁగా నట్టిశబ్దంబులును శిష్టసమ్మతములు గానందున శాస్త్రీయములు గావని తొలఁగించుటకై భూధాతువు మున్నుఁగాఁగల ధాతుపాఠోక్తధాతువులెల్లను నానుపూర్వీవిశేషంబుతోఁ బఠింపఁబడినవని పూర్వోక్తభాష్యతాత్పర్యము. ఈభాష్యంబును నాలోచింపఁగా గీర్వాణభాషయందుఁగూడ వ్యావహారికభాషాసాంకర్యంబున వికృతి సంభవించునో శిష్టప్రయోగంబులును వ్యాకరణాదులును బరిశీలించుకొని శబ్దదోషంబులు తొలఁగింపవలయునని తోఁచుచున్నందున నారీతినే శిష్టులయిన నన్నయభట్టారకాదిప్రయోగంబులును దత్ప్రణీతవ్యాకరణాదులును దెలిసికొని పామరబృందముచేతఁ బరిగృహీతమయిన రసాభాసభాషను బాఱఁద్రోలి సరసభాషావధూటీసారస్యంబునే రసికు లాస్వాదింతురు గాక!!

---

## అర్ధానుస్వారము.

అర్ధానుస్వారము తనకుముందున్న స్వరము (అచ్చు) ననునాసికమని సూచించు
టకు నిర్ణయింపఁబడినచిహ్నమయి యున్నది. సంస్కృతశబ్దంబులయందుఁగూడ "అభ్రి,
⌣ ⌣ ⌣ ⌣
ఆఆవః॥ ఉఁ ఇతి।విద్వాఁల్లిఖతి॥ సయ్యన్తా ఇత్యాదిశబ్దంబులయందు నర్ధచంద్రాకార
చిహ్నంబులు దేవనాగరగ్రంథంబులందు ననునాసికంబులయిన యక్షరంబుల శిరంబులప
యి వ్రాయఁబడుచున్నయవి. అనునాసికాక్షరము సూ॥ ముఖనాసికావచనో నునాసికః
అనుసూత్రప్రకారంబున ముఖనాసికం బుభయముయొక్క మేళనంబుతో నుచ్చరింపఁ
బడుఁ నదిగావ నట్టియక్షరముయొక్క పగముభాగ ముచ్చారణలో నాసికముఁ జెందిన
దని తెల్పుటకు పూర్వదృష్టిని దానిని సూచించుటకై యర్ధచంద్రాకారరేఖలను చిహ్నములు

గా నేర్పఱిచి యుండ వచ్చును. నాగరగ్రంథంబులయందు నక్షరంబులశిరంబులపయి నున్న యూరేఖలే యనునాసికములయిన తెలుంగువర్ణంబులలో వానిపార్శ్వంబునకుఁ గాలక్రమంబున జరిగియుండవచ్చును. అనునాసికాక్షరముయొక్క యుచ్చారణము ముఖంబునకును నాసికకును సమభాగంబుగాఁ జెందునని సూచించుటకేగాక వేఱొకలాభంబునకై కూడఁ దెలుఁగువర్ణంబుల పార్శ్వంబులయందే యర్ధచంద్రరేఖలు వ్రాసియుందురు. హ్రస్వంబులయిన యనునాసికాక్షరములతరువాత వైకల్పికముగా నిండుసున్నలు వచ్చునుకాన మునుపు నిరూపింపఁబడిన యరసున్నలే నిండుసున్నలగునని చదువరులకు సులభముగా బోధపడుటకై యట్లు గావించియుండవచ్చును. సున్న తెలుఁగుభాషలోఁ బార్శ్వమందును, సంస్కృతంబున వర్ణంబులశిరంబునందును వ్రాయుట సంప్రదాయంబుగా నున్నదిగదా?

తెలుంగుభాషయందువలెనే సంస్కృతభాషయందు సయితము విరళంబుగాఁ గొన్ని శబ్దంబులందు ననునాసికవర్ణంబులపయిని నిండుసున్నలు వచ్చుట శాస్త్రీయము గావున నర్ధచంద్రరేఖలు పూర్ణానుస్వారములుండునట్టి యక్షరంబులశిరంబులపయినే వ్రాయఁబడుట పరంపరగా వచ్చుచున్నదియని తోఁచుచున్నది. అట్టి శబ్దంబులెవ్వియనఁగా (1) సఁస్కర్తా సంస్కర్తా (2) పుస్కోకిలః, పుంస్కోకిలః (3) పుస్పుత్రః, పుంస్పుత్రః, (4) శార్ఙ్గిశ్ఛింధి శార్ఙ్గింశ్ఛింధి (5) చక్రిస్త్రాయస్వ; చక్రింస్త్రాయస్వ ఇత్యాదులందు|సూ|| ఆత్రానునాసికః పూర్వస్యతువా|సూ|| అనునాసికాత్పరోనుస్వారః|| అనుసూత్రంబులచే ననునాసిక పూర్ణానుస్వారంబులు వికల్పంబు ననుచున్నవియని పండితలోకంబునకు విశదముయినవిషయము. భాషయొక్కరీతి ననుసరించి తెలుంగులోఁ గొన్నిశబ్దంబులందే హ్రస్వంబు లనునాసికంబులై (అరసున్నగు ఉత్తులతోఁ గూడినవియై) వికల్పంబుగాఁ బూర్ణానుస్వారయుక్తంబులగుటయు, సంస్కృతంబులో, బైనిఁ జూపినరీతిని గొన్నిశబ్దంబులందు మాత్రమే యచ్చులనునాసికంబులై వికల్పంబుగా నిండుసున్నలగుటయు సంప్రదాయంబుగా నున్నయది. కాని సంస్కృతంబున నింకొక విశేషంబు కలదు. శ్లో|| ,,అమోనునాసికా నహ్రౌ| నాదినోహఝ్ఘశషస్మృతాః| ఈషన్నాదా యణో జశ్చ| శ్వాసినస్తు ఖఫాదయః.'' అను శిక్షావచనంబు నుదాహరించుచు నాదేశ [illegible] ఘోషయోః | న హ్యేత్యుప

లక్షణ మైచస్వర్వస్య ప్లుత ఇకారస్యచానునాసికస్యా దర్శనాదిత్యలం॥' అని శబ్దేందు శేఖరంబున నాగేశపండితుఁడు. అప్రసక్త్యాహారములో నివిమైనందునఁ బ్రాప్తించిన యానునాసిక్యధర్మంబును ప్లుత ఇకారంబునకును రేఫ హకారంబులకును. ఐ ఔ లకును, నిషేధించుచున్నారు తెలుఁగుభాషలో నట్లుగాక, 'పైఁడి, పైఁట, సైఁపు, సైఁనము, ఔఁగాక, కౌఁగలి, కౌఁజు, ఇత్యాదులయందు నైకారమునకును నౌకారమునకును గూఢ ననునాసికత్వము కానిపించుచున్నది. అనఁగా నర్ధానుస్వారములుండుచున్నవి. ఇంతియె కాక సంస్కృతంబునవలెనే తెలుఁగులో సయితము కొన్నిశబ్దంబు లర్ధానుస్వారము నొందినప్పుడే (అనఁగా అనునాసికధర్మము కలిగియున్నప్పుడే) యుక్తమయిన యర్థంబు నిచ్చుచుండును గాని యట్లుకానిచో విపరీతార్థమగుచుండును. "ఊఁ"॥ అనుశబ్దం బను నాసికమయిన సమయంబుననే ప్రశ్నంబును, కథయొక్క వినికిని, దెలుపుచున్నయది లేనిచో నిదియపార్థకంబగును, "ఆఁ, ఆఁ," అనుశబ్దంబునందు నాకారము అనునాసిక. మయినపుడే 'ఆఁగు' మన్న యర్థమునిచ్చును గాని యటుకానిచో విపరీతార్థమిచ్చును ఏఁచు, వెలుఁగుఁ పెరుఁగు, పాఁడి, యిత్యాదులలోనఁ బైనిజూపినరీతిగ ననునాసికము లయినపుడే క్రమముగా బాధించుట, కిరణము, వర్ధిల్లుట, క్షీరసంపద. యనునర్థంబుల నిచ్చును గాని యట్లుకానిచో వేఱొకయర్థంబుల నిచ్చును, మఱియు 'వచ్చెఁ గమలా క్షుఁడు, మెచ్చెఁ దాశరసాక్షుఁడు, ఇత్యాదిశబ్దద్వయసంధి స్థలంబులందును లోపించిన నకారముయొక్క గూఢానునాసిక్యమును సమీపస్థములయిన 'ఎ'కారములు తెలుపుననియే యట్టిచోటను నర్ధానుస్వారములు వాగనుశాసనులుచే వ్యాకరణంబున విధింపఁబడినవి. అర్ధానుస్వారము తెలుఁగునఁ దీసివేయఁబడెనేని లోపించిననకారముయొక్క యను నాసికధర్మమును సమీపస్థమయిన 'ఎ'కారము తెలుపకపోవలసి యుండును మేమట్టి స్థలంబులయందు సయితము నాసికాసంబంధముతో నుచ్చరింపమని పట్టునలతోఁ గొంద ఱుందురేని శాస్త్రమందు దయచేతను వారు పలుకవలయునేకాని యట్లుకానిచో నెవ రేమియుఁజేయఁగలరు. "సయ్యన్తా; సవత్సరః; పుల్లింగమ్: వి ల్లిఖతి' ఇత్యాదులందు ననునాసికములకు బదులుగా వచ్చినవిగాన నట్టిస్థలములయందలి యకార వకారలకారం బుల నాసికాసంబంధంబున నుచ్చరింపవలయునని శాస్త్రము బోధించుచున్నను నాయావ ర్గంబులకు నానునాసిక్య ముచ్చారణ శక్తిమకుఁ గారణము గాన మేము తీసివేయుదు

మనియుఁ బైసలంబులందు ముక్కుతోఁ గాక కేవలము ముఖంబుతోనే పలుకుదుమనియు నెవ్వరైన ప్రబుద్ధులు వితండవాదంబునకు డీకొందురేని వారిముక్కును బలాత్కారముగాఁ బట్టి పల్కించుట యెవ్వరితరమగును? అనునాసిక్యము లేదనియు, అరసున్న లేదనియు ఎవరే యెదుటువారి ముక్కును బట్టుకొని ప్రతిబంధిపఁ బ్రయత్నించుచున్నారుగదా? శాస్త్రవిశ్వాసముచేతను, లోపించిన యనునాసికాక్షరంబులగుణంబును భాషాశైలింజేసి యాదేశవర్ణంబులును సమీపస్థవర్ణంబులును దెలుపుట యుక్తంబగునన్న యుక్తిచేతను, మనసాక్షి బోధింపగాఁ బల్కవలసినదేగాని లేనియెడ నెవ్వరట్లుం చేయింప సమర్థులగుదురు? అరసున్న (లేక) యానునాసిక్యము లేదనినవారీ క్రిందిస్థలంబులయొద్ద నెట్టిసూత్రంబును బన్నుదురో యడుగుచున్నారము. బా. క్రి. సూ. 89 “ఖండబిందువుమీఁది సిద్ధచకారంబునకు ముత్తుపరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగా నగు” ఉదా. తలఁపక; త్రేఁపక, తోఁపక; అరసున్నలు లేనివారి మతంబునందు నెట్టిచకారంబునకుఁ బకారము రావలసియుండునో యెట్టిచకారమునకు॥ సూ॥ 88. ప్రకారమున వకారము రావలయునో తెలియక బుద్ధి డోలాయమాన మగుచుండును. అరసున్న యున్నయెడల ‘ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః’ అనున్యాయంబున శిష్యపరంపరాప్రవాహముగా వ్రాయఁబడుచున్న యర్ధబిందువుతరువాతిచకారంబును దెలిసికొని సూత్రమును సులభముగా నుపయోగింతురు.

గీ. ధామకలితుండనై శూరతరుఁడగునరుఁ
డొప్పెసఁగురుచిరయశో మహోదయతను।
రాఘవపాండవీయము. ద్వితీ. 80 పద్యము.

ఇట భారతార్థమందు సగురుచిర యశోమహోదయతిన్; ఘనమయిన చిరకీర్త్యతిశయములతోఁ గూడిన వాఁడవుటచేత; రామాయణార్థమందు, రుచిర యశోమహోదయతన్, ఒప్పెసఁగున్ అని వ్రాయఁబడినది. రామాయణార్థములోని యెసఁగు శబ్దములో నరసున్నయున్నందునను, భారతార్థములోని సాంస్కృతికసగురు శబ్దములో నరసున్న లేనందునను, బద్యపాఠసమయంబునఁ బరస్పరవిరుద్ధంబయినయను నాసికత్వానునాసికత్వగర్భంబు లొక్కమాఱుచ్చరింపఁగా శక్యంబులుగావండునను, నిట శ్లేషార్థమెట్లు సాగునని యెవ్వరైన శంకింతురేని సాధానచిహ్నంబుతో వినుండు అర

ఉన్న తనకుఁ బూర్వమందున్నయచ్చు, అనునాసికమయినట్లు గుఱుతని యావలిలో జెప్పియున్నాఁడను. కాబట్టి యొసఁగుశబ్దములోని 'అ'కారము నిత్యముగా ననునాసికముగాన నననునాసికము కానేరదు. కాని సంస్కృతమయినసగురుశబ్దములోని 'అ'కారము, అనునాసికముగూడఁ గావచ్చును. ప్రమాణము. 'అ, ఇ, ఉ, ఋ ఏషాం వర్ణానాం ప్రత్యేకమష్టాదశభేదాః' అని "ముఖనాసికావచనోఽనునాసికం, అనుసూత్రము క్రింద వ్రాయబడినది. యత్నపూర్వకముగా సర్వదాయనునాసికము కావలయునని యుచ్చరింపఁబడినయచ్చు, అననునాసికము గానేరదు కాని సామాన్యముగా నుచ్చరింపఁబడిన యచ్చునుభయంబును గావచ్చునని సంస్కృతవ్యాకరణశాస్త్రమందుఁ బారిభాషికంబుగా మర్యాద సేయఁబడినది. కాబట్టి యొసఁగు శబ్దములోని సకారము సానునాసికమయిన నుసగురు శబ్దములోని సకారము నిరనునాసికముగానఁ బన్యప్రాసమయంబున సకారము నిరనునాసికముగ నుచ్చరింపఁబడెనేని సానునాసికంబునకును గ్రహణంబు గలిగి రామాయణభారతార్థంబు లుభయంబును బొసంగును. ఇట్లు కిరణవాచకమైనవెలుఁగుశబ్దములోని లకారముమీఁదనున్న 'ఉ'కారము సర్వదా యనునాసికముగాన నననునాసికము కానేరదు గాని, యావరణవాచకమైన వెలుగుశబ్దములోని "ఉ" కారము నిరనునాసికమయినందున శాస్త్రంబున ననునాసికముగూడ గ్రహింపవచ్చును. కావుననే వెలుగుమొదలగు శబ్దంబులకు నానార్థంబులు చెప్పిన నిఘంటుకారుల వాక్యంబును సమంజసంబగుచున్నది. సామాన్యముగా నుచ్చరింపఁబడినవర్ణం బనునాసికంబును గావచ్చుటనుఁ బరిభాషేందుశేఖరములోని నూటతొమ్మిదవపరిభాషలో నిట్లు వ్రాయఁబడియున్నది, "అభేదకాగుణాః। అసతియత్నే స్వరూపేణోచ్చారితో గుణో భేదకోనవివక్షిత ఇత్యర్థః"॥ గుణశబ్దముచేతను దాత్తానుదాత్తస్వరితములేకాక యానునాసిక్యముగూడ నర్థమగుననుటకు "యుథాత్పృతీ మాస్తాపం చమా। అనునాసిక్యమేషామధికోగుణః"॥ అను పతంజలి భగవద్వాక్యంబు ప్రమాణంబుగాఁ బరిఢవిల్లుచున్నది. కావున నుపాయాంతరంబులేమింజేసి పైనింజూపిన సాంస్కృతికవ్యాకరణ సంకేతిత సంప్రదాయంబుననుసరించియర్థబింబువున్న శ్లేషస్థలంబులయందు నిట్లనుసరణమగునని యుభయభాషానిరంకుశమైనయగాధపాండిత్యముగల సూరకవీంద్రాదుల యభిప్రాయమగునట్లు స్పష్టమగుచున్నది. పైనింజూపిన భాష్యకారులవచనంబున సానునాసిక్యధర్మము గౌణధర్మము గాని ముఖ్యధర్మంబు గానందునఁ బన్యప్రతనపక్షు

యాంబున నట్టిధర్మంబును వివక్షసేయుచున్నను శ్లేషార్థంబునకుం గొంత కలుగదనియే నా తాత్పర్యము. ఇట్లు ప్రమాణంబులుచూపినను ననునాసికంబుల (అనఁగా నరసున్నల) నంగీకరింపనివారికి జలధారావస్థలోఁగాక శాస్త్రీయావస్థలో నాసికతోఁ బ్రయోజనం బులేనందున నది యున్నను లేనిదియై "ననిద్యతే ఆసికాస్థితి. యస్యాస్సా"॥ అనువ్యుత్ప త్త్యర్థమునుబట్టి నాసికాశబ్దంబు (లేనిది) మాత్రము తన్మతంబున సాధువయి యవయవం బు నిష్ఫలంబగుంగాక!!

---

## పూర్ణానుస్వారము.

ఉదా:—(1) వంక (2) కంచె (3) పంట (4) వంట (5) కొంత (6) కొంప ఇత్యాదులయందుఁ గచటతపలకు ముందున్న పూర్ణేందు బింబాకారము పూర్ణా నుస్వార మనంబడును. ఆబాలగోపాలమును జేరఁ బ్రతిష్ఠఁ గాంచినొంది విబుధులసంగూడఁ గడుపునిండాగఁ జేయుచుంతటి యానందంబును గొల్పంజాలుచుఁ గువలయంబునకుఁ గన్నులపండువయ్యెడి యీపూర్ణేందుబింబాకారము తెలుంగుప్రపంచంబున వెలుంగునొం దుచుండఁగా నిట్టి యాకారము నామమాత్రావశిష్టమేకాని విధిచోదితంబుగాదని తెలుం గున సున్నకు సున్న పెట్టునట్టి యాధునికవాదం బొకటియడరుచుండెడి. ఆవాదసా రాంశ మేమనఁగా:—

(1) అంకః (2) క్రౌంచః (3) ఘంటా (4) దంతః (5) కంపః, ఇత్యాదిస్థలంబు లందు నిట్లు ప్రథమావస్థలోఁ బూర్ణబిందువుండఁగా "అనుస్వారస్యయయి పరసవర్ణః" అనుపాణినిసూత్రంబునఁ (బనమన్యమునకలి) పూర్ణబిందువునకు యయ్ప్రత్యాహారము లోని వర్ణముపరమగుచుండఁగా సున్నకుఁ దత్పరవర్ణముయొక్క వర్గములోని పఞ్చమాక్షర ము నిత్యముగా నాదేశమగుననుటచేత (1) అఙ్కః (2) క్రౌఞ్చః (3) ఘణ్టా (4) దన్తః (5) కమ్పః, అని క్రమమున సంస్కృతభాషలో ఙ, ఞ, ణ, న, మ, లాదేశ ములగుచున్నవిగదా! అనఁగాఁ బూర్ణబిందువునకుఁ గంఠ్యములగు ( గుటురల్ ) క, ఖ, గ, ఘ, ఙ, లు పరమగుచో ఙ కారమును; తాలవ్యములౌ ( పలటల్స్ ) చ, ఛ, జ, ఝ, ఞ, లు పరమగుచో, ఞ కారమును; మూర్ధన్యములౌ ( సెరిబ్రల్స్ ) ట, ఠ, డ, ఢ, ణ, లు పరమగుచో ణకారమును; దంత్యములౌ (డెంటల్స్ ) త, థ, ద, ధ, న, లు పరమగుచో నకారము; ఓష్ఠ్యములౌ ( లాబ్యల్స్ ) ప, ఫ,

బ, భ, మ, లు పరములగుచో మకారమును, య, వ, ల, లు పరములగుచోఁ గ్రమముగాన
నునాసికములగు. య, వ, ల; లును నాదేశములగున (సున్నకు) నియర్థము.

“అంకః”—ఇచట బిందువునకుఁ గకారము పరమగుచుండఁగాఁ బరసవర్ణ
మువచ్చుననుటచేఁ గంఠ్యంబులై (గట్టురల్స్) కవర్గీయంబులైన యైదు వర్ణంబులును
(1) (2)
స్థానాభ్యంతరయత్నవశంబున సవర్ణంబులౌటం జేసి బిందుస్థానంబునఁ బ్రాప్తించుచుండిన
ను, “నాసికానుస్వారస్య” అని యానునాసిక్యగుణంబుగల( నేసల్) బిందువునకున
నట్టి గుణంబుగల యంతరతమ (సదృశతమ) వర్ణంబే యాదేశమై రాఁదగినది గావున
“యథాతృతీయాస్తథాపంచమా ఆనునాసిక్యవర్జమ్। ఆనునాసిక్యమేషా మధికోఽగుణః”
అను తుల్యాస్య సూత్రస్థభాష్య ప్రకారంబున ననునాసికంబులగు ఙ మ ఞ ణ న లై
దింటిలోఁ బ్రకృతంబునఁ గంఠ్యత్వాదిధర్మంబునఁ గకారమునకు సవర్ణంబును బా
హ్యప్రయత్నమైన యానునాసిక్యగుణంబునంజేసి బిందువునకు నంతరతమంబును (సదృశత
మంబును) నైన ఙకారమే యిట నాదేశమైన “అఙ్కః” అనురూపం బేర్పడెనని
యెఱుంగునది. ప్రకృతంబున నాదేశమైన ఙకారమందుఁ బరవర్ణమైన కకారమందలి

(1) (2)
కంఠ్యత్వంబును స్థానియైన బిందువునందలి యానునాసిక్యంబు నిట్టిధర్మద్వయంబును
నమరియుండుట స్పష్టముగనున్నది. ఇట్లే “క్రౌఞ్చః”-అనుచోటను బిందువునకుఁ బర

(1) (2)
వర్ణమైన చకారమందలి తాలవ్యత్వంబును స్థానియైన బిందువునందలి యానునాసిక్యంబు
నుగలిగిన ఞకార మాదేశమయినది.

[1] [2]
ఘణ్టా —ఇచట మూర్ధన్యత్వానునాసిక్యధర్మద్వయముగల ణకార మాదేశము.

[1] (2)
దన్తః—ఇక్కడ దంత్యత్వానునాసిక్యధర్మద్వయముగల నకారాదేశము.

[1] [2]

కమ్మేపః—ఇట బిందువునకు నోష్ఠ్యత్వాను నాసిక్యధర్మద్వయముగల మకారాదేశము.

ఇట్లు గీర్వాణభాషావ్యాకరణకర్తయైనపాణిని మునీంద్రుఁడు తన సంపూర్ణానుభవంబునంజేసి "అనుస్వారస్యయయి పరసవర్ణః" అనుసూత్రంబును రచియించి సంస్కృత పదంబులందలి బిందువునకు ననునాసికంబులగు పంచమవర్ణంబు లాదేశంబులుగా విధిచె. ఆసూత్రము సంస్కృతభాషానిమిత్తమే రచియింపఁబడినను యుక్తియుక్తమైన మన యనుభవంబును బరిశీలింపగాఁ దెలుంగుభాషయందుఁగూడ నల్లసూత్రం బుపయోగింప కతీరదు. తెలుంగువ్యాకరణమున సూత్రము లేదనుకొన్నను దెలుంగుభాషలో సానుస్వారంబులనుకొన్న ప్రదేశంబులందు ననునాసికముతో పంచమవర్ణంబుల పలుకుబడియే బలాత్కరించి యనుభవసిద్ధంబుగాఁ గానంబడెడి. అందున (1) వంక (2) కంచె (3) వంట (4) కొంత (5) కొంప—ఇత్యాదిపదంబులు (1) వఙ్క (2) కఞ్చె [3] వణ్ట [4] కొన్త [5] కొమ్ప—అని ఙ, ఞ, ణ, న, మ, లతో సంయుక్తములు సేసి లిఖింపవలయు. ఇట్లు పరుషసరళంబులకు ముందు సున్నలనుకొన్న ప్రదేశంబులెల్లఁ బంచమవర్ణంబులతో నిండియుండునని గ్రహించునది. మఱియు, పంచ, సంజ-ఇత్యాదిదంత్య చ, జ స్థలంబులందుఁ దాలవ్యమైన ఞ-కారము బిందువునకుఁ బరవర్ణములైన దంత్య చజలకు సవర్ణము గానందున నిచ్చట బిందువునకు ఞ కారము రానేరదు. అట్టి చ, జ, లకు దంత్యమైన నకారమే సవర్ణంబుగాన నట్టి శబ్దంబులు నకారయుక్తంబులుసేసి, పన్చ, సన్జ, ఇత్యాదివిధంబుగా వ్రాయవలయును. వఙ్క ఇత్యాదితెలుంగు శబ్దంబులు సంస్కృతపదంబులవోలె పంచమవర్ణయుక్తంబులు కానసే యీవక్ష్యమాణంబులగు నాంధ్రకవితాపితామహాది ప్రయోగంబులు సంగతము·లగుచున్నవి:—

(1) ఉ॥ అఙ్కముఁజేరి శైల తనయాస్తన దుగ్ధము లానువేళ బా
ల్యాఙ్కవిచేష్టఁ దొండమున నవ్వలిచన్గ బళింపఁబోయి యా
వఙ్కఁగుచంబుగాన కహివల్లభహారముఁ గాంచిలే మృణా
ళాఙ్కురశంక నంటెడుగజాస్యునిఁగొల్తు నభీష్టసిద్ధికిన్॥

మను ౧అ

(2) ఉ॥ పాణ్డవ వంశవర్య పటుపాపవినాశని యైనయిక్కథన్
నిణ్డుమనంబుతో వినుట నీవు కృతార్థుఁడ వైతిశాశ్వతా
ఖణ్డసుఖాత్మనిష్ఠ నధిక స్థిరభక్తి సమాశ్రయింపు నీ
కొణ్డొకఁడేల యిమ్మెయి మహోన్నతిఁజేయు జగత్త్రయంబునన్॥ భార-
శాం ౯, ఆ

మొదటిపద్యమునందు (1) అఙ్క (2) అఙ్కుర, ఇత్యాదిపదంబులందుఁ బైని నుదాహరించిన సాంస్కృతిక వ్యాకరణసూత్రమననుసరించి ఙకారము తప్పనందునఁ బ్రాసస్థానంబున ఙకార కకారసంయోగంబుండకతీరదు. వఙ్కశబ్దంబు తెలుంగు శబ్దంబైనను సాంస్కృతిక భాషాసంప్రదాయానుసారంబుగాఁ బ్రాసస్థానమందు ఙకార కకారసంయోగంబు గల్గినందుననే సంయుతప్రాసంబునఁ బద్యంబు శాస్త్రీయమై సమంజస మగుచున్నయది. అట్లె రెండవపద్యమునందుఁ బాణ్డవేత్యాదిశబ్దములందుఁ బాణినీయ వ్యాకరణంబున ణకార డకారసంయోగంబు ప్రాసస్థానంబున నుండకతీరదు. నిణ్డు' ఒణ్డు, ఈ తెలుంగుశబ్దంబులందును సాంస్కృతికవ్యాకరణ సంప్రదాయంబున, ణకార డకార సంయోగంబుండినందుననే నాల్గు పాదములయందును సంయుతప్రాసంబైనందున బద్యంబుశాస్త్రీయంబై రమణీయంబగుచున్నయది. ఇట్లేతక్కిన వర్గాక్షరములయందును నూహించుకొనునది. అని యిట్లు కొందఱు తమవాచోయుక్తులు విజృంభింపఁ జేయుదురుకాని యీమతంబు నన్నయభట్టారక తిక్కనసోమయాజి ప్రభృతి సకలవిద్వద్వరేణ్యులకును సమ్మతంబుగాదు. పంచమవర్ణంబులు రాక తెలుంగుశబ్దంబులందు బిందువులే నిల్చునని ప్రాచీనులతాత్పర్యంబు. పైనిం జూపినపద్యంబులయందుఁ బ్రాసంబెట్లుసంగతంబందు రేనివినుండు. పైపద్యంబున, ‚‚అఙ్కము" ‚.అఙ్కుర" ఇత్యాదిశబ్దంబులయందు

(1) (2)

బ్రాసస్థలంబున నానునాసిక్య కంఠ్యత్వధర్మద్వయంబుగల ఙకారంబును వెంబడించి కేవల

1)

కంఠ్యత్వధర్మంబుగల కకారంబునివ్వటిల్లుచున్నది. అనఁగాఁ బ్రాసస్థానీయమైన ‚‚ఙ్క' అనునట్టి విశిష్టమందు నానునాసిక్యం బొకధర్మంబును గంఠ్యత్వధర్మంబులు రెండును గల్గియుండుట స్పష్టమగుచున్నయది. ఇటఁ బ్రాసస్థానంబున నొకయానునాసిక్యంబును ) ద్విగుణకంఠ్యత్వంబును దేజరిల్లుచుండు. (హియర్ ఇన్ది ప్లేస్ ఆఫ్ ప్రాస (ఙ్క'

దేరిజ్ వన్ నేసల్ సౌండ్ ఎండ్ టు గటురల్ సౌండ్స్) ప్రాచీనుల మతం బున "వంక" అనునట్టి తెలుంగుశబ్దంబున సాంస్కృతికసూత్రము ప్రవర్తిల్లక పంచమ వర్ణము రానందునఁ బ్రాసస్థానమందలి బిందుపూర్వక కకారమందు(ంక) నాను నాసిక్య ధర్మమొక్కటియు(బిందువునందు) కంఠ్యత్వధర్మంబొక్కటియు (కకారమందు) వర్తి ల్లుచుండు. (హియర్ ఇన్ది ప్లేస్ ఆఫ్ ప్రాస (ంక) వన్ నేసల్ సౌండ్ అండ్ వన్ గట్టురల్ సౌండ్, అనఁగా నేకాన నాసిక్యంబును ద్విగుణకంఠ్యత్వంబునుగల 'ఙ్క' అనుశబ్దముకంటె, నేకాను నాసిక్యమును నేకకంఠ్యత్వమునుగల 'ంక' అనుశబ్దం బొకకంఠ్యత్వధర్మంబునఁ దక్కువయగుటస్పష్టపడుచుండుఁగాన నిటనెట్టు ప్రాసంబుచెల్లు నని యాధునికులగు కొందఱితాత్పర్యము. కాని యిచటఁ గంఠ్యద్విత్వంబులోనొక్కటి తగ్గినంతమాత్రమునఁ బ్రాసభంగంబు రా నేరదనియేప్రాచ్యులయభిప్రాయము: ఇటస్థాలీ పులాకన్యాయంబున నీక్రింది భాగతప్రయోగంబు ప్రమాణంబుగాఁ జూపెద:—

ఉ॥ క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గాఁవగఁ బుట్టినవారు బ్రాహ్మణ । క్షత్త్రియ వైశ్యశూద్రు లనఁగాఁగల నాలుగుజాతులన్ స్వధా । రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితి గాచినయట్లు రామామాం । భాసిరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె? యేయుగంబునన్॥ భా-ఆది ౨ ఆ: ॥శ్లో॥ సక్షత్త్రియస్త్రాణసహస్సతాంయః । క్షత్కార్ముకం కర్మసుయస్యశక్తిః। వహన్ ద్వయీంయద్యఫలేర్థ జాతే । కరోత్యసంస్కార హతామివోక్తిమ్॥ కిరాతార్జు నీయము. 3 స:—ఈభారవి కవికృతశ్లోకమందలి క్షత్త్రియశబ్దంబునకు "క్షతాత్ త్రాయతేక్షత్త్రమ్" అనియు, క్షతః (క్విప్రత్యయాంత పంచమ్యంతము) త్రాయతే క్షత్త్రమ్ (క్షత్త్రియగులం) అనియుద్వివిధంబుగా ఘంటాపథవ్యాఖ్యయందు వ్యుత్పత్తి వ్రాసి తజ్జాతియందుఁబుట్టినవాఁడుగాన క్షత్త్రియుఁడని (క్షత్త్రాద్ఘః అ ౪ పా ౧ సూ ౧౩౮) మూలకాగుని యభిప్రాయము వెల్లడింపఁబడియె. కావున భారవిప్రముఖసమస్త కవులమతమందును క్షత్త్రియశబ్దమందుఁ దకారద్విత్వంబుతప్పదు. అందునఁ బైపద్య ములోఁ బ్రథమద్వితీయపాదములందుఁ బ్రాసస్థానమున "త్త్రి" అనుచోటున. దకార ద్విత్వంబు అనఁగా ద్విగుణదంత్యత్వంబుండక (డబల్ డెంటల్ సౌండ్) తీరదు. (క్షత్ + త్ర). మూడవపాద ప్రాసస్థానములోని చారిత్రపదమందలి త్రశబ్దమునందు "అనచిచ" అను పాణినీయసూత్రమునఁ దకారద్విత్వమును పొందఁగాఁజాలదనను, నాల్గవ

బోరయునవియుఁ| గలసి యనునాసికప్రాసములను బేర |న. మ. లమరుఁగావ్య మం ల యంపుఁతమకుఁదాము'' అని శాసించుచున్నారు. స్థిరమైననకారము మకారమును పరమగు చో బూర్వనకారమునకు బిందువు సయితము రాఁదగునన్న మతంబున నిట్లు లక్షణపద్యము రచియింపఁబడియె. (సంధిపరి [19] సూత్రవ్యాఖ్యలోఁ జర్చించినయంశమును జూడుఁడు) కం|| తమ్ములను మల్లికాకుసు| మమ్ములమరువాదిపత్రిమాలికలను భ| క్తిం మురసంహరు పూజలు| సమ్మదమునసలుపఁ గలుగు సకలార్థమ్ముల్. కం|| ఇమ్మహిని మునులచేవెల| సెంగును కావ్యములు "నానృషిఃకురుతే కా! వ్యమ్మనువచనార్థంపుణ| సమ్మతిఁగలివేళ సకవిజనులేమానుల్|| [అప్పకవి] ఇట మొదటిపద్యముయొక్క తృతీయపాదమందలి ప్రాసస్థానంబునను రెండవపద్యములో ద్వితీయపాదప్రాసస్థానంబునను నుండఁదగిన యోష్ఠ్యస్వోష్ఠ్యములో [illegible] నొకటి తక్కువయైనను నవివక్షం జేసి యనునాసికప్రాసమను పేరున ప్రాసంబు విధింపంబడియె.

ఇకఁను ప్రాసస్థానములోని "జ్క" అనుశబ్దంబు సంయుక్తంబును, వేఱొక ప్రాసస్థానమందలి "ంక" అనుశబ్దంబసంయుక్తంబును నగుచుండఁగా, సంయుక్తాసంయుక్తంబులకు నెట్లుసంయుక్తప్రాసంబు చెల్లునని శంకింపఁ రేని వినుండు. [1] అనుస్వారము [ం] [2] విసర్గము (ః) (3) జిహ్వామూలీయము (ంక) [4] ఉపధ్మానీయము (ఃప) "అఇఉణ్" సూత్రములో, అకారము తర్వాతను శర్వర్ణముల మధ్యమందును [శ, ష, స] పఠింపవలయునని "హయవరట్" సూత్ర భాష్యమందు నుద్ఘోషింపంబడియె. అట్లుపఠించుటం జేసి యను స్వారాదులచ్చులనియు హల్లులనియుఁగూడ శాస్త్రంబున వాడంబడును. ఉపధ్మానీయము (ఃప) హల్లుగూడ నైనందులకు ఫలంబిట్లు మహాభాష్యంబున నక్కాణింపఁబడియె. "ఉః జ" (ఆర్జవే) అనుధాతువునకుపధ్మానీయ ముపధ ( )గాన నట్టి యుపధ్మానీయము నకు "ఝలాంజశ్ ఝశి" అనుసూత్రంబున "బ" కారంబు రాఁగానైన సుబంతం "ఉబ్జకః" అనియుండు. దీనికి సంబోధనాంతము "ఉబ్జక3!" అనియగును. (ఇట మూ (డంకెప్లుతమునకు గుఱుతు.) (ఇచ్చట "గుర్గోరనృతో నంత్యస్యాప్యేకైకస్యప్రాచామ్ "అ ౮ పా ౨ సూ ౮౬) అనుసూత్రమున బకారజకారసంయోగమునకు ముందుండి గురువైన యుబ్జకశబ్దమందలి యు [ఉ] కారము నప్లుతంబునచ్చునని యుదాహరించి

పిమ్మటను "పూర్వత్రాసిద్ధమ్" అనుశాస్త్రము ననుసరించి, పూర్వంబైన ప్లుతంబుచేయు నట్టి సమయంబునఁ బరశాస్త్రోద్దేశమైన బకారంబసిద్ధంబుగాఁగా బకారస్థానియైన యుపధ్మానీయంబే యుదాహరణమందుఁ గనఁబడుటంజేసి హల్ సంయోగమునకు ముందున్నయు [ఉ] కారము కానందున నియ్యది గురువుగావలెయు నందువఁ బ్లుతంబు రాదనియుఁ బతంజలిభగవానులు శంకించుకొని శర్వర్ణంబుల (శ, ష, స) మధ్యమందుఁ బఠింపఁబడి నందున నుపధ్మానీయానుస్వారాదులు హల్లులనియు నిట నుపధ్మానీయ జకార సంయోగంబునకు ముందుండుటంజేసి గురువగుచున్న యుబ్జకశబ్దము మొదటి యు [ఉ కారమునకుఁ బ్లుతంబు నిర్బాధమనియు సమాధానంబుచెప్పిరి. అట్లే ప్రకృతంబునను, ననుస్వారము శర్వర్ణములనడుమను [శ, ష, స] బఠింపఁబడుటంజేసి హల్వర్ణంబు గావున "ంక" ఇత్యాదులయందలి బిందుకారాదుల సంబంధము సంయుక్తంబై యన్యపాదములయందలి జకారకకారాది సంయుక్తంబునకుఁ బ్రతిబంధకంబగుచుండ సంయుతప్రాసంబునకుఁ బైపద్యంబులందు భంగంబు కలుగనేరదు. అనుస్వారము హల్లుగావుననే బిందుపూర్వకమైన యీక్రింది ధకారాదిప్రాసంబులు, ఈహకారమకారాది సంయుక్తములు వోలె సంయుక్తంబులైనందున వానికి ముందక్షరములు [అనఁగాఁ బాదాదివర్ణంబులు) హ్రస్వంబును దీర్ఘంబునుగూడఁ గావచ్చును.

ఉదా:—కం॥ అంధునకుఁ గొఱయె వెన్నెల। గంధర్వాంగనల పొందుగాదని సం
సా। రాంధువునఁ గూలెదకట। దివాంధము వెఱఁగుగని గొంది నడఁగినభంగిన్॥ మను
౨ ఆ:

కం॥ బ్రాహ్మణుఁడింద్రియవశగతి। జిహ్మపరసైకనిపుణచిత్తజనితతా।జిహ్మాగము
లపాలై చెడు। బ్రహ్మానందాధిరాజ్యపదవిముక్తుఁడై॥ మను 3 ఆ.

ఆ॥ వె॥ క్రిందజడ్డలును బిలుంపబిందువులును। నూఁదప్రాసములనుండెనేని।
హ్రస్వమొకటినిడుదయక్కరంబొక్కటి। వాని మొదలనిలుపవచ్చునెందు॥ అనిలక్షణగ్రంథంబులయందు బిందువులను విశేషించి పేర్కొనుట యక్షరోద్దేశపక్షగ్రాహులకు స్పష్టార్థమేకాని వేఱేప్రయోజనంబులేదని తెలియునది.

ఇచటఁ గొందఱు బుద్ధిమంతు లిట్లు శంకింతురు:—పైనిజూపఁబడిన భారతాది పర్వగతపద్యములయొక్కపాఠంబు "మాం। ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాంచిరె

రేఫయుగంబునకే॥" అని యిట్లు మాంధాతృశబ్దపాఠంబు ఋకారముతోనే యుండవలె యును గాని "మాం॥ ధాత్రిరఘుక్షితీశులు" అని త్రాకారపడితోఁ బఠింపఁగూడదు. కావు ననే యప్పకవి "వ॥ మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది వట్రువసుడిగాని త్రాకారపడిగాదు" అనియుద్ఘోషించును సంయుతాసంయుత ప్రాసంబునొద్ద నీపద్యమును ఋకారాంతమాంధాతృశబ్దపాఠముతో నుదాహరించెంగదా కాఁబట్టి పద్యములోని "మాంధాత్రిరఘుక్షితీశు" లన్న యభూతపూర్వపాఠంబును బరిష్కరించుకొని పూర్వోద్దిష్టంబయిన వాచోయుక్తిపాటవప్రకటనంబు వృథాప్రయాసంబేకాని వేఱొకటిగాదని కొందఱవాంతరశంక శంకించెదరు. అటులనవలదు. మేమీ వఱలో సమాసపరిచ్ఛేదములోని (24) సూత్రమునొద్ద నీపద్యముదాహరించి ప్రకృతంబున వక్తవ్యాంశము శబ్దసాధుత్వనిర్ణయంబేయని యెంచుకొని ఋకారయుక్తపాఠంబును రేఫయుక్తపాఠంబును నుభయంబును వ్యాకరణప్రకారంబునసాధువులని స్థూలదృష్టిని "తుష్యతు దుర్జనః" అను న్యాయంబున సిద్ధాంతము చేసితిమిగాని పద్యలక్షణంబునకు భంగంబుగలిగింపకుండ నేపాఠము సాధ్యముగానున్నదో నిశ్చయించి ప్రదర్శించుట యవశిష్టంబైనది. ప్రకృతవక్తవ్యాంశంబునకుఁ బెక్కులుదాహరణపద్యంబులున్నను "ఏకక్రియాన్వర్థకరీబభూవ" అను న్యాయంబున రేఫయుక్తపాఠంబే పద్యలక్షణంబునకు సమన్వయంబుగా గానున్నదని చర్చాపూర్వకంబుగా నిశ్చయించుటకుంగూడ నా పద్యమే యిప్పటి వక్తవ్యాంశంబున కుదాహరించితిమి. కావ సావధానమనంబున నాకర్ణింపవలయు. తే. గీ. రలలు తమక్రిందజడ్డలై క్రాలుఁ, వ్రాలు। ప్రాసవర్ణంబులైవాని బాసియైనఁ। గూడియైనను బెంపడుకలను నిలుమ। సంయుతాసంయుతప్రాససంజ్ఞఁదనరి॥ ॥ అప్పకవీయము 3 ఆశ్వాసము॥ అర్థము, త్రావడితోఁగాని లేక లావుడితోఁగాని సంయుతములైన హల్లులతోఁ గేవల (అసంయుతములు) హల్లులుగూడఁ బ్రాసంబులుగా నుండఁదగునని ఫలితార్థము.

పైలక్షణపద్యంబునూపి భారతములోని ప్రకృతపద్యంబును ఋకారయుక్తమాంధాతృశబ్దముతో రేఫసంయుతమునకు నిటు లుదాహరణముగానిచ్చె.:—

ఉ. క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రులనఁ గాఁదగునాలుగుజాతులన్ స్వచా

రీత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితుఁ గాచినయట్లు రామునో
ధాత్రిరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె? యేయుగంబునన్. భా. ఆది-౨ ఆ.

ఈపద్యమునందు "క్షత్త్రియ, చారిత్ర" అని తక్కిన పాదములందుఁ బ్రాసము రేఫసంయుక్తంబై నాల్గవపాదమునందు "మాంధాత్ర" అని రేఫహల్లుతో సంయుక్తముగాక కేవలమును బ్రాసతకారము బుకారాచ్చుతో నున్నను వైలక్షణపద్యము ననుసరించి ప్రాసంబుచెల్లునని యప్పకవి తాత్పర్యము. ఈపద్యము రేఫశ్లిష్టమునొద్ద నుదాహరించుట కేవలముఁ బ్రమాదాయత్తము. రేఫయుక్తాక్షరము రేఫహీనాక్షరమును బరస్పరముఁ బ్రాసముగా నుండఁదగియున్నను "క్షత్త్రియ, చారిత్ర" అని హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారముతో "మాం| ధాత్ర" అనుచోటున సంయుక్తముగాని తకారము దీర్ఘపూర్వకంబై యెట్టులు ప్రాసంబుగా నుండ జాలును? ఆ. వె. క్రిందజడ్డలును బిలుందబిందువులును| నూఁదిప్రాసములను నుండెనేని| హ్రస్వమొకటి నిడుదయక్షరంబొక్కటి| వాని మొదల నిలుపవచ్చు నెందు|| అను లక్షణపద్యము ననుసరించి సంయుక్తప్రాసంబునను బిందుపూర్వకప్రాసంబునను బూర్వమందే హ్రస్వదీర్ఘనియమము లేక యచ్చు నిలిచియుండవచ్చును గాని సంయుక్తముగాని కేవలప్రాసాక్షరమునకుఁ బూర్వమున నటులుండఁగూడదని లక్షణము చాటుచుండఁగాఁ బ్రకృతంబున "క్షత్త్రియ," ఇత్యాదులయందు హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారప్రాసంబునకు "మాం| ధాత్ర" అను నాల్గవపాదమందు సంయుక్తముగాని కేవల తకారప్రాసంబు దీర్ఘపూర్వకంబై ప్రతిష్ఠటంబుగా నెట్టులుండఁజాలును? ఒకవేళ గీ. రలలుతమక్రింద జడ్డలైక్రాలువ్రాలు...|| అనునదివిధి "ఆ. వె. క్రిందజడ్డలును బిలుందబిందువులును...," అనునట్టివిధిని సయితము బాధించి ప్రవర్తిల్లును గాన నిటుదీర్ఘపూర్వకమైన యసంయుక్తతకారము హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారప్రాసంబులు బ్రతిఘటించి ప్రాసంబుగా నుండవచ్చునందు రేని యటులు వచింపఁగూడదు.

శా. నాతో మార్కొనలేరు నిర్జరపురీనాగేంద్ర బృందారకా
రాతుల్సన్నగ దేవసంఘములు పోరన్ ధీర సంగ్రామ కుం
డీ త్రైలోక్యమునందుఁ గల్గఁడు రణంబీపోటు లేకుండఁగాఁ
జేతుల్వేయును బృథాభరంబగుమవచ్చెన్ దేవ యీమేనికిన్. (హో మునిహరివంశము.

గీ. వాక్త్రినేత్రాంగసాశచీశక్తులధిక । సంభ్రమంబునఁ గుంభనికుంభదైత్య [కలిడి.
హంత్రిఁబూజింపుదురత్ర యామంత్రములను । స్తోత్రములుచేసి మంగళారాత్రి

శ్రీ వేదాంతదేశికాంఠయనమః. (దేవీవిజయము.

ఇత్యాదిసోదాహృత పద్యంబులందే దీర్ఘపూర్వకంబులును, సంయుక్తంబులును; బిందుపూర్వకంబులు నైన ప్రాసస్థలంబులలో సావకాశమైనట్టి ౹౹గీ. రలలు తమక్రింద జడ్డలై క్రాలుర్వాలు॥ అనునట్టివిధి చరితార్థమైనంౘున ఆ॥ వె॥ ౹౹క్రింపజడ్డఁను బిఱుంద బిందువులను॥ అనెడివిధి నెట్టులు బాధింపఁజాలును? కాఁబట్టి ౹౹మాం। ధాత్రరఘుక్షితీశులు ముదంబున గాంచిరే? యేయుగంబునన్'' అను రేఫయుక్తమే పద్యలక్షణానుకూలంబుగానట్టిపాఠంబే ప్రశస్తంబు. ఈ ౹౹మాంధాత్ర'' పద్యంబునఁదక్కినపాదత్రయంబునందలి ప్రాసములు హ్రస్వపూర్వకంబులైనను జతుర్థపాదంబున దీర్ఘపూర్వకంబైనను సర్వత్రసంయుక్తస్థలంబుగానఁ బూర్వోక్తవిధిచేతను నిర్బాధంబని యెఱుంగునది. ఈసమస్తము ప్రశస్తముగా నవలోకనము సేసియేయడిదము సూరకవి ౹౹గీ॥ ధరబుకారాంత శబ్దంబు ద్వంద్వమైన। రేఫమగుమఁ బిత్రర్థిల్లు దృఢముగాను। పత్రిపరహాయ వాగ్వధూస్నేత (వాగ్వధూనేత్రు-వాణీపతి) ముఖసు। రాభివందితపాదాబ్జయన్నయట్లు'' కవిసంప్రథమ 28 ల అనుపద్యలక్షణంబునకుఁ బ్రకృతపద్యములోని మాధాంతృశబ్దంబు రేఫాదేశయుక్తంబగుట యుక్తంబుగా నెంచి యుదాహరణముగా నిర్దేశించె. కావున నట్లు ఖండించి నిశ్చయించిన యడిదము సూరకవీంద్రునియభిప్రాయంబే చెడిపంబై ప్రబలినందులకు నెంతయు సంతసించుచున్నారము.

ఈ ప్రకరణమందే, శా. లోకత్రాణరతిందదాదిను మహీలోకప్రవేశోత్కభా। సాక్ప్త్రప్రథమద్వితీయపద......అను రాఘవపాండవీయములోని పద్యమందలి ద్వితీయప్రాసంబును లకారశ్లిష్టమున కుదాహరణముగా నితెండు సూపుటయు నేఱొక ప్రామాదంబు. "బుదుపథాచ్ఛ్కపిచృతేః" (అ 3 పా ౧ సూ ౧౧౧) ఇత్యాది సూత్రంబులవలన నయ్యది యచ్చుగాని హల్లుగాదు మఱియు నితండు కవికర్ణరసాయనములోని పద్యంబును బ్రమాణముగాఁ జూపి మాంధాతృశబ్దంబునఁ గ్రాపడినిషేధించును బుకారాంతమని సాధించుట ద్వంద్వసమాసమందు బుకారాంతములకు రేఫాదేశము ప

నన్నయంశము మఱచినట్లు తోఁచుచున్నది. కావనే యీమాంధాతృశబ్దంబు భారతరచనా సమయంబున ఋకారముతో నున్నదనియుఁ బూర్వోక్తరాఘునపాండవీయపద్యపాదప్రాసంబు లకారశ్లిష్టమనియు భ్రమియించి యేతత్కవిప్రయోగమూలకంబుగా రేఫలకార సంయుతప్రాసంబులు కేవల హల్లులతోఁగూడ హ్రస్వపూర్వకత్వ దీర్ఘపూర్వకత్వాదిసకల నియమముల నుచ్ఛేదించి యథేచ్ఛముగాఁ బ్రాసములై యుండవచ్చునని యెంచి యీకవి "గీ॥ పాఁడిద్రచ్చఁగనిమ్ము నాతండ్రికన్న! । పేఁడుకొనియెద నందాఁకఁ బండ్లుదినుము" అని తేటగీతిని రచియించి యుదాహరణముతోఁ బ్రకృతాంశమును వికృతంబుగాఁ దేటపఱుచుచుండె. కాఁబట్టి ప్రమాదబాహుళ్య భూయిష్ఠంబైన యీప్రకరణంబున నితం డుదాహరించిన ఋకారయుక్తపాఠంబు భ్రమాస్పదంబనియు స్వవాదంబునకు ముఖ్యాధారంబగు రేఫయుక్తమాంధాతృశబ్దపాఠంబే ప్రమాణంబనియుఁ బ్రకటించుటకై ప్రసక్తానుప్రసంజన వశంబున నింతవఱకుఁ జర్చింపఁబడియెంగాన నిఁక విస్తరంబుతోఁ జాలును.

(2) అథవా, బ్రహ్మం బుపాదానకారణంబుగాఁగల యీప్రపంచంబు తత్త్వవేత్తృదృష్టికిఁ గనంబడక కారణమైన బ్రహ్మంబే భాసిల్లునట్టులు. అనుస్వారం బుపాదానంబుగాఁగల పంచమవర్ణంబాంధ్రతత్త్వవేత్తలదృష్టికిఁ గానిపింపక కారణమైనయనుస్వారంబే యలరారుచుండెనని యూహించెద. మఱియు నేకకారణంబుంగలదని నే
1 2 3
నెంచెదను. అవర్ణాతీతమయి, సద్వృత్తరూపరేఖావిలాపంబున నేకజన్మంబెత్తి ముక్తా
4 5 6
త్మయైన యనుస్వారం బడుగిడినచోటునఁ బంచమవర్ణంబులై వికృతరూప రేఖావిలాసంబునఁ బలుపుట్టువులు (ముఖనాసికం బుభయమున జనించినవి) పుట్టి యంతేవాసులైన (మాతంగజాతీయములును, వర్గాంత్యములును) ఙకారాదులం జొనుపుట యర్హంబుగాదని యాంధ్రవిద్యావిశారదులైనబ్రహ్మణ్యులు సంశయించివానిని బహిష్కరించిరి. పూర్ణంబైన యాలోకంబు (నిండువెలుంగు=బ్రహ్మము) చింతించి యాత్మోపకారం బగునని యెన్నిన పరిజ్ఞాతలు నిష్ఫలంబైన యీలోకంబును సేవగించి వట్టులు గుణత్రయాతీతులైరి (బ్రాహ్మణ్యప్రియత్నములుగల) (ముముక్షు) లుంగరయైన (నాసికయందు గాఁగినపని భాగము) పూర్ణానుస్వారంబునన్నే స్వకార్యసాఫల్యంబగుననియెంచి దానియుపాసనంబున

నూరి యాంధ్రభాషారహస్యవేత్తలు సర్వదా లోకులనోళ్లఁబడుచుండెడి (ముఖస్థానాభ్యంతరప్రయత్నవంతములైన) యీయంత్యవర్ణంబులం బాటించరోత్రిరిగాని యంతటిపరిపూర్ణులు వీని గుట్టుమట్టులు జాడం గట్టఁజాలకపోయిరి యని యనంగూడదు.

చకారాదివర్ణంబులాదేశంబు కాకుండనే యనుస్వారమాత్రమునఁ దెలుంగునఁ గార్యసాఫల్యమెట్టులగునని వారుతలంచిరో వినుండు.

(1) అఞ్చ్యః వఞ్చ్యకః— ఇత్యాదులయందు "అనుస్వారస్యయయి పరసవర్ణః" అను పాణినీయసూత్రంబున ననుస్వారాదేశంబయిన చకారాదులు, తత్సమభాషాభాగంబున నట్టిశబ్దంబులు తెలుంగులోనికి నేతెంచినతోడనే, తమకుస్థానియైన యనుస్వారస్వరూపంబు నాంధ్రభాషానుసారంగంజేసి యొందుచుండెడి. (1) రోచి, రోచులు (2) వీచి, వీచులు (3) వాజి, వాజులు— ఇత్యాదులయందు నాంధ్రభాషాపరిపాటింబట్టి భాషాంతరీయమైన దంత్య చ, జ, లచేతను సయితము ప్రాతిపదికంబులోని సాంస్కృతిక తాలవ్య చ, జ, లకు వికారంబుగలిగినప్పుడు తత్సమత్వంబునకు భంగంబు కలుగకయుండఁగా నిప్పుడను నాసికవర్ణంబులు తమస్థానియైన బిందుస్వరూపంబును బొందినంతమాత్రమున నట్టి తత్సమత్వవ్యవహారంబునకుఁ గొఱంత రానేరదనియే వారి తాత్పర్యము.

---

(1) అనుస్వార, విసర్గ జిహ్వామూలీయో, పధ్మానీయములు, 'అ ఇ ఉ ణ్' అనెడి సూత్రములోని యకారము తర్వాతఁ బఠింపఁబడెనని భాష్యము స్మరించునది; అనింద్యమైనదనియు నర్థాంతరము.

(2) వర్తులాకారమయినది; మంచిప్రవర్తనయు, మంచిరూపము, విలాసముగలదని యర్థాంతము. (3) ఏకస్యాం=నాసికాయాంజన్మః (సర్వనామమునకు వృత్తియందు పుంవత్త్వము) నాసిక యొకదానియందే పుట్టినది; ఒకజన్మమేయెత్తి అనుటచే జన్మాంతరమునకుఁ దగిన పాపములేక పుణ్యముగలదనియు నర్థాంతరము. (4) ముత్యమువలెనున్నది; జీవన్ముక్తమయినదనియు నర్థాంతరము. (5) వర్గములోనైదవ వర్ణంబులు; అంత్యవర్ణములోనివనియు నర్థాంతరము. (6) వ్రాయుటలో భేదముగలవని ఫలితార్థము; చెడురూపుఁ జెడ్డచేష్టయు గలవని యర్థాంతరము.

అజ్ఞ — అనెడి జకారఘటితశబ్దంబున "జ్ఞ" అనునట్టి విశిష్టములోనుండిన జకారమందు సానునాసిక్యకంఠ్యత్వములు, గ్రింది కకారమందుఁ గంఠ్యత్వము నున్నది గాన నట్టిసముదాయమందు నేకానునాసిక్య ద్విగుణకంఠ్యత్వంబులు వెలయుచుండు నని యీపఙ్క్తిలోఁ జెప్పితిని.

తోంక — అనెడి యనుస్వారయుక్తరూపమందున్న "ంక" అనునట్టి సముదాయములోనుండిన బిందువునకు సానునాసిక్యధర్మంబును, తర్వాతికకారమందుఁ గంఠ్యత్వము నున్నవి గావున నట్టిసంఘాతమందు నేకానునాసిక్యకంఠ్యత్వములు వర్తిల్లుచుండు. కనుక పైరూపద్వయంబులోఁ దారతమ్యము విమర్శించినచో నుభయత్ర సానునాసిక్య కంఠ్యత్వములు సమానముగానే యుండెంగాని రెండవరూపంబునఁ గంఠ్యద్విత్వంబుమాత్రంబుండనేరదు. అప్కః — ఇత్యాదిశబ్దంబులయందు "అచోరహాభ్యాం ద్వే" అనుసూత్రంబునఁ గకారమునకు ద్విత్వంబగుంగాన నొకమతంబున నుచ్చారణలోఁ గంఠ్యద్విత్వంబు స్ఫురించుటయు, "సర్వత్ర శాకల్యస్య" అను శాకల్యునిమతంబున నేకకంఠ్యత్వమే స్ఫూర్తి విషయమగుటయు, నెట్లుండునో యట్లే యంకశబ్దాదుల నుచ్చరించుచో గీర్వాణవ్యాకర్తల మతంబున ద్విగుణకంఠ్యత్వంబును నాంధ్రవ్యాకర్తలమతంబున నేకకంఠ్యత్వంబును స్ఫురించుననిన మతభేదంబుగలదు. వర్గీయాక్షరములకు ముందున పంచమవర్ణంబులే యుచ్చారణంబులో సంభవించుట (అనఁగా ద్విగుణ కంఠ్యత్వాదులు=) యనుభవసిద్ధంబుగా నున్నది గాని బిందూచ్చారణ మట్టులేదవియందు లేని యూహింపవలయు. సంస్కృతభాషలో "త్వఙ్ కరోషి. త్వంరోషి" ఇత్యాదిపదాంతస్థలంబున వర్గీయవర్ణంబులముందు బిందువుసాక్షికంబుగా నుచ్చారణంబులో ననుభవసిద్ధంబనియే గదా పాణినిచేత "వాపదాంతస్య" అను సూత్రమున విధింపఁబడినది. అందు ననెచ్చటను వర్గవర్ణంబులకు ముందు బిందువుచ్చారణంబులో లేదని యెంచఁగూడదు. మఱియు, ప్రకృతాంశములో గీర్వాణభాషను స్పష్టాంతముగా స్వీకరింపకొన్నవారికిని "వచ్చెం గమాలాత్ముఁడు" ఇత్యాదిపదాంతస్థలంబునఁ దెలుఁగుభాషలోఁగూడ బిందువుసాక్షికంబుగా నచ్చారణలో ననుభవసిద్ధంబే యనక తీరదు. సంస్కృతభాషలోఁ బోలెఁ దెలుఁగుభాషలో మేమును నేకపదంబునదుమబిందు ననుభవసిద్ధంబు గాదంచు నని మదూవుదురేని యట్టులు సర్వత్ర పదమధ్యంబున బిందువున్నచో [illegible] కృతప్రాకృతవ్యాకరణంబై.

పడ్భాషాచంద్రికయందు వకారాదిశబ్దంబులకు ‹‹రవలామసశ్చ›› (అ ౧ పా ౪ సూ ౭౨) అనుసూత్రమున రేఫలోపంబుగలిగి ‹‹సోః›› (అ ౨ పా ౨ సూ ౧౩) అనుసూత్రమునసైన ‹‹వకో›› అను రూపంబునకు ‹‹స్వరేభ్యోవక్రాదౌ›› (అ ౧ పా ౧ సూ ౪౨) అనుసూత్రంబునఁ బదమధ్యంబునఁ గల్గినబిందువునకు ‹‹వర్గేఽంత్యః›› (అ ౧ పా ౧ సూ ౪౭) అను సూత్రంబునఁ బాక్షికత్వంబంగీకరింపఁబడినది. మఱియు, ‹‹ఙ ఞ ణ నానాం›› (అ ౧ పా ౧ సూ ౪౧) అను సూత్రంబున (పరాఙ్ముఖః—పరంముహో) [కఞ్చుకః—కంచుఓ) ఇత్యాదిశబ్దంబులయందుఁ బాణినీయవ్యాకరణంబునసైన ఙకార ఞకారాదులకుఁ బ్రాకృతవ్యాకరణంబున వాల్మీకిమహర్షి చేత బిందువు విధింపఁబడియె. వ్యాకరణంబులోఁ బదాంతమునందుంబోలెఁ బ్రాకృతవ్యాకరణములోఁ బదమధ్యంబునను బిందువ్యాగమము పాక్షికంబుగా ననుభవసిద్ధంబైనట్టులు కరతలామలకంబుగా నిట్లు గానిపించుచుండె. సాంస్కృతికశబ్దంబులు శాస్త్ర (పకారంబునఁ బ్రాకృతభాషలో సంస్కరించుకొనుచోఁ బదమధ్యంబందలి పంచమవర్ణంబులిట్టులు పాక్షికంబుగా బిందువులగుచుండగాఁ నట్టి పంచమవర్ణపక్షపాతంబుం బాఱందోలి తెలుంగులోనికిం దెచ్చుకొన్న సాంస్కృతికపద [తత్సమపద] మధ్యమందుఁ గువలయానందంబైన బిందువే యెల్లప్పుడు నిందుసర్మంబౌ (ఇందుక్ = ఈతెగునందు; సర్మంబు = న్యాయము; దంపతిసదృశమనియు నర్థాంతరము) ననియెంచి యాంధ్రవ్యాకర్తలగు నన్నయభట్టారకాది సర్వజ్ఞులు (ఈశ్వరులును) సర్వదా దానిని శిరసావహించిరి.

అందువనే యాంధ్రతత్త్వవేత్తలమతంబున ననుస్వారయతి బిందుయతులు వేఱుగాఁ బేర్కొనంబడినవి. పంచమవర్ణంబులే యిందు నుచితంబైనచో ననునాసికాక్షర, సంయుక్తయతిభేదంబుననే గతార్థమగుంగాదే!! అజ్క—ఇత్యాదిశబ్దంబులయందలి కంఠ్యత్వతాల్వాదుల యుచ్చారణభేదం బప్పష్టభేదంబని యాంధ్రతత్త్వవేత్తల మతంబున నియ్యది యవివక్షితంబయ్యె. కావుననే ‹‹శత్రర్థేచూతచ్చానోః›› ఆం. శ. సంధిపరి. సూ. ౧౨ ‹‹తస్యాప్యచ్చు పూర్ణబిందురపి›› (సంధి. ప. సూ. ౧౩ = బాలవ్యాకరణక్రియాపరి. సూ. (౫౫) వర్తమానార్థకమైన యువర్ణకము పరమగుచో, అను మొదలగుధాతువులయొక్క ఉత్వంబునకు లోపంబుగాని లేక, మఱి బ్రహ్మానంబున బిందువున్నగాని యగునని సూత్రద్వయంబునకు ఫలితార్థము.) అని పైనింజూపిన బిందువిధా

యేకసూత్రంబు చరితార్థంబగుచున్నది, తెలుంగులో నాధునికులమతప్రకారంబున బిందువు రాక పంచమవర్ణంబే విధియైనందున నిట్టిచకారమెప్పుడును దంత్యంబేయగుం గాన నియ్యది పరమగుచప్పుడు (తమమతంబులోఁ బచ్చ, సజ్జ ఇత్యాదులుంబోలె) దంత్యానునాసికత్వధర్మద్వయంబుగల నకారమె నిత్యంబగుచుండఁగా మొదటిసూత్రమునసైన యీలోపమే సార్థకంబై రెండవసూత్రమునసైన బిందువిధానంబు వ్యర్థంబగును ఇట్టి పాక్షికబిందువిధానంబునఁ బ్రాచీనులమతంబులోఁ దెలుంగున బిందువే కాని పంచమవర్ణంబులు లేవని సిద్ధాంతమగుచున్నయది. కనుకఁ దెలుంగులోనికి ఞకారఙకారముల పూర్వము గా తేవలసినయవసరంబులేదు. మఱియు, "పతిచ్చ" ఇత్యాదిశబ్దములయందు నిట్టిలు దంత్యంబౌచకారాదులకు ముందు దంత్యానునాసికంబైన నకారమే విధాయకంబుగావున నాధునికులమతంబున మీఁదుమిక్కిలి యింకొకయనర్థంబును జేరంబడును.

శా॥ ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లు వో గాఁగఁబై
యంచుల్ మ్రోవఁగఁగౌఁగిలించి యధరంబాసింపవే !! శ్రీహరీ!
యంచున్ బ్రాహ్మణుఁడోరమోమిడి తదీయాంసద్వయంబంటి ప్రా
మ్మంచుం ద్రోచెఁగలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్॥ మను. ౨ ఆ.

ఉ. అంచితవాసనాకలిత యానము దేరఁగఁబంచినన్నె
క్కించి సహాధిరాధుఁడయి కేల్ దనకేలనమర్చి సత్క్రథా
పంచయవర్తనుండగుచుఁ జారుముఖాబ్జవికాసమొప్పన
ర్తించుచుఁ బుణ్యలోకములు ప్రీతిమెలర్పఁగ నాకుఁజూపినన్॥ భార. అను. ౨౩.

మొదటిపద్యమున మొదటిపాదములోని "ప్రాంచత్" అనుశబ్దంబు సాంస్కృతికంబై నందునఁ దాలవ్యమౌ చకారమునకు ముందుబిందువు ఞకారమై "ప్రాఞ్చత్" అని ప్రాసస్థానంబున ఞకార చకార సంయోగముండును. తక్కిన మూఁడుపాదములలోని "అంచు" శబ్దంబు తెలుఁగైనందున దంత్యమైన యీపంతచకారమునకు ముందున్న బిందువు నవీనులమతంబున నకారమై "అన్చు" అనురీతిని బ్రాసస్థానమున నుండవలసివచ్చును. ఇట్లే అంచిత సంచయశబ్దంబులు ప్రథమతృతీయపాదములు సాంస్కృతికములు గావ ననునాసికవర్ణఘటితములై "అఞ్చిత" "సఞ్చయ" అని యుండవలయు ద్వితీయపాద

చెప్పినారు. అర్ధమాత్రకాలముకంటె వర్ణంబులమధ్యను నెక్కుడుకాలము వ్యవధానమయినప్పుడు సంహితలేదని వ్యాకరణవేత్తలు నిశ్చయించిరి. సంహితాశబ్దమును సంధిశబ్దమును నొకధాతువు ననుసరించియే పుట్టినవిగానఁ బాఠకుడు వాక్యము చదువునప్పుడు గ్రుక్కయాపినచోటులనెల్ల నర్ధమాత్రాకాలముకంటె నెక్కువయెడముండునుగాన సంధియుండఁగూడదు. శ్రోతలకు వాక్యముయొక్క యర్థము బాగుగఁ దెలియుటకైతన యిచ్చవచ్చిన చోటులనెల్లను నాపుచు సంధిలేకుండఁ జదువవచ్చును. పద్యంబులలోని వాక్యంబులకుమాత్ర మిట్టివిధి చెల్లదు. సర్వదాపద్యంబు సంధియుక్తంబుగానే యుండవలయు. పద్యంబులో సంధి లేకుండెనేని పెద్దలచేనది యతిభంగమనునొక్క గొప్పదోషముగాఁ బరిగణింపఁబడియె. ఇట్టియాచారము చిరకాలమునుండియు రూఢమయి యున్నది. ఉదాహరణముగా శంకరమండనమిశ్రులవివాదములోని శ్లోకంబులు శంకరవిజయమునుండి యెత్తిచూపుచున్నాఁడను.

శ్లో॥ కర్మకాలే న సంభాష్య
అహంమూర్ఖ సంప్రతి
అహో ప్రకటితం జ్ఞానం
యతిభంగేన భాషిణా

శ్లో॥ యతిభంగే ప్రవృత్తస్య
యతిభంగో నదోషభాక్
యతిభంగే ప్రవృత్తస్య
పంచమ్యంతం సమస్యతాం॥ (8వ సర్గ, 27, 28, శ్లోకములు)

మండనమిశ్రులు మొదటిశ్లోకమునందు .నసంభాష్య—అహం, అని విసంధిగాఁ బలుకుటను విని యాదిశంకరులు దానిని యతిభంగదోషముగానెంచి యాక్షేపింపఁగా మిశ్రులవారు తగినసమాధానముచెప్పలేక యతిభంగమందు ప్రవర్తించినతనకు శ్లోకములోనియతిభంగము దోషముగాదని వక్రశ్లేషముగానుత్తరము చెప్పిరి. కావునఁ బద్యగతంబైనవాక్యంబునందు సంధితప్పక యుండవలయు.

---

## నుజ్యంతభవత్యర్థవిమర్శనంబు.

---

ఉ॥ మాకునతిప్రియుండవు సమస్తవిదుండవు చెప్పుమయ్య యీ
లోకములోనివర్తనములుండగువాని నెఱుంగ నవ్వనిం
బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁబురోహితుండుగాఁ
జేకొనువారమట్టి బుధసేవితుఁగానఁగమాకు నంపగదె॥ భార. ఆది. 8 ఆ.

పైపద్యంబున రేఖతో నిరూపింపఁబడిన "కాను" అను శబ్దంబు నుజ్యంతంబగు భూ (అగు) ధాతువు. అగుధాతువునకు నుజి పరమగునప్పుడు క్రి. పరి. (91) సూత్రమునఁ గాదేశము రాఁగాఁ నైన రూపంబు. ఈక్రియాపరిచ్ఛేదములోని (40) సూత్రమునందు మర్థమందును, భావలక్షణార్థమందును, నుజిప్రత్యయంబు విధింపఁబడుచున్నదిగదా!! ప్రకృతప్రయోగమందలి యగుధాతువున కేయర్థమందునుజిప్రత్యయంబు సంసిద్ధించునో కొంచెము విచారింతముగాక!! యజ్ఞదత్తుండు పురోహితుండుగాఁ (అగుచుండ) తలంచుచున్న వాక్యంబున ముఖ్యక్రియయగు తలంచుటకును, పురోహితుండగుటకును, యజ్ఞదత్తుఁడేకకర్తయైనట్టులు "బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ జేకొనువారము" అనువాక్యంబునఁ జేకొను క్రియకును బురోహితుండగుటకును నొకరు కర్తగానందునఁ నుజర్థంబిట సందర్భయుక్తంబుగానేరదు. ప్రకృతపద్యంబునఁ బ్రకరణసందర్భమునంజేసి యుజ్ఞానాదులం జేకొనువారును, బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండగువాఁడుగాన నగుధాతు చేకొనుధాతువులకుఁ గర్తలు వేర్వేఱగుచుండుట స్పష్టమగుచున్నది. "బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండుగా నజ్ఞానాదులు ప్రసిద్ధిని జేకొనిరి" యనున్న వాక్యంబునఁ జేకొనుధాతువునకుఁ గర్మము ప్రాపకమై పురోహితుండగుటకుఁ గర్తయైన బ్రాహ్మణముఖ్యుఁడు ప్రథమాంతపదముచే బోధింపఁబడినట్లు లేవాక్యమున నుండిలేదుగాన నిట భావలక్షణార్థంబును బొసంగనేరదు. ఈవాక్యంబున రేఖానిర్దిష్టములైన రెండు క్రియలలోఁజేకొను క్రియలక్ష్యము. "కాఁగ" (అగు) అను క్రియలక్షణము. ఈలక్ష్యలక్షణక్రియలకు రెండింటికిని బ్రథమాంతములచేతఁ జెప్పంబడి యుజ్ఞానాదులును, బ్రాహ్మణముఖ్యుఁడును గర్తలుగా నన్వయించుచుండిరిగావున భావలక్షణార్థము సమంజస

మగుచుండును. ఇఁకను «బ్రాహ్మణముఖ్యుఁబురోహితుండుగాఁ జేకొనువారు» నన్న పద్యవాక్యంబందునో!! బ్రాహ్మణముఖ్యుఁడు చేకొనుధాతువునకుఁ గర్మంబుగానన్వయించుచు ద్వితీయాంతపదంబుచేఁ దెలుపంబడుచుండెంగాని ప్రథమాంతంబునఁ «గాన్» అనుక్రియతో నన్వయించుచుండలేదుగాన నియ్యది భావలక్షణార్థంబున కుదాహరణంబుగా నుండనేరదు. అందునఁ బైపద్యమందలి యగుధాతువునకుఁ (కాన్) దుమర్థభావలక్షణార్థంబులలో నేదియు సందర్భింపకయున్నందునఁ గారకపరిచ్ఛేదములోని (3౨) సూత్రమున బ్రాహ్మణముఖ్యశబ్దంబునకుంబోలె విశేషణమైన పురోహితశబ్దంబునకు బ్రథమావిభక్తి సంగతంబుగాఁ గానిపింపదు. ఒకవేళ బ్రాహ్మణముఖ్యుఁడు చేకొనుధాతువునకుఁ గర్మంబైనందున నీపద్యవాక్యంబులో «గాన్» క్రియకుఁ గర్తగాకున్ననుబురోహితుండట్టి క్రియతోఁ గర్తగా నన్వయించుచున్నందున నిట భావలక్షణార్థంబున నజిప్రత్యయంబు రాఁగాఁ గారకపరి. (3౨) సూత్రంబునఁ బ్రథమావిభక్తియుండవచ్చునందురేని యట్లనవలదు. అట్టి భావలక్షణార్థమే యీపద్యంబున గ్రహింపబడినచోఁ, «బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండుగా నర్జునాదులు ద్రౌపదిం జేకొనిరి» యన్నవాక్యంబునఁ గర్మంబైన ద్రౌపది బ్రాహ్మణముఖ్యునికంటె వేఱుపదార్థమైనట్టులు, ఇచ్చటంగూడఁ గర్మంబైన బ్రాహ్మణముఖ్యుఁడు ప్రథమాంతపదబోధ్యుండైన పురోహితుండుగాక వేఱొకండుగా నున్నట్టులు తోఁచిపద్యంబున నపార్థము సిద్ధించును.

అనఁగాఁ బైపద్యమందలి చేకొనుక్రియనులక్ష్య (జ్ఞాప్య) క్రియఁగాను, దానికిఁ «గాన్» అనునజివర్ణకాంతభవతి (అగు) క్రియను లక్షణ (జ్ఞాపక) క్రియఁగాను భావించి యీలక్షణక్రియకుఁ గర్తగాఁ బురోహితుండన్వయించునని యెంచి కారక. ప. 3౨ సూత్రమునఁ బ్రథమవచ్చునని భావలక్షణార్థము చెప్పికొన్నచో నట్టియెడనీవాక్యంబునకు, నర్జునాదులు వేఱొక పురోహితుండు దగ్గరనుండఁగాఁ బూర్వోక్తదృష్టాంతవాక్యమందలి (ద్రౌపదినిబోలె) నొకబ్రాహ్మణముఖ్యునిఁ జేకొన నుద్దేశించిరియన్న పరిహాస్యార్థమాయి పురోహితుండు బ్రాహ్మణముఖ్యునికంటె వేఱుగానున్నట్లు తోఁచును. సిద్ధాంతములో బ్రాహ్మణముఖ్యునే పురోహితుండగుటకు నుద్దేశించినటులతోఁచుచున్నందున నిట్టిస్థలంబులందుఁ «గాన్» అనుక్రియ యుద్దేశ్యవిధేయభావముం దెల్పుంగాని భావలక్షణార్థంబును బోధింపదు, ఇటవేఱొకండుగాక బ్రాహ్మణముఖ్యుఁడే పురోహితుండని సామానాధికరణ్యము తోఁచుచున్నందున «సామానాధికరణ్యాద్భిన్నాది

భోద్వితీయాభవిష్యతి, కటంకరోతిభీష్మముదారంశోభనందర్శనీయమితి" అని "అనభిహితే" (అ. 2 పా. 3 సూ. 1) అనుసూత్రంబునఁ బతంజలిభగవానులు కర్మవాచకంబైన కటశబ్దంబునకు విశేషణంబులైన భీష్మాదిశబ్దంబులకంటె ద్వితీయావిభక్తి గలుగునని నిశ్చయించినట్లే యిచ్చటంగూడఁ గర్మవాచకంబైన బ్రాహ్మణముఖ్యశబ్దమునకు విధేయవిశేషణమైన పురోహితశబ్దంబునకంటె ద్వితీయావిభక్తి యుత్పత్తిల్లునని సిద్ధాంతపఱుచుట న్యాయంబుగదా! ఒకవేళఁ "గాన్" అను నుపవర్ణకంబు కర్త్రర్థకమని యెంచి పురోహితపదార్థమును దానికిఁ గర్తగానున్నట్టులు వివక్షచేసినను, గారకప్రకరణస్థప్రథమసూత్రంబున, ప్రథమావిభక్తికిని గర్త్రర్థక బ్రాహ్మణముఖ్యునితో సామానాధికరణ్యమునకుంజేసి ద్వితీయసూత్రంబున ద్వితీయావిభక్తికిని, పురోహితశబ్దముకంటె ప్రసక్తి కలుగుచుండఁగా, శ్రీ. ప. 50 సూత్రమున వ్యాకరణాంతర్గత నిత్యత్వన్యాయంబంగీకరించినరీతిని నిచ్చటఁ బరత్వన్యాయం బవలంబించుట యుక్తంబుగాన "విప్రతిషేధేపరంకార్యం" (అ.1 పా. 4 సూ.2) అను శాస్త్రంబునఁ "గర్మంబువద్వితీయయగు" అను పరసూత్రవిధాని ద్వితీయావిభక్తియే యిట నిస్సంశయంబుగా నివ్వటిల్లుననుట యొప్పుకొనకతీరదు. కావున నింక విస్తరంబుతోఁ జాలును. అందునసర్వవిధంబులను "పురోహితునిఁగా" అను ద్వితీయాంతమే యుండవలయును పైనింజూపిన చర్చంజేసి యిట్టిస్థలంబులందు వ్యాకరణంబునవిధించిన తుమర్థముగాని భావలక్షణార్థముగాని సందర్భపడనందున "న్యాయముగాను" ఇత్యాదులయందుఁ "గాను" శబ్దంబు క్రియావిశేషణమన్న యంశమును మాత్రము సూచించినరీతినే యిట్టివిశేషణంబున కనుప్రయుక్తంబైన యాశబ్దంబు [కాను] విధేయవిశేషణమన్న సంగతినే బోధించుంగాని యన్యదర్థంబును దెలుపదన్న యంశం బార్యవ్యవహారంబులఁ దేటపడుచున్నది. కావుననే యీక్రింది ప్రయోగంబులు సాధువులగుచున్నవి.

చ॥ పరిచరుఁగాఁగనేలెనిరపాయునరిఘ్నునిఁ బాకశాసన । స్ఫురదురువీతిహోత్రుని
సముజ్జ్వల మేరుసమానగాత్రునిన్ । బరమపవిత్రునిన్ మునిసుపర్వనగస్తుతిపాత్రునిన్మనో ।
హరఫల శేముషీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్ ॥ శ్రీరంగమాహాత్మ్యము.

ఉ. శ్రీగజగామినీమణిని సీతనుగా నిరపాయిఁగాఁ ద్రిలో
కీగృహమేధిఁగాఁ గరుణ కేతనుఁగాఁ భవరోగవైద్యుఁగా

నాగురువాననిన్నెమది నమ్మితివేఱొక వేల్పుఁగొల్వనీ
వేగతికావవే రఘుపతీ! శరణాగత వజ్రపంజరా!! వజ్రపంజరశతకము.

కం. ఏవానిబంధుమిత్రులు, జీవధనమ్ములనుదప్పిఁ జెందునుగృశునిం। గావాని నెన్నఁగాఁదగుఁ। గేవలతనుకార్శ్యయుతుఁడు కృశుఁడె నరేంద్రా!! భార. శాం. ౧. ఆ.

కం. ధృతి నెవ్వని నేనిఁబురో। హితుఁగాఁబుణ్యమునఁబడని యిక్ష్వాకులో। స్థితులైనపతులు రాజ్యో। న్నతినొప్పమఁజేసి రుర్వినానాక్రతువుల్॥ ఆది. భార. ౭ ఆ.

కం. అన్నలుదమ్ములుగలుగుట। యున్నతుఁగాఁ జేయునెంతయును నృపతిందా మన్ననయునీగియునుసం। పన్నంబులుగాఁగవారిఁ బాటించుటగుణ్॥ భా. శాం. ౨ ఆ.

ఇత్యాదిప్రయోగంబులు పరిశీలింపఁగా విశేష్యము ద్వితీయాంతమయ్యోనేనివిధేయవిశేషణత్వసూచకంబైన నుజీవర్ణకాంతభూ (అగు) ధాతువున కుపపదంబై ద్వితీయాంతవిశేషణమే విశేష్యానుసారంబుగా నుండవలయునని తేటపడుచున్నది.

విశేష్యము ప్రథమాంతమయ్యోనేని, యపుడనుప్రయుక్తంబై ననుజీవర్ణకాంత భూ (కాను) ధాతువుతో విశేషణమును బ్రథమాంతమై యుండందగు.

తే. బోఁటిఖొకతె పెండ్లి పాటపాడఁగఁజొచ్చె। నాఁపరానివిరహతాపమునను। బేరుగూర్చితాను బెండ్లికూఁతురుకాఁగ। గోత్రధరుఁడు పెండ్లికొడుకుగాఁగ॥ ఇత్యాదులుదాహరణంబులు. ప్రకృతమందలి "బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగా" నన్న పద్య ప్రయోగంబునకు శరణంబేమని యడుగుదురేని, యిట యతిప్రాసాదుల బాధలేదుగాన "బ్రాహ్మణముఖ్యుఁ బురోహితేంద్రుఁగా" (పురోహితశ్రేష్ఠునిగా) ననియే సంప్రదాయపాఠంబున్నట్లూహించినచో మేలుగానుండును. అటుగాక యీప్రథమాంతపాఠమే సాధువుగాఁ నుండందగునన్న యభినివేశమున్నయెడ "స్థితస్యగతిశ్చింతనీయా" యనున్యాయంబున నీక్రింది యగతికగతి నవలంబించి సవరణచేసికొనం జనుః—

శ్లో। "యామాహుస్సర్వభూత ప్రకృతిరితియయాప్రాణినః ప్రాణవంతః" అను

శాకుంతలీయశ్లోకంబునందును, శ్లో॥ "విభుర్విభక్తావయవంపుమానితిక్రమాదముం నారద ఇత్యబోధిసః" అనిన శిశుపాలవధయందలి శ్లోకంబునందును, క్రమంబుగా "యాం" అను ద్వితీయాంతమునకు "సర్వభూతప్రకృతి" శబ్దంబు విధేయవిశేషణంబైనను, ద్వితీయశ్లోకమందు "అముం" అనిన ద్వితీయాంతమునకు "నారద" శబ్దంబు విధేయవిశేషణంబైనను, నిపాతంబైన యితిశబ్దంబునభూతప్రకృతనారదులయందలి కర్మత్వంబు చెప్పంబడినందునఁ క్రమంబుగాభూతప్రకృతినారదశబ్దంబులకంటెఁ ప్రాతిపదికార్థమందుఁ బ్రథమావిభక్తి "సూ॥ నిపాతేనాప్యభిహితే కర్మణినకర్మవిభక్తిః, పరిగణనస్యప్రాయికత్వాత్" (అధికరణం ౫ అ ౨ సూ. ౨౨) అనుసూత్రమున వామనాదిప్రాచీనుల మతంబునందుఁ బ్రవర్తిల్లఁగాఁ బ్రథమాంతములైనభూతప్రకృతినారదశబ్దంబు లెట్లుసాధువులుగాఁ దలంపఁబడియెనో యట్లే ప్రకృతంబునఁ "బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగా" ననుపద్యమందు ద్వితీయాంతమయిన బ్రాహ్మణముఖ్యశబ్దంబునకుఁ బురోహితశబ్దంబు విధేయవిశేషణంబైనను "కాను" అనునవ్యయంబు ఇతిశబ్దార్థకంబని (అని యనియెడి యర్థముగలదని) యంగీకరించి యట్టి యవ్యయంబునఁ బురోహితుని యందలి కర్మత్వము చెప్పంబడినందునఁ బురోహితశబ్దంబుకంటెఁ బ్రాతిపదికార్థమందుఁ బ్రథమావిభక్తి ప్రవర్తిల్లినదని సౌకర్యంబున సవరించుకొని నచో "బ్రాహ్మణముఖ్యునిఁ బురోహితుండని చేకొనువార" మనిన సరసార్థంబున నట్టి ప్రథమాంతపురోహితశబ్దంబు సమంజసంబయ్యెడునని యెఱుంగునది.

ఇట్టిలింకను వ్యాకరణసూత్రపరిగ్రహంబున నిర్ణయింపశక్యముగాని సశేషవిషయంబు లార్యులపదపఙ్క్తి విన్యాసంబు పరిశీలించి నిశ్చయించికొనుచు శాస్త్రమర్యాదం బ్రవర్తిల్లుట పరమశ్రేయంబు.

(మూలము) శ్లో॥ శ్రీస్తనాంచితకస్తూరీ। పంకసంకలితోరసే
పంకజాక్షాయనాథాయ వేంకటేశాయమంగళమ్॥

వ్యా — లక్ష్మీదేవిస్తనములయందుఁ బూజ్యమైయున్న కస్తూరీపంకముతో మిళితంబైన వక్షస్థలంబునాటిల్లఁగాఁ బంకజనేత్రుండై పరఁగుచున్న వేంకటేశ్వరస్వామికొఱకు మంగళంబయ్యెడుమని యాశాసించుచు గ్రంథకర్త "కవి వేంకటనాయకః" అను న్యాయంబును స్మరింపించుచుండెను.

శ్లో॥ సర్వపాపాని వేం ప్రాహుః। కటస్తద్దాహ ఉచ్యతే। సర్వపాపదహో యస్మాద్వేంకటాచల ఇత్యభూత్ — అనిన బ్రహ్మాండపురాణవచనంబున సర్వపాపదాహకంబగు “వేంకట” బిరుదంబుతోఁ బ్రబలియున్న భగవానుని స్మరించినచో జ్ఞానాజ్ఞానకృతసకల దుర్దోషంబులును దొలంగునన్న దృఢవిశ్వాసంబున భక్తభాగధేయంబగు వేంకటనామధేయంబుననే పైశ్లోకంబును గ్రంథకర్త యనంబడుచిన్నయసూరి సమకూర్చెడునన్నతత్త్వంబును దెలియునది. ఈశ్లోకంబున “శ్రీస్తనాంచిత.....తోరసే,, అను శబ్దంబు బహువ్రీహిసమాసంబు. ఉరశ్శబ్దాంతమైన బహువ్రీహికి సంస్కృతవ్యాకరణంబున సమాసాంతమైన కప్ప్రత్యయంబు “ఉరఃప్రభృతిభ్యః కప్,, (అ.౫ పా.౪ సూ.౧౫౧) అను సూత్రంబునఁ గలిగి “శ్రీస్తనాంచితకస్తూరీ। పంకసంకలితోరస్కాయ,, అని యిట్లుండవలయును. శబ్దసాధనంబునకు యత్నంబుచేసినం బద్యలక్షణంబునకు భంగంబు గలుగును. ఒకవేళ “సమాసాంతవిధిరనిత్యః,, అనుపరిభాషవశంబునఁ గప్ప్రత్యయం బనిత్యంబని యంగీకరించినచోఁ బూర్వోక్తప్రయోగంబు సాధువగునందుకేని యటులనందగుఁ బ్రాచీనకవికృతమైన యొకమహాగ్రంథములో నెచ్చటనైన నిట్టి నలుసుండెనేని యచ్చటనిట్టి యనిత్యత్వపక్షం బంగీకరించి దోషపరిహారంబు చెప్పినం బాగుండును గాని ప్రకృతంబున రచియించిన యొక్కయనుష్టుప్ శ్లోకములోనే యిట్టి యనిత్యత్వపక్షావలంబనం బగతికంబై తోఁచెడిని. “ద్విత్రిభ్యాంపాద్దన్మూర్ధసుబహువ్రీహౌ” (అ.౬ పా.౨ సూ.౧౯౭) అను సూత్రముననైన యనిత్యత్వజ్ఞాపకత్వమున “శ్లో॥ చతుర్దశసహస్రాణి। రక్షసాంభీమకర్మణాం। త్రయశ్చదూషణఖరత్రిమూర్ధానో రణే హతాః,, ఇత్యాద్యుత్తరరామచరితాదిపూర్వకవిప్రయోగంబులు సయితము సాధువులనుట యిష్టములేక వ్యాఖ్యాతలచేత నన్యథా సవరింపఁబడినవి. ఇంతియకకాక, ఉరశ్శబ్దాంతమైన బహువ్రీహిలోఁ గప్ప్రత్యయంబునకు ననిత్యత్వపక్షంబంగీకరించినానిరీతి యే కవిప్రయోగమందును గానరాకున్నయది. శ్లో॥ వ్యూఢోరస్కో వృషస్కంధస్సాలప్రాంశుర్మహాభుజః॥ అను కాళిదాసప్రయోగంబును “వ్యూఢోరస్కేన, మహోరస్కేన,, అనిన హాయవరట్ సూత్రస్థభాష్యకారప్రయోగంబులును, నురశ్శబ్దాంత బహువ్రీహివిషయములోఁ గప్ప్రత్యయంబున కనిత్యత్వపక్షం బంగీకరించి యీపూర్వోక్తప్రయోగంబును సాధువుగాఁ జేయుటకు బ్రబలప్రతిబంధకంబులుగా నున్నవి గావున నియ్యదియిట్టి యనన్యసాధారణవ్యాకరణగ్రంథమునకు రచనాకర్తయనిపించుకొనుసూరిగారియెడ నాశ్చర్యజనకంబనక తీరదు.

అర్థము:—శ్రీకృష్ణమూర్తి తనమూలమున, నేసర్పము యొక్క ప్రయాణముగలుగంగ, దూషితమైన యమునానదీ జలామృతమ్మును రసజ్ఞులను ద్రాగంగజేసెనో! యజ్ఞానంబున దూషితమైనట్టి యాసర్ప గ్రామణి కాళీయనామమ్ము నీభుజంగ ప్రయాతవృత్తమునఁ బొందుపఱుప నభ్యసింతుముగాక!!

ఆనందగోష్ఠీ సుధీమణులారా!!

యమునానదినుండి భగవంతునిచే బహిష్కరింపఁబడిన కాలసర్పముయొక్క సంజ్ఞాపదంబు కాళియశబ్దముగాని దీర్ఘమధ్యమగు కాళీయ శబ్దము గాదనియు, అందుననే యాప్టెనిఘంటువునందు హ్రస్వమధ్యము గా వ్రాయఁబడిన దనియుఁ గొందఱు ధీమంతులు ఘోషించుచుండెదరు. ఆధునికమైన పూర్వోక్తనిఘంటువునందుఁ జైశబ్దములోని ద్వితీయవర్ణము హ్రస్వముగా వ్రాసినంతమాత్రమున దీర్ఘరాయుక్తము గాదదనుట యాలోచింపఁగా నంత తృప్తికరమైన యుక్తిగాఁ గానిపింపదు. ఆ నిఘంటువునందును గొన్నిశబ్దములందు 'గొంత వ్యుత్పత్తిపక్షముసూచింపఁబడియు, నీశబ్దము నొద్దమాత్రమవ్యుత్పత్తిపక్షమే యంగీకరింపఁబడి నిశ్శబ్దమవలంబింపఁబడినది హ్రస్వమధ్యమగు కాళియశబ్దమే శిష్టప్రయోగమని వాదించువారలు సైతము శ్లో॥ "సంజ్ఞాసుధాతురూపాణి ప్రత్యయాశ్చతతఃపరే। కార్యాద్విద్యాదనూబంధమే తచ్ఛాస్త్రమునాదిషు" అను వచనమునం జేసియు "సంజ్ఞాసుధాతు రూపాణీతితు, అనాది శిష్టప్రయోగసాధనే ఉపాయమాత్రమ్, నత్వాధుని క్రియమాణ సంజ్ఞాను గ్రాహకమితిభావః॥ అనెడి ఋశిక్ సూత్రస్థమైన భాష్యప్రదీపోద్యోతమునం జేసియు, నాశబ్దమును నించుకంతైనను వ్యుత్పత్తి పక్షంబునకు వశవర్తిం జేసి కాళీయశబ్దము శాస్త్రవాసనా దూరవర్తియని ఋజువుచేసినచో నపుడు "సమానేచార్థే శాస్త్రాన్వితో౽ శాస్త్రాన్వితస్య నివర్తకో భవతి। తద్యథా, దేవదత్తశబ్దో దేవదిణ్ణశబ్దం నివర్త